# కన్యాశుల్కము

## హాస్యరసప్రధానమగు నాటకము



9055

శ్రీ శ్రీ శ్రీ హర్ హైనెస్

ది మహారాజ కుమారికా సాహేబా

ఆఫ్ విజయనగరం మహారాణీ ఆఫ్ మాధోగడ్, రీవా,

సర్కార్‌వారి భృత్యుడగు,

## గురజాడ అప్పారావుగారిచే

రచియింపబడినది

పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1947

రిజిష్టర్డు

వెల రు 1—12—0

# హెచ్చరిక

ఈ "కన్యాశుల్కము" అను నాటకముయొక్క శాశ్వత ప్రింటింగు హక్కు స్టేజి హక్కు పూర్తిగా మాకు చెందియున్నది. కాబట్టి మా లిఖితరూపకమైన అనుమతిని పొందనివారు యీనాటకమును ప్రదర్శింపగూడదు.

ఇట్లు
కాపీరైటు హక్కుదారులు,
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,
రాజమండ్రి.

శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాల. రాజమండ్రి. ఇ. జి. 14_1000.

# పాత్రలు

1. అగ్నిహోత్రావధానులు—కృష్ణారాయపురం అగ్రహారీకుడు.
2. వెంకమ్మ—అతనిభార్య.
3. బుచ్చమ్మ—పెద్దకూతురు, వితంతువు.
4. సుబ్బమ్మ—రెండవకూతురు.
5. వెంకటేశం—కుమారుడు.
6. కరటకశాస్త్రి—అగ్నిహోత్రావధానులు బావమరది. విజయనగరం సంస్కృత నాటకకంపెనీలో విదూషకుడు.
7. కరటకశాస్త్రియొక్క శిష్యుడు, పెళ్ళికూతురువేషము, దాసరివేషము వేయును.
8. లుబ్ధావధానులు—రామచంద్రపురం అగ్రహారీకుడు.
9. మీనాక్షి—అతనికుమార్తె వితంతువు.
10. రామప్పంతులు—రామచంద్రపురం అగ్రహారం కరణం.
11. గిరీశం—లుబ్ధావధానులుపినతల్లికొడుకు. వెంకటేశముకు చదువుచెప్పుఅయ్యవారు
12. సౌజన్యారావుపంతులు—వకీలు.
13. భీమారావుపంతులు—ప్లీడరు.
14. నాయుడు—ప్రైవేటు వకీలు.
15. పూజారి గవరయ్య—వైద్యుడు, మాంత్రికుడు.
16. మధురవాణి—వేశ్య.

డిప్టీకలక్టరు, హెడ్‌కనిస్టేబు, పోలిశెట్టి, సిద్ధాంతి, బైరాగి, దుకాణదారు, గ్రామమునసబు, హవల్దారు, యోగిని, లుబ్ధావధానులుయొక్క నౌకరు, అసిరిగాడు, మనవాళ్ళయ్య, వీరేశ.

## కళింగరాజ్యములో మాటలాడుకొను కొన్ని మాటలకు అర్థము.

గుంట=ఆడపిల్ల.
పీక=కంఠము.
పేకాట=చీట్లాట.
బుఱ్ఱ=తల.
సాని=వేశ్య.

---

## గర్భవతి

రచయిత : కోపల్లి వేంకట రమణారావుగారు

పుష్పవతియై యింట్లోఁ గూర్చొని, తలిదండ్రులుఁ గుదిర్చిన వరునిఁ బెండ్లి చేసికొనక - రహస్యముగాఁ దానొకనినిఁ బ్రేమించి, వానివలన గర్భముఁ గాంచి యతనినిఁ దక్క వేరొక్కని నొల్లనని ప్రతినఁగొన్న "చంద్రలేఖ" యను నొక సుందరాంగి కష్టకథ. ఆమె గర్భమును విచ్ఛిన్నముఁ జేసి తన శిష్యుని కిచ్చి వివాహము జేసెదమని సిద్ధాంతిగారు, వారిభార్య సూరమ్మగారు; వీరినిఁ దప్పించుకొనిపోయి తన మనోరథ మీడేర్చుకొనదలంచిన చంద్రలేఖ - ఆమెను వివాహ మాడుటకుఁ దలిదండ్రు లొప్పుకొనక పోయినను, ఆమె సాంగత్యముఁ బాయలేని కమలాకరము - ఇలు విడి పారిపోయినతరువాత వారు పడు కష్టములు - తనకుఁ బెండ్లి చేసెదమన్న పిల్ల పారిపోయిన నామెను వెదకు వీరంభొట్లు - సిద్ధాంతిగారి శిష్యుఁడు - వేరొక వ్యక్తి - సత్రము గుమాస్తా - దురాశలు విఫలమనోరథులగుట - ఎడనెడ తగవులాటలు - వృథా ప్రలాపములు నవ్వు కలిగింపక మానవు. మే మెప్పుడును నవ్వమని భీష్మించుకొని కూర్చున్నవారికిఁ గూడ వీరంభొట్లు, సత్రంగుమాస్తా సంభాషణములు గిలిగింతలుకలుగ జేయకమానవు. నిజముగా నిట్టి సాంఘిక నాటక మిదివరకు తెలుగుభాషలో లేదు. విశేష నాట్యకళానుభవము గలిగిన కోపల్లివారి కలమునుండి వెలువడిన సరిక్రొత్త సాంఘిక నాటకము.

వెల రు 1—0—0



# కన్యాశుల్కము — ప్రథమాంకము

## ౧-వ స్థలము: విజయనగరములో బొంకులదిబ్బ.

[గిరీశము ప్రవేశించును.]

గిరీశ — సాయంకాలమైంది. పూటకూళ్ళమ్మకు సంతలో సామాను కొనిపెడతానని నెలరోజులకిందట యిరవైరూపాయలు పట్టుకెళ్ళి డాన్సింగర్లుకింద ఖర్చుపెట్టాను, యీవేళ ఉదయం పూటకూళ్ళమ్మకీ నాకూ యుద్ధమైపోయింది. బుఱ్ఱబద్దలు కొడదామా అన్నంత కోపం వచ్చిందిగాని, పూర్రిచ్చర్డు చెప్పినట్లు పేషెన్సు వుంటేగాని లోకంలో నెగ్గలేం. ఈలా డబ్బులాగేస్తే యిదివరకు ఎన్నిపర్యాయములు వూరుకుందికాదు. ఇప్పుడేదో కొంచెం డాన్సింగర్లుమాట ఆచోకీ కట్టినట్టు కనబడుతోంది. ఓర్చలేని వెధవ యెవడైనా చెప్పి వుంటాడు. ఉదయం కథ ఆలోచిస్తే యిటుపైని తిండి పెట్టేటట్టు కానరాదు. ఈవూళ్ళో మరి మన పప్పు వుడకదు. ఎటు చూసినా అందరికీ బాకీలే. వెంకటంతులుగారి కోడలికి లవ్ లెటర్ రాసినందుకు యెప్పుడో ఒహప్పుడు సమయం కనిపెట్టి దేహశుద్ధి చేస్తారు.

Can love be controll'd by advice?
Will cupid our mothers obey?

శీఘ్రంగా యిక్కణ్ణించి బిచాణా యెత్తివెయ్యడమే బుద్ధికి లక్షణం; గాని మధురవాణిని వదలడవంటే యేమీ మనస్కరించకుండా వున్నది.

It is women that seduce all mankind.

నేను రేపో మాపో ఉద్యోగాలూ ఊళ్ళూ యేలి తనతో వైభవం వెలగిస్తాననే నమ్మకంతో వుంది, పూర్ క్రీచర్!

ఎవరా వస్తున్నది? నా ప్రియశిష్యుడు వెంకటేశ్వర్లులా ఉన్నాడు. ఈవేళ క్రిస్మిస్ శలవులు యిచ్చివుంటారు. వీడివైఖరి చూస్తే పరీక్ష ఫేలైనట్టు కనబడుతుంది. వీణ్ణి కొంచెం వోదార్చి వీడికి శలవుల్లో చదువుచెప్పే మిషమీద వీడితో వీడివూరికివుడాయిస్తే చాలాచిక్కులువొదుల్తాయి; అట్నుంచినరుక్కురమ్మన్నాడు.

[వెంకటేశం ప్రవేశించును]

యేమివాయ్ మైడియర్ షేక్స్పియర్, ముఖం వేలవేసినావ్?

వెంక — ఇక మీర్నాతో మాట్లాడకండి. మా మాష్టరు మీతో మాట్లాడొద్దన్నాడు. మీసావాసం చేయడంచేత నాపరీక్ష పోయిందని అన్నారు.

గిరీ — నాన్సెన్స్, మొదట్నుంచీ నేను అనుకుంటూనే ఉన్నాను. నీమాష్టరుకి నన్ను చూస్తే కిట్టదు. అందుచాత నిన్ను ఫెయిల్ చేశాడుగాని లేకుంటే నువ్వేవిఁటి ఫెయిల్ కావడవేఁవిఁటి! అతనికీ నాకూ యెందుకు విరోధం వచ్చిందో తెలిసిందా? అతను చెప్పేదంతా తప్పులతడక. అది నేను న్యూస్‌పేపర్లో యేకేశాను, అప్పట్నుంచీ నేనంటే వాడికి కడుపుడుకు.

వెంక — మీవల్ల నాకు ఒచ్చిందల్లా చుట్టకాల్చడం వొక్కటే. పాఠం చెప్పమంటే యెప్పుడు కబుర్లు చెప్పడవేఁగాని ఒక్కమారయినా ఒకముక్క చెప్పిన పాపాన్ని పోయినారూ?

గిరీ — డామిట్. ఇలాంటి మాటంటె నాకు కోపం వొస్తుంది. ఇది బేస్ ఇన్గ్రాటిట్యూడ్. నాతో మాట్లాడడవేఁ ఒక ఎడ్యుకేషన్. ఆమాటకొస్తె నీకున్న లాంగ్వేజి నీమాష్టరుకుందీ? యిదో మారియేజి విషయమై, నాచ్చి కొశ్చన్ విషయమై యెన్ని లెక్చర్లు యిచ్చాను! నాదగ్గిర చదువుకున్నవాడు ఒహడూ అప్రయోజకుడు కాలేదు. పూనా డక్కన్ కాలేజీలో నేను చదువుతున్నప్పుడు ది ఇలెవెన్ కాజస్ ఫర్ది డిజనరేషన్ ఆఫ్ ఇండియాను గూర్చి మూడు ఘంటలు ఒక్కబిగిని లెక్చర్ యిచ్చేసరికి ప్రొఫెసర్లు డంగయిపోయినారు. మొన్న బంగాళీ వాడు యీవూళ్లో లెక్చరిచ్చినప్పుడు ఒకడికైనా నోరు పెగిలిందీ? మనవాళ్ళు వొట్టి వెధవాయిలోయ్, చుట్టనేర్పినందుకు థాంక్సు చెయ్యక, తప్పు పట్టుతున్నావ్? చుట్టకాల్చడంయొక్క మజా నీకు యింకా బోధపడకపోవడం చాలా ఆశ్చర్యంగా ఉంది. చుట్టకాల్చబట్టే కదా దొరలింత గొప్పవాళ్ళయినారు. చుట్టకాల్చని యింగ్లీషువాణ్ణి చూశావూ? చుట్టపంపిణీమీదనే స్టీముయంత్రం వగయిరా తెల్లవాడు కనిపెట్టాడు. లేకపోతేవాడికి పట్టుబడ్డా? శాస్త్రకారుడు యేవఁన్నాడో చెప్పానే,

సూతఉవాచ — క॥ ఖగపతి యమృతము తేగా - భుగభుగమని పొంగి చుక్క భూమిని వ్రాలెన్ - పొగచుట్టయి జన్మించెను - పొగతాగనివాడు దున్నపోతైపుట్టున్॥ ఇది బృహన్నారదీయం నాలుగవ ఆశ్వాసంలో ఉన్నది. అది అలా వుణ్ణీగాని నీఅంత తెలివైన కుఱ్ఱవాణ్ణి ఫెయిల్ చేసినందుకు నీమాష్టరుమీద నావొళ్ళు మహా మండు

తూంది. ఈమాటు వంటరిగా చూసి వొక తడాఖా తీస్తాను. నీవు శలవుల్లో యిక్కడుంటావా వూరికి వెళతావా?

వెంక—వెళ్ళాలనుందిగాని, ప్యాసుకాలేదంటే మాతండ్రి చావకొడతాడు.

గిరీ—అగండంత స్పేషుఉపాయం నేచెబుతాను, నేచెప్పినట్లల్లా వింటానని ప్రమాణం చేస్తావా?

వెంక—(గిరీశం కాళ్ళుపట్టుకొని) మీశలవు యెప్పుడు తప్పేను? మాతండ్రికి మాచెడ్డ కోపం. ప్యాసు కాలేదంటే యెముకలు విరగ్గొడతాడు. (కన్నీరు చేత తుడుచుకొనును.)

గిరీ—దటీజ్ టెరిబుల్. యిదే బంగాళీపిల్లవాడవుతే యేంజేస్తాడో తెలిసిందా? తాత యేది తండ్రయేది కఱ్ఱపట్టుకుని చద్దూలెక్కగొడతాడు; మీఅగ్రహారం కుఱ్ఱవాళ్ళు మరియెవళ్ళయినా యీవూళ్ళో చదువుకుంటున్నారా?

వెంక—మరెవళ్ళూ లేరు.

గిరీ—అయితే నేనో ఉపాయం చెపుతానువిను. నేకూడా నీతో మీవూరొచ్చి పరీక్ష పాసయినావని మీవాళ్ళతో చెబుతాను; అక్కడ నీకు చదువు చెప్పడానికి ఒచ్చానని మీవాళ్ళతో చెప్పు; శలవులాఖర్ని నిన్ను టవునుస్కూల్లో పైక్లాసులో ప్రవేశ పెడతాను.

వెంక—మీ రేవొస్తే బతికేను మరేమీటి. కిందటిమాటు శలవులికే మాఅమ్మ మిమ్మల్ని తీసుకురమ్మంది.

గిరీ—ఆల్రైట్ - గాని - నాకిక్కడ చాలావ్యవహారములలో నష్టం వస్తుందే - మునసబుగారి పిల్లలికి శలవుల్లో పాఠాల్చెపితే ఫిఫ్టీరుపీస్ యిస్తానన్నారు; అయినా నీవిషయమై యంత లాస్ వచ్చినా నేను కేర్ చెయ్యను. ఒక భయం మాత్రం ఉంది. మీవాళ్ళు బార్బరస్ పీపిల్ గదా, నన్ను తిన్నగా ట్రీట్ చేస్తారో, చెయ్యరో, నీవు నన్ను గురించి మీ మదర్‌తో గట్టిగా రికమెండ్ చెయ్యవలసి వుంటుంది. కొత్తపుస్తకాలికి వొక్కజాబితా రాయి కొంచెండబ్బు చేతిలోవుంటే నేగాని సీగర్సుకి యిబ్బందికలుగుతుంది. నోటుబుక్కు తీసి రాయి. 1 రోయల్ రీడర్, 2 మాన్యూల్ గ్రామర్, 3 గోష్ జియామెట్రీ, 4 బాస్ అల్జీబ్రా, 5 శ్రీనివాసస్స యర్ ఆర్థమెటిక్, 6 నలచరిత్ర, 8 రాజశేఖరచరిత్ర, 8 మెసర్సు జనరల్ ఇంగ్లీష్, 9 వెంకటసుబ్బారావు మేడీజీ, యెన్ని పుస్తకాలయినాయి?

వెంక—తొమ్మిది.

గిరీ—మరొక్కటి రాయి. అక్కడికే పదిఅవుతాయి. పప్పూసామయ్యార్ మేడ్ డిఫికల్ట్ అక్కడికి చాలును. మీవాళ్ళుగాని యింగ్లీషు మాట్లాడమన్నట్టాయినా తెణుకూ బెణుకూ లేకుండా పుస్తకాల్లో చదువుకున్న ముక్కలు జ్ఞాపకం వున్నంతవరకు

యాకరుపెట్టు. నీదగ్గిర కాపర్సు యేవైనా వున్నవా? నాదగ్గిర కరెన్సీనోట్లు వున్నవిగాని మార్చలేదు. పదణాలు పెట్టి ఓశేరు కాశీమిఠాయి కొని పట్టుకురా. రాత్రి మరి నేను భోజనం చెయ్యను. మార్కట్టుకి వెళ్ళి బండికుదిర్చి దానిమీద నా ట్రావెలింగ్ ట్రంకువేసి మెట్టుదగ్గర బండి నిలబెట్టి ఉంచు. ఇక్కడ కొన్ని రాచ కార్యాలు చక్కబెట్టుకుని యంతరాత్రికైనా వొచ్చి కలుసుకుంటాను. గోఎట్వన్సు, మైగుడ్ బోయ్. నువ్ బుద్ధిగా వుండి చెప్పినమాటల్లా వింటూంటే నిన్ను సురేంద్రనాథ్ బానర్జీ అంత గొప్పవాణ్ణి చేస్తాను. నేను సీతో వస్తానన్న మాటమాత్రం పిట్టకైనా తెలియనియ్యొద్దు. జాగ్రత్త. [వెంకటేశం నిష్క్రమించును].

గిరీశం—యీవ్యవహార మొహాటి ఫైసలైంది. ఈ రాత్రి మధురవాణికి పార్టింగ్ విజిట్ యివ్వంది పోకూడదు.

[రాగవరసతో పాడును.]

నీ సైటు నాడిలైటు;
నిన్ను మిన్న
కాన కున్న
క్వైటు రెచడ్ ప్లైటు,
మూను లేని నైటు

[ఒక బంట్రోతు ప్రవేశించును]

బంట్రోతు—నేను పాటిగరాప్పంతులుగారి నౌఖర్నండీ, లెక్క జరూరుగుందండి పాటిగరాపుల కరీదు యెంటనే యిప్పించమన్నారండి.

ఫుల్లుమూను లైటటా,
జాసమిన్ను వైటటా,
మూను కన్న
మొల్ల కన్న
నీదు మోము బ్రైటటా,
టా! టా! టా!

బంట్రోతు—యెంతమందిని పంపినా యిచ్చారుకారటండి, నేవాళ్ళలాగూరుకుండే వోణ్ణికానండి.

గిరీ—అయ్యో కోనేటికి తోవయిదే;

బంట్రోతు—యక్కడి శెవిఁటిమాలోకం వొచ్చిందయ్యా.

గిరీ—కోవఁటి దుకాణవాఁ? కస్పాబజార్లో గాని యిటువేపు లేదు.

బంట్రోతు—(గట్టిగా చెవిదగ్గిర నోరు పెట్టి) పాటిగరాఁపుల కరీదిస్తారా యివ్వరా?

గిరీ—బస, రాధారీబంగాళాలో చెయ్యొచ్చును.

బంట్రోతు—(మరీగట్టిగా) యాడాదికిందట మీరూ సానీ కలిసితీసుకున్న పోటొగరా పులకరీదు మాపంతులు నిలబెట్టి, పుచ్చుకొమ్మన్నాడు.

గిరీ—ఓహో నీవటోయ్, యెవరో అనుకున్నాను. నింపాదిగామాట్లాడు. నింపాదిగా మాట్లాడు. రేపు ఉదయం యెనిమిది ఘంటలకి పూటకూళ్ళమ్మ యింటికి వొస్తే అణాఫయిసల్లో సొమ్మిచ్చేస్తాను. మీపంతులికి స్నేహం మంచీచెడ్డాఅక్కర్లేదూ?

బంట్రోతు—మాటల్లో కార్యంలేదు. మెళ్లో శెయ్యేట్టి నిల్చున్నపాటిని పుచ్చుకొమ్మన్నారండి.

గిరీ—పెద్దమనిషివి గదా; నువ్వు తొందరపడ్డం మంచిదేనా; నీతండ్రి యెంత పెద్దమనిషి యీచుట్ట చూడు. యెంత మజాగా కాల్తుందో. హవానా అంటారు వోర్ని దీన్ని. రేప్పొద్దున్నరా రెండు కట్టలిస్తాను.

బంట్రోతు—శిత్తం సొమ్ముమాటేం శెలవండి.

గిరీ—చెప్పానుకానా? రేప్పొద్దున్న యివ్వకపోతే మాలవాడికొడుకు ఛండాలుడు.

బంట్రోతు—మాలాడికొడుకు శండాలుడు కాకుంటే మరేటండి.

గిరీ—నీకు నమ్మకం చాలకపోతే యిదిగో గాయత్రిపట్టుకు ప్రమాణం చేస్తాను.

బంట్రోతు—శిత్తం, రేపుపొద్దున్న సొమ్మియ్యకపోతే నా అబోరుండదండి.

గిరీ—ఆహాఁ. నీఅబోరు ఒకాటే. నాఅబోరు ఒకాటేనా?

[బంట్రోతు నిష్క్రమించును.]

ఇన్నాళ్ళకి జంఝప్పోగు వినియోగంలోకి వొచ్చింది. థియొసాఫిస్టులు చెప్పినట్లు మన ఓల్డు కస్టమ్సు అన్నిటికీ యేదో ఒక ప్రయోజనం ఆలోచించే మనవాళ్ళు యేర్పరిచారు. ఆత్మానుభవం అయితేనే గాని తత్వం బోధపడదు. ఈపిశాచాన్ని వొదుల్చుకునేసరికి తలప్రాణం తోక్కొచ్చింది. శీఘ్రబుద్ధిః పలాయనం. పెందరాళే యీవూర్నుంచి వుడాయిస్తేనేగాని అబోరు దక్కదు. యిక మధురవాణి యింటికి వెళదాం. మేక్ హే వైల్ దీ సన్ షైన్స్ అన్నాడు.

## ౨-వ స్థలము : మధురవాణియింట్లో గది

[రామప్పంతులు కుర్చీమీద కూర్చుండును. మధురవాణి యెదుట కూర్చుండును.]

రామ—(జేబులోనుంచి చుట్టతీసి పంటికొనతో కొరికి) పిల్లా, అగ్గిపుల్ల.

మధురవాణి—(అగ్గిపుల్ల వెలిగించి చుట్ట కందించుచుండగా రామప్పంతులు మధురవాణి బుగ్గనుగిల్లును. మధురవాణి చుట్టకాలకుండానే అగ్గిపుల్ల రాల్చి యెడంగా నిలబడి కోపం కనపర్చుతూ) మొగవాడికయినా ఆడదానికయినా నీతి వుండాలి తాకవద్దంటే చెవిని పెట్టవుగదా?

రామ—నిన్ను ఉంచుకోవడానికి అంతా నిశ్చయమయి రేపో నేడో మంచి ముహూర్తం చూసి మా వూరు తీసుకువెళ్ళడానికి సిద్ధమయ్యుంటే యింకా యెవ్వడో కోన్కిస్కా హే గాడి అడ్డాలో వున్నానంటూ పాతివ్రత్యం నటిస్తావేమిటి?

మధు—వేశ్య అనగానే అంతచులకనా పంతులుగారూ? సానిదానికి మాత్రం నీతివుండొద్దా? మా పంతులుగార్ని పిలిచి "అయ్యా యిటుపైని మీతోవ మీది, నాతోవ నాది" అని తెగతెంపులు చేసుకున్నదాకా నేను పరాధీనురాలినే అని యెంచండి మీరు, దెప్పి పొడిచినట్టు ఆయన పైకి అయితేనేమి కిరస్తానం మనిషైతేనేమి పూటకూళ్ళమ్మను వుంచుకుంటేనేమి నన్ను యిన్నాళ్ళూ ఆమహారాజా పోషించాడు కాడా? మీరంతకన్నా రసికులయినా, నామనస్సు మీరు యంత జూరగొన్నా, ఆయనయెడల విశ్వాసం నాకు మట్టుకు వుండొద్దా?

రామ—పెద్దపెద్దమాటలు ప్రయోగిస్తున్నావు! వాడి బతుక్కి వాడు పూటకూళ్ళమ్మని వుంచుకోడం కూడానా! పూటకూళ్ళమ్మే వాణ్ణి వుంచుకుని యింత గంజి పోస్తూంది.

మధు—అన్యాయం మాటలు ఆడకండి, ఆయన యెంత చదువుకున్నాడు, ఆయనకి యెంత ప్రఖ్యాతివుంది నేడో రేపో గొప్పయుద్యోగం కానైయ్యుంది.

రామ—అహహా (నవ్వుతూ) యేం వెఱ్ఱిముఖం! నీవు సానివాళ్ళలో తప్పపుట్టావు. గిరీశం గిరీశంగారు అని పెద్దపేరు పెడతావేమిటే, మావూళ్ళో వున్న లుబ్ధావధాన్లు పింతల్లికొడుకు కాడూ వీడూ! గిరీడని మేం పిలిచేవాళ్ళం. బొట్లేరు ముక్కలు రెండు నేర్చుకోగానే ఉద్యోగాలే! వాడికల్లా వక్కటే వుద్యోగం దేవుడు రాశాడు. యేమిటో తెలిసిందా? పూటకూళ్ళమ్మయింట్లో దప్పికిక్కి చేసి అరవ చాకిరీ చెయ్యడం.

మధు—యీమాటలు ఆయన్ని అడుగుదునా?

రామ—తప్పకుండా, కావలిస్తే నేను చెప్పేననికూడా చెప్పు.

మధు—అయినా ఆయన గుణయోగ్యతలతో నాకేం పని? యేమయినా ఆయన నాకు యజమాని. ఆయనతప్పులు నాకళ్ళకు కనపడవ్.

రామ—అయితే అతడికి విడాకులు యెప్పుడిస్తావు?

మధు—యిక్కడి రుణాలూ పణాలూ తీర్చుకోడానికి మీరు శలవిచ్చిన రెండు వొంగలూ యిప్పిస్తే యీక్షణం తెగతెంపులు చేసుకుంటాను.

రామ—అయితే యిందు (జేబులోనుంచి నోట్లు తీసి యిచ్చును. మధురవాణి అందుకొంటుండగా రామప్పంతులు చెయ్యిపట్టి లాగును. మధురవాణి కోపంతో చెయి విడిపించుకుని నోట్లు నేలపారవేసి దూరముగా నిలుచుండును.)

మధు—మీతో కాలక్షేపం చెయ్యడం కష్టం. ఒక నిర్ణయంమీద నిలవని మనిషిని యేవఁన్నమ్మను?

రామ—(నోట్లు యెత్తి) క్షమించు అపరాధం, (నోట్లు చేతి కిచ్చును.) లెఖ్ఖపెట్టి చూసుకో.

మధు—ఆమాత్రం మిమ్మల్ని నమ్మకపోతే మీతో రానేరాను. ఇంత రసికులయ్యిండీ నామనస్సు కనిపెట్టజాలినారు కారు గదా! మీనోట్లు మావద్దనే వుంచండి. నేను డబ్బుకక్కుర్తి మనిషిని కాను. (నోట్లు యివ్వబోవును.)

రామ—వొద్దు! వొద్దు! వొద్దు! నీమనసు కనుక్కుందామని అన్నమాట గాని మరొకటి కాదు. గాని, యీగిరీశం గుంటవెధవ, వీడెవడో గొప్పవాడనుకుంటున్నావేవిఁటి?

మధు—ఆయన్ని నాయెదట తూల్నాడితే యిదుగో తలుపుతీశాను. విజయం చెయ్యండి. (తలుపుతీసి వక చేత పట్టుకుని రెండవ చేత వేలుతో పైకి తోవచూపును.) అదుగో గిరీశంగారే వొస్తున్నారు. ఆమాటేదో ఆయన్తోటే చెప్పండి.

రామ—వేళాకోళం ఆడుతున్నావూ?

గిరీ—(వాకట్లోనుంచి) మైడియర్.

రామ—(ఆత్మగతం) అన్నా! వేళ గాని వేళొచ్చేడు గాడిదకొడుకు, తంతాడు కాబోలు. యేఁవిటి సాధనం, యీమంచంకింద దూరుదాం. (మంచంకిందదూరును.)

[గిరీశం ప్రవేశించును]

గిరీ—వెల్, మైడియర్ ఎంప్రెస్, (బుజముమీద తట్టబోవును)

మధు—(ఒసిలి తప్పించుకొని) ముట్టబోకండి.

గిరీ—(నిర్ఘాంతపోయి) ఆదేమిటి ఆవికారం.

మధు—ఆఖరువికారం.

గిరీ—(ఆత్మగతం) నేను వుడాయిస్తానని దీనికెలా తెలిసింది చెప్మా! సానివాళ్ళకి కర్ణపిశాచి వుంటుందికాబోలు (పైకి) మైలబడితే స్నానంచేసి వేగిరం రా.

మధు—యిప్పుడేం తొందర, తలంటుకుంటాను.

రామ—(ఆత్మగతం) సబాష్ యేమి నీతయిన మనిషి యిది! వెధవని ముట్టుకోనివ్వకుండా యెత్తుయెత్తింది!

గిరీ—మైలాగియిలా మాయింగ్లీషువారికి లక్ష్యంలేదు. యిలారా (దగ్గిరికి చేరును.)

మధు—(వేలు చూపి) అక్కడనే ఆగండి. మీరు కిరస్తానం అయితే కావచ్చును. నేను కిరస్తానం యింకా కాలేదే. మీరు కిరస్తానం అన్నమాట యిప్పుడే ఒకాయన చెప్పగా విన్నాను.

రామ—(తనలో) నేచెప్పేనంటుందా యేమిటి!

గిరీ—ఒకరు చెప్పగా విన్నావూ? యెవరా చెప్పింది? యెవడిక్కడికి రావడానికి మగదూర్ వుంది? యిలాంటి చాడీకోర్ కబుర్లు చెప్పడానికి యెవడికి గుండె వుంది? ఆమాటలు విని నాతో చెప్పడానికి నీకెక్కడ గుండుంది? చెప్పూ!

రామ—(తనలో) తంతాడు కాబోలు? యరక్క చిక్కడ్డాను.

మధు—మొగాడే చెప్పాలా యేమిటి? ఆడవాళ్ళకి దేవుడు నోరివ్వలేదా?

గిరీ—(తనలో) పూటకూళ్ళముండే చెప్పింది కాబోలు (పైకి) ఆడదా? ఆడదాన్ని నోరుబెట్టుకు బతకమనే దేవుడు చేశాడు. పరుషయిన ఆడది నీయింటి కొందు కొస్తుంది.

మధు—పరువైన మొగాళ్ళొచ్చినప్పుడు పరువైన ఆడవాళ్ళెందుకు రాకూడదు? ముందు కూచోండి. తరువాత కోప్పడుదురుగాని, చుట్టతీసుకోండి, అదుగో అగ్గిపెట్టి

గిరీ—ముట్టుకోడానికి వల్లలేకపోతే అగ్గిపుల్ల వెలిగించి యివ్వడానికయినా పెట్టి పుట్టానుకానా? యీవేళ మహాఉత్సాహంగా వచ్చాను గాని ఉత్సాహం భంగం చేశావ్.

మధు—యేవిఁటా వుత్సాహం?

గిరీ—యిదిగో జేబులో హైదరాబాద్ నైజామ్‌వారి దగ్గిరనుంచి వచ్చిన ఫర్మానా. మా నేస్తం నవాబ్ సదరదాలత్ బాపురల్లీఖాన్ ఇహ్సాన్‌జంగ్ బహద్దర్‌వారు సిపార్సు చేసి వెయ్యి సిక్కారూపాయలు జీతంతో మునాయిబ్ ఉద్యోగం నాకు చెప్పించారు. అనగా హామేషా బాద్షావారి హుజూర్న వుండడం.

రామ—(తనలో) యేవిఁట్రా వీడిగోతాలు!

గిరీ—యింత శుభవార్త తెచ్చి నాదగ్గిరకు రానిచ్చావుకాదు గదా? నాతో హైదరాబాద్ వస్తావా?

మధు—(తలతిప్పుతూ) నేయెందుకు? పూటకూళ్ళమ్మని తీసికెళ్ళండి.

గిరీ—నిర్ఘాంతపోయి) పూటకూళ్ళమ్మ యేవఁయినా వెంట పెడుతుందా యేవిఁటి?

మధు—మీకే తెలియాలి.

గిరీ—నీ తెలివితక్కువచూస్తే నాకు నవ్వొస్తుంది. యెవడేమాటన్నా నామీద నమ్మడవేఁనా? యీఘోరవైఁన అబద్ధాలు నీతో యెవడు చెబుతున్నాడో కనుక్కోలేననుకున్నావాయేవిఁటి? సప్తసముద్రాల్దాటినా వాడిపిలకట్టుకొని పిస్తోల్తో వాళ్ళు తూట్లుపడేటట్లు ధామ్ ధామని కొట్టకపోతినట్టయినా నాపేరు గిరీశమే! నినద భీషణశంఖము దేవదత్తమే! కబడ్దార్!

మధు—సముద్రాలవతలకెళ్లి వెతకక్కరలేదు. ఆచెప్పినమనిషి మీయెదటే చెబుతాడు

రామ—(తనలో) యీముండ నన్ను బయలుపెడుతుంది కాబోలా దైవమా!

గిరీ—(తనలో) థాంక్గాడ్. అయితే పూటకూళ్లదాని దెబ్బ తగల్లేదు. (పైకి) యిలాంటి దుర్మార్గపుమాటలు ఆయిల్లాలి చెవినిపడితే చాలా ఖేదిస్తుంది. ఆపాపవఁంతా నిన్ను చుట్టుకుంటుంది. ఆమె యెంత పతివ్రత! యెంత యోగ్యురాలు!

మధు—వెధవముండకి పాతివ్రత్యం అన్నమాట యీనాటికి విన్నాను.

గిరీ—దానికి...కాదు ఆమెకి మొగుళ్లేకపోయినా ఆమెను వెధవనడానికి వీల్లేదు.

మధు—మీరుండగా వెధవెలా అవుతుంది?

గిరీ—నాన్సెన్స్ (దీనికో కథచెప్పి రంజింపచేదాం) యిదుగో విను. దాని నిజం యేవిఁటంటే—పూటకూళ్లమ్మ ముచ్చటగా తప్పటడుగులు వేశేరోజుల్లో ఒక కునుష్టి ముసలాడికి కట్టనిశ్చయించారు. పుస్తె కట్టబోతూంటేనో కట్టినవుత్తరక్షణంలోనో ఆముసలాడు పెళ్లిపీటలమీదే గుటుక్కుమన్నాడు. అప్పుడు పెళ్లి అయినట్టా కానట్టా అని మీమాంస అయింది. కొందరు పుస్తె కట్టేడన్నారు. కొందరు కట్టలేదన్నారు. పిల్లతండ్రి, పెళ్లికొడుకు వారసులమీద దావా తెచ్చాడు. పురోహితుడు వాళ్లదగ్గర లంచం పుచ్చుకుని పుస్తెకట్టలేదని సాక్ష్యవిచ్చాడు; దాంతో కేసు పోయింది; మరి దాన్నెవరూ పెళ్ళాడారుకారు.

మధు—అయితే మరి మీకు తప్పలేదే?

గిరీ—యేవిఁటోయీ కొత్తమాటలూ! నాకుఅదీఅంతూ తెలియకుండా వుందీ! ఆహాఁ సరసంవిరసంలో దిగుతూందే! హాస్యానికంటే నిన్నేవఁన్నా అనందవేఁ, నిజవఁనిగానీ అంటివా, చూడు నాతడాఖా యెవడీమాటలు పేల్తున్నాడో వాడిపేరు తక్షణం చెబుతావా చెప్పవా?

మధు—రామ.

రామ—(తనలో) సచ్చాన్రా, పేరు చెప్పేసింది!

మధు—రాము! రాము! ఒహరు చెప్పేదేవిఁటి లోకవఁంతా కోడై కూస్తూంటేను?

(వీధిలోనుంచి తలుపు తలుపు అని ధ్వని)

గిరీ—(తెల్లబోయి) తలుపుతీయొద్దు, తియ్యొద్దు ఆపిలిచేమనిషి వెఱ్ఱిముండ మనుషుల్ని కరుస్తుంది.

మధు—తలుపుతీసేవుంది.

గిరీ—చంగున వెళ్ళి గడియ వేసెయ్;

మధు—అదుగో తలుపు తోసుకు వొస్తూంది.

గిరీ—గెంటెయ్; గెంటెయ్.

మధు—ఆ వయ్యారం చూస్తే మీపతివ్రతలా కనిపిస్తూంది. మధురవాణి వాకిట్లోకి వెళ్ళును.

గిరీ—మంచంకింద దూరుదాం (గిరీశం మంచంకింద దూరును.)

(తనలో) దొంగలంజ సరిస్సుణ్ణి దాచిందోయ్ మంచంకింద. యిదేవిఁటో మంచి మనిషి అని భ్రమించాను దీన్తస్సాగొయ్యా. సిగఘాయి దీసి తందును గాని యిది సమయం కాదు. అయినా పోయేవాడికి నాకెందుకు రొష్టు, (రామప్పంతులుతో మెల్లిగా) యెవరన్నా మీరు. మహానుభావులు?

రామ— నేను రామప్పంతుల్నిరా, అబ్బాయీ.

గిరీ—తమరా. యీమాత్రానికి మంచంకింద దాగోవాలా, మహానుభావా? నన్నడిగితే యీలాంటి లంజల్ని యిరవైమందిని మీకు కన్యాదానం చేతునే.

రామ—(తనలో) బతికేన్రా దేవుఁడా, (పైకి) నువ్వేరా బాబూ దీన్నుంచుకున్నావు!

గిరీ—మాటవినపళ్ళేదు కొంచెం యిసుంటారండి. (రామప్పంతులు ముందుకు జరుగును. అతన్ని తప్పించుకుని గోడవేపు చేరును.)

గిరీ—అన్నాష్ట యీలంజని యెన్నడూ నమ్మకండీ, యిలా యిరవైమందిని దాచగల శక్తుంది, దీనికి.

రామ—రెండువందలు దొబ్బిందిరా బాబూ.

గిరీ—నువ్వు లేంజాగర్త చేశారా?

రామ—అంతేనా?

గిరీ—మరేవిఁటి?

[మధురవాణిన్ని, పూటకూళ్లమ్మ వల్లెవాటులో
చీపురుగట్ట దాచిన్ని ప్రవేశింతురు]

మధు—మీరన్నమనిషి యిక్కడ లేరంటే చెవిని బెట్టరుగదా?

పూట—నీయింట్లో జొరబడ్డాడని వీధిలోవాళ్ళు చెబితే నీమాట నమ్ముతానా యేవిఁటి? ఆవెధవ వుంటే నాకేం కావాలి. వుండకుంటే నాకేం కావాలి. వాడు నీకిచ్చిన యిరవయి రూపాయలూ యిచ్చెయ్.

మధు—యెవడికిచ్చావో వాణ్ణే అడగవమ్మా.

పూట—వెధవ కనపడితే సిగపాయిదీసి చీపురుగట్టతో మొత్తుదును. యెక్కడదాచా వేవిఁటి?

మధు—నాకు దాచడం ఖర్మవేఁవిఁ. నేను మొగనాల్ని కాను. వెధవముండనీ కాను. నాయింటికొచ్చేవాడు మహారాజులాగ పబ్లిగ్గా వొస్తాడు. (కంటితో మంచము కింద చూపును.)

పూట—మంచంకింద దాగేడేమో (మంచంకిందుకు వంగి) నీవరువు బుగ్గయినట్టే వుంది లేచిరా (చీపురుగట్ట తిరగవేసి రామప్పంతులును కొట్టును.)

రామ—ఓర్నాయనా, నన్నెందుకొట్టావే దండుముండా! (మంచం కిందునించి పైకి వచ్చి వీపు తడుముకొనును.)

మధు—అయ్యెన్నెందుకు కొట్టేవు? నాయింటికొచ్చి యేవిఁటీ రవ్వ?

పూట—అయితే మంచంకింద కెందుకు దూరేడూ?

మధు—నీకెందుకా గోష? అదో సరసం.

పూట—యిదో చీపురుగట్ట సరసం,

రామ—(వీపు తడువుఁకుంటూ) నీసిగ తరగా, ఆడదానివై పోయేనావే, లేకుంటే చంపేసిపోదును. నీరంకుమొగుణ్ణి కొట్టక నన్నెందు కొట్టేవే ముండా? అందుకా నన్ను ముందుకి తోసి తాను గోడవేపు దాగున్నాడు.

పూట—ఆవెధవ కూడా వున్నాడూ మంచంకింద! కుక్కా పైకిరా.

గిరీ—వెళ్ళిపో! మంచంకిందికిరా, వెళ్తి వొడలగొడతాను.

పూట—అప్పన్నిట్టా వెధవా నీకు? భయపడతా ననుకున్నావా యేవిఁటి? నీసాని ముండ యెలా అడ్డుకుంటుందో చూస్తాను. (పూటకూళ్ళమ్మ ఒకవేపునుంచి మంచంకిందికి దూరును. మరివొకవేపునుంచి గిరీశం పైకివచ్చి రామప్పంతులు నెత్తి చరచి లఘువేసి పెరటివేపు పరుగెత్తిపోవును.)

రామ—సచ్చాఁగా నాయనా (రెండు చేతులు తలపట్టుకొని) మధురవాణీ యేవీఁ బేహద్బీ! కనిస్టీబుకి కబురంపించూ.

మధురవాణి—యెందుకు పబ్లీకున అల్లరీ అవమానవుఁన్నూ! రేపో యెల్లుండో మీరే వాడికి దెబ్బకి దెబ్బతీసి పగతీర్చుకుందురుగాని.

(మధురవాణి రామప్పంతుల్ని కౌగిలించుకొని తలముద్దెట్టుకొని చేతరాసి)

యేవిఁదుష్టు! మొగవాడయినవాడు యెదుట నిలిచి కొట్టాలి. దొంగదెబ్బ కొడతాడా? వాడిపొంకం అణుతురుగాని లెండి.

రామ—గవురను మెంటు జీతవిఁచ్చుంచిన కనిస్టీబులుండగా మనకెందుకు శరీరాయాసం? యీ వెధవని పబ్యాండుకోర్ట్లంటా తిప్పకపోతే నేను రామప్పంతుల్ని కాను చూడు నాతమాషా!

మధు—(రామప్పంతుల్ని ముద్దుబెట్టుకొని) మాటాడక వూరుకోండి. (మంచంకిందివేపు చూపించి నోరుమూసి) దొంగదెబ్బ కొట్టినవాడిదే అవమానం; మీది కాదు.

రామ—నొప్పెపడేదనుకున్నావు? ఆముండ మంచంకిందనించి రాదేం? చీపురుకట్ట లాక్కో.

పూట—ఘడేల్మంటే వస్తాయించి చూస్తున్నాను. నీతాటగాలిసం యేడిసినట్టే ఉంది. (పైకి వచ్చును.)

అంతా నిష్క్రమింతురు

---



# కన్యాశుల్కము — ద్వితీయాంకము

## ౧-వ స్థలము : కృష్ణారాయపురం అగ్రహారంలో అగ్నిహోత్రావధానులు యిల్లు.

(అగ్నిహోత్రావధాన్లు జంఝాలు వడుకుచుండును. కరటకశాస్త్రులు శిష్యుడిచేత లేనిపేలు నొక్కించుకొనుచుండును. వెంకమ్మ కూర తరుగుచుండును.)

వెంకమ్మ — నిన్నటిన్నించి కిళీవిళ్ళెల్లావులని కుఱ్ఱవాడు ఉత్తరం రాశాడు. ఎన్నాళ్ళో ఐంది వాణ్ణిచూసి, కళ్ళు కాయలు కాసిపోయినాయి. గడియో గడియో రావాలి.

అగ్నిహోత్రావధాన్లు — ఎందుకు వొట్టినే వగపడం? వొద్దువొద్దంటూంటే యీ యింగిలీషు చదువులో పెట్టేవ్. మా పొలం సిస్తంతా వాడికిందయిపోతూంది. కిందటి యేడు పరీక్ష ఫేలయిపోయినాడు కాదా? యీ కేడు యెలాతగలేశాడో తెలియదు. వసకీ యింగిలీషు చదువు వచ్చిరాదని పోరిపోరి చెబితే విన్నావు కావు. మా పెద్దన్న దిబ్బావుధాన్లు కొడుకుని యింగిలీషు చదువుకి పార్వతీపురం పంపించేసరికి వ్యాష్టం వొచ్చి మూడ్రోజుల్లో కొట్టేశింది. బుచ్చబ్బి కొడుక్కి యింగిలీషు చెప్పిద్దామనుకుంటూండగానే చచ్చినంత ఖాయిలా చేసింది.

వెంకమ్మ — మీ రెప్పుడూ యిలాంటివి వోఘాయిత్తం మాటలే అంచూవుంఛారు. డబ్బు ఖర్చయిపోతుందని మీకు బెంగ. మొన్న మొన్న మనకళ్ళెదట మనవాకట్లో జుత్తు విరబోసుకు గొట్టికాయలాడిన నేమానివారి కుఱ్ఱాడికి మునసబీ ఐందికాదూ?

అగ్ని — మనవెధవాయకి చదువొచ్చేదేం కనపడదుకాని పుస్తకాలకిందా జీతంకిందా యిహ నాలుగేళ్ళు యేసరికి మనభూమి కడతేరిపోయింది. ఆపైని చిప్పా దొప్పా పట్టుకు బయల్దేరాలి. నిమ్మళంగా యింటిదగ్గిరుంటే యీపాటికి నాలుగ్గాట్లు చెప్పేదును. వొద్దంటూంటే యీ వెధవింగిలీషు చదువులో పెట్టేవు.

వెంకమ్మ — మనవాడికో మునసబీ ఐనా పోలీసుపనైనా ఐతే రుణాలిచ్చి యీ అగ్రహారం భూవులన్నీ కొనేస్తాడు. యీడాదికో నూఱ్ఱూపాయలు ఖర్చుపెట్టడానికింత ముందూ వెనకా చూస్తున్నారు, మీలాగే వాడూ జంఝాలు వొడుక్కుంటూ బతకాలని వుందా యేవిఁషి? మీకంత భారవఁలోస్తే మావాళ్ళు నాకు పసుపూకుంకానికి యిచ్చిన భూవఁమ్మేసి కుఱ్ఱాడికి చదువు చెప్పిస్తాను.

కరట—నీభూమి వెందుకమ్మాలమ్మా? మనసొమ్ము చడతిని కొవ్వున్నాడు. ఆతడే పెట్టుకుంటాడు.

అగ్ని—ఐతే నన్ను ఆక్షేపణ చేస్తావషే? యీమారంటే నీఅన్న వున్నాడని వూరుకునేది లేదు.

[గిరీశం, వెంకటేశం ప్రవేశింతురు]

వెంక—మాబాబ్మా బాబు వచ్చావషాయ్, (వెంకటేశం కౌగిలించుకొనును.)

అగ్ని—వెధవాయా యీసారైనా ప్యాసయినావా? (వెంకటేశం తెల్లబోయి చూచును.)

గిరీ—ప్యాసయినాడండి, ఫస్టుగా ప్యాసయినాడు. నేను చాలా శ్రమపడి చదువు చెప్పేనండి.

అగ్ని—యీతుర కెవడోయ్?

గిరీ—టర్కీ డామిట్, టెల్ మాన్;

అగ్ని—మాన్? మానులావుంచావా? గూబ్బగల గొడతాను.

వెంకటేశం—(వణుకుతూ తల్లివైపు చూసి) అమ్మా యీయన్నే నాకు చదువు చెప్పేమేష్టరు.

కరట—ఇంటికి పెద్దమనిషొస్తే అపృచ్ఛప్రసూటలాడతావేమిటి బావా? ఆయనేదో కుఱ్ఱవాడితో యింగిలీషుమాటంటే పుచ్చకాయలదొంగంటే బుజాలు తడుముకున్నట్టు నీమీద పెట్టుకుంటావేం? (బండివాడు సామాను దించును.)

గిరీ—(కరటకశాస్త్రితో) తమబావగారా అగ్నిహోత్రావధాన్లుగారు? నన్ను తమరు యెరక్కపోవచ్చునుగాని డిప్టీకలక్టరుగారింటికి తమరు వచ్చేటప్పుడు నేను వారి పిల్లలికి చదువు చెబుతూఉండేవాణ్ణి. డిప్టీకలక్టరుగారు తమర్నియే మెచ్చుకునేవారనుకుంటారు!

కరట—అవును మీమొఖంచూసిన జ్ఞాపకంఉంది. డిప్టీకలక్టరుగారు మాదొడ్డప్రభువ్.

గిరీ—మీలాంటి చప్పన్నభాషలూ వచ్చినమనిషి యెక్కడా లేడనీ, సంస్కృతం మంచినీళ్ళప్రవాహంలా తమరు మాట్లాడతారనీ, తమలాంటివిద్వాంసుణ్ణి యెక్కడా చూళ్ళేదనీ డిప్టీకలక్టరుగారు శలవిస్తూండేవారు. కవితారసం ఆయన్లా గ్రహించేవారేరీ? నాకవిత్వమంటే ఆయన్ను చెవి కోసుకుంటారు. మహారాజావారి దర్శనం కూడా నాకు చేయించారండి.

అగ్ని—(ధుమధుమలాడుతూ) ఈశషభిషలు నాకేం పనికిరావు. యితడి వైఖరి చూస్తే యిక్కడే బసవేసేటట్టు బలపడుతూంది. మాఇంట్లో భోజనం యంతమాత్రం వీలుపడదు.

వెంక — ఆయనమాటలు గణించకు బాబూ, ఆయన మోస్తరది. మీదయవల్ల మావాడికో ముక్కొస్తే మీ పేరు మరిచిపోం.

గిరీ — అందు కభ్యంతరవేఁవిటమ్మా! మీవాడు శలవుల్లో చదువు చెప్పమని యెంతో బతిమాలుకుంటే పోనీ పనికొచ్చే కుఱ్ఱవాడుగదా అని వొచ్చానుగాని పట్ణంలో మునసబుగారింట భోజనం చేదని వొచ్చానా వారిచ్చే డబ్బు చేదని వొచ్చానా అమ్మా?

వెంక — యీ చదువులకోసం కని పిల్లణ్ణి వొదులుకుని వుండడం, వాడు పరాయి వూళ్ళో శ్రమదమాలు పడుతూండడం నాప్రాణాలు యెప్పుడూ అక్కణ్ణే వుంటాయి. డబ్బంటే యెన్నడూ వెనక చూశ్శేదుగదా. మేం కనడంమట్టుకు కన్నాం. మీరే వాడికి తల్లీ తండ్రీని. యెల్లా కడుపులో పెట్టుకు చెబుతారో మీదే భారం.

గిరీ — తమరు యింతదూరం శలవియ్యాలమ్మా? నామంచిచెడ్డలు మీకుఱ్ఱవాణ్ణడిగితే తెలుస్తుంది. మునసబుగారూ, డిప్టీకలక్టరుగారూ యెన్నికచేసిన మనిషిని. నా మాట నేచెప్పుకోవాలా, ఇంతెందుకూ, యికమూడేళ్ళు నాతరిఫీదులో ఉంచితే క్రిమినల్లో వసగా పోలీసుపరీక్ష ప్యాసుచేయిస్తాను.

అగ్ని — మూడేళ్ళే! యీసంవత్సరం పుస్తకాల కెంతవుతుందిరా అబ్బీ!

వెంకటేశం — పదిహేన్రూపాయ లవుతుంది.

అగ్ని — ఒక్క దమ్మిడీ ఇవ్వను. వీళ్ళిద్దరూకూడి ఆరూపాయలు పంచుకుతినేటట్టు కనపడుతూంది. నేను వేదం యావత్తూ రెండు పన్నాలూ ఒకదమ్మిడీ పుస్తకాలఖర్చు లేకుండా చదువుకున్నాను. ఇదంతా టోపీవ్యవహారంలా కనపడుతూంది.

కరట — (నవ్వుతూ) కోట్లకి విలవైనమాట అన్నావు బావా!

గిరీ — (కరటకశాస్త్రితో) డిసీజ్ బ్యాంగ్స్, చూచారండీ, జెంటిల్మేను అనగా పెద్దమనిషిని యెలా అంటున్నారో! నేను యిక యిక్కడ ఉండడం భావ్యం కాదు. శలవు పుచ్చుకుంటాను.

వెంక — చాలాబాగానే వుంది! యింటికెవరొచ్చినా నాకిదే భయం, ఆయన మాటల కెక్కడికి బాబూ, వెళ్ళిపోకండి.

కరట — అగ్నిహోత్రావుధానులూ! కుఱ్ఱవాడికి రవ్వంత చదువు చెప్పించడానికి ఇంత ముందూ వెనకా చూస్తున్నావ్. బుచ్చెమ్మ నమ్మిన పదిహేనువొందల రూపాయ లేంజేశావ్?

గిరీ — డైరెంగర్స్! డామిట్!

అగ్ని — ప్రతీ గాడిదెకొడుకూ అమ్మానమ్మా వంచుంచాడు. కూరగాయల్లోయ్ అమ్మడానికీ? ఆరూపాయిలు పుచ్చుకోకపోతే మొగుడు చచ్చాడుగదా, దాని గతి యేవైయ్యుండును?

కరట — చచ్చేడంటే వాడిదాతప్పా? మంచంమీంచి దింపెయ్యడానికి సిద్ధంగా వున్న వాడికక్కట్టావ్.

గిరీ — తమరేనా నులక అగ్నిహోత్రావధాన్లుగారు? యీపట్టెని జటలో తమంత వారు లేరని రాజమహేంద్రపరంలో మావాళ్ళనుకునేవారు.

అగ్ని — మీది రాజమహేంద్రవరంవండీ? ఆమాట చెప్పేరుకారేం? రామావధాన్లుగారు బాగున్నారా?

గిరీ — బాగున్నారండి. ఆయన మామేనమావగారండి.

అగ్ని — ఆమాట చెప్పారుకారూ?

గిరీ — మామావ యీదేశబోగట్టా వొచ్చినప్పుడల్లా తమర్ని యెన్నిక చేస్తూంటారండి.

అగ్ని — నాకూ వారికి చాలా స్నేహం. యేవిశారా? కొంచం నాకు ప్రథమకోపం. యెవరో తెలియకండా అన్నమాటలు, గణించకండేం.

గిరీ — దానికేవండి. తమవంటి పెద్దలు అనడం మాబోటికి కుఱ్ఱవాళ్లు పడడం విధాయకవేఁగదండీ!

కరట — (తనలో) యిన్నాళ్ళకి మా అగ్నిహోత్రుడికి తగినవాడు దొరికేడు.

అగ్ని — చూచారండీ, మీపేరేవిటండీ?

గిరీ — గిరీశం అంటారండి.

అగ్ని — చూశారండీ, గిరీశంగారూ! మా కరటకశాస్తుల్లు వట్టి ఆనక తవక మనిషి! మంచీ చెడ్డా యేమీ వాడి మనసు కెక్కదు. అల్లుడు చచ్చిపోయినాడంటే అందువల్ల యెంతలాభం కలిగిందీ. భూవులకి దావా తెచ్చానా లేదా? నేను యీ మధ్య దాఖల్చేయించిన పిటీషనుమీద ఆర్డరు చదివి పెట్టండి (గదిలోకి వెళ్ళి కాకితం తెచ్చి గిరీశం చేతికి యిచ్చును.)

గిరీ — (చూసి) ఎవడో తెలివితక్కువ గుమాస్తా వ్రాసినట్టుంది. అక్షరపోలికే లేదండి.

అగ్ని — మావకీలు గడగడ చదివేడండి.

గిరీ — నేనుమాత్రం చదవలేకనా అంతకన్న గళ్ళాగ్రాహిగా చదువుతాను. లెక్కల్లోచ్చే పండితుణ్ణి నాకిది పేలపిండికాదు; అయితే రాసినవాడి తెలివికి సంతోషిస్తున్నాను. ఇది అరటిపండు విప్పినట్టు తర్జుమా చేసి దాఖలు చెయ్యమని కలవా?

అగ్ని—అంతకంటేనా! (తనలో) డబ్బు ఖర్చులేకుండా వీడిచాత కాగితప్ముక్కలన్నీ తర్జుమా చేయించేస్తాను,

గిరీ—యింకా ఇంగ్లీషు కాయితాలు యేవున్నా నామీద పారెయ్యండి తర్జుమా చేసి పెడతాను.

అగ్ని—అల్లాగే.

వెంక—మా అబ్బాయి మీరు ఒక్క పర్యాయం యింగిలీసు మాట్లాడండి బాబూ.

గిరీశం—ఆలాగే నమ్మా

My dear Venkatesam—
Twinkle! Twinkle! little star,
How I wonder what you are!

వెంకటేశం—There is a white man in the tent.

గిరీశం—The boy stood on the burning deck
Whence all but he had fled.

వెంకటేశం—Upon the same base and on the same side of it the sides of a trapezium are equal to one another.

గిరీశం—Of man's first disobedience and the fruit of that mango tree, sing, Venkatesa, my very good boy.

వెంకటేశం—Nouns ending in for fe change their for fe into ves.

అగ్ని—యీ అడుతూన్న మాటలికి అర్థం యేవిఁటండి.

గిరీశం—యీ శెలవుల్లో యే ప్రకారం చదవాలో అదంతా మాట్లాడుతున్నావఁండి.

కరట—అబ్బీ! వొక తెనుగు పద్యం చదవరా?

వెంకటేశం—పొగచుట్టకు సతిమోవికి...

కరట—శబాష్!

గిరీశం—డామిట్! డోంట్రీడ్ దట్ (మెల్లగా) "నలదమయంతు లిద్దరు" చదువ్.

వెంకటేశం—నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానల దహ్యమానులై సలిపిరి దీర్ఘ వాసర నిశల్.

కరట—అంటే అంటే, మనఃప్రభవానలవంటే యేవిట్రా?

వెంకటేశం—(యింటికప్పువేపు చూసి వూరకుండును.)

గిరీ—పసిపిల్లలకి అలాంటి కఠినమైన పద్యానికి అర్థం తెలుస్తుందా అండి?

అగ్ని—పద్యాలికి అర్థం చెప్పరూ?

గిరీ—యిప్పటిమట్టుకు చేసేలాగే ఫిట్టీషం చేయిస్తారు. తెల్లవాళ్ళ స్కూళ్ళల్లో తెలుగుపద్యాలమీద ఖాతరీగ లేదండి. యెంతసేపూ జాగర్ఫీ గీగర్ఫీ, అర్థమెటిక్, ఆల్జిబ్రా, మేథమేటిక్స్ యివన్నీ పూడలేసి చెప్తారండి.

కరటక—(తనలో) తర్ఫీదు మాచక్కగాఉంది, వీణ్ణి పెందరాళే నోవ పెట్టకపోతే మోసంవొస్తుంది.

అగ్ని—అన్నోటి చెప్తారండీ?

గిరీ—మరేవనుకున్నారు? మీ అబ్బాయిలాటి చదువుకునేవాడికి ఒక్క నిమిషమైనా తెరిపుండదు.

అగ్ని—అదుగో చదువంటే అల్లాగే చదువుకోవాలి. గొట్టికాయ లాడకుండా మా వాణ్ణి ఖాయిదాచేస్తే యెంత చదువైనా వొస్తుంది.

గిరీ—నాదగ్గిర గొట్టికాయిలు గిట్టికాయిలు పనికిరావండి. పుస్తకంచాతపడితే వేళ్ళకి పుస్తకం అంటుకుపోవాలి, అలా చదివిస్తానండి.

అగ్ని—అలాగేచేస్తే మావాడికి చదువొచ్చి అన్నిపరీక్షలూ ప్యాసవతాడండి. మా వాడికి డబ్బుఖర్చు లేకుండా పెళ్ళయేసాధనంకూడా తటస్థించిందండి.

వెంకమ్మ—మీనైజంకొద్దీ ఛీట్లా కొట్లా మంచారుగాని మీకు మాత్రం అబ్బిమీద ప్రేమలేదా యేవిఁషి? పట్నంనుంచి నోట్లాలమ్మొచ్చినప్పుడు యెంతో బెంగబెట్టుకుని అబ్బిని కలవర్జి రాసి వెళ్లిపోగమ్మన్నారుకారా? చదువూచెప్పించక పెళ్ళీచెయ్యాక తీరుతుందా యేవిఁషి?

కరట—డబ్బుఖర్చు లేకుండా కొడుక్కి పెళ్ళిచేస్తావుటోయి బావా? ఆడపిల్లన్ని అమ్మినట్టే అనుకున్నావా యేవిఁషి? ఒగిరేనొందలైనా పోస్తేనే గాని అబ్బికి పిల్లనివ్వరు.

అగ్ని—డబ్బుఖర్చు లేకుండా వెంకడికి యెలా పెళ్ళిచేస్తానో నువ్వే చూతువుగాని. రామచంద్రపురం అగ్రహారంలో లుబ్ధావధాన్లుగార్ని యెరుగుదువా?

కరట—యెరగను.

అగ్ని—ఆయన్ని లక్షాధికారి. పద్దెనిమిదివందలకి సుబ్బిని అడగొచ్చారు. ఉభయఖర్చులూ పెడతారట. పెళ్ళి మావైభవంగా చేస్తారట, మనం పిల్లని తీసికెళ్లి వాళ్లింటే పెళ్ళి చెయ్యడం మనకి తట్టుబడి అట్టే ఉండదు. ఆపద్దెనిమిదివొందలూ పెట్టి వెంకడికి పెళ్లిచేస్తాను.

వెంకమ్మ—పెళ్ళికొడుక్కెన్నేళ్ళు?

అగ్ని—యెన్నేళ్లైతేనేమి? నలభైయ్యయిదు.

గిరీ—లుబ్ధావధాన్లు మాపెత్తల్లికొడుకండి, తమతో సమ్మంధమంటే నాకు సంతోషవేఁగానండి. ఆయనకి అరవయ్యేళ్ళు దాటాయండి, యీడేవఁయినా సెల్లింగ్ గర్లన్

అనగా కన్యాశుల్కం, డామిట్ ! యింతమాత్రమూ కూడదండి, నేను పూనాలో ఉన్నప్పుడు అందువిషయమై ఒకనాడు నాల్గు గంటలు ఒక్కటిగిని లెక్చరిచ్చానండి, సావకాశంగా కూర్చుంటే కన్యాశుల్కం కూడని పనని తమచేతనే వొప్పిస్తాను.

కరట—బావా యీసమ్మంధం చేస్తే నీకొంపకి అగ్గెట్టేస్తాను.

అగ్ని—వీళ్ళమ్మా శిఖాతరగ, ప్రతీ గాడిదకొడుకూ తిండిపోతుల్లాగ నాయింట జేరి నన్ను నేవాళ్ళే, తాంబోలం యిచ్చేశాను యిహ తన్నుకుచావండి.

వెంకమ్మ—నాతో చెప్పకుండానే ?

అగ్ని—ఆడముండల్తో నాలోచన? యీసమ్మంధం చెయకపోతే నేను బారిరావుణ్ణే. (లేచి వెళ్ళును.)

కరట—యేంమార్గం.

వెంకమ్మ—అన్నయ్యా ! యీసమ్మంధంచేస్తే నేన్నూరెయ్యోగొయ్యో చూసుకుంటాను పెద్దదాన్ని రొమ్మిమీదకుంపట్లాగ భరిస్తూనేవున్నాం. ఆయనకి యెంత యీడొచ్చినా కష్టసుఖం వొళ్ళు నాటక యీదౌర్భాగ్యపుసమ్మంధం కల్పించుకొచ్చారు. నేబతికి బాగుండాలంటే యీసమ్మంధం తప్పించు,

కరట—గట్టిఅసాధ్యం తెచ్చిపెట్టావే. వొట్టిమూర్ఖపు గాడిదకొడుకు. యెదురుచెప్పిన కొద్దీ మరింతకొరెక్కుతాడు. యేంచెయ్యడానికి గుదునని నీకు ధైర్యంగా చెప్పను ? యేమీ పాలుపోకుండా ఉంది.

గిరీ—అమ్మా ! మీరు యెందుకలా విచారిస్తారు? అవుధాన్లుగారు సావకాశంగా ఉన్నప్పుడు ఒక్కగంట కూర్చుంటే డబ్బిచ్చుకు ముసలివాళ్ళకు పెళ్లిచెయ్యడం వొజ్ఞన్యాయంని లెక్చరిచ్చి మనసు మళ్ళిస్తాను.

వెంకమ్మ—బాబూ ! అతడు మీమేనత్తకొడుకైతే మీకాళ్ళు పట్టుకుంటాను. మీరు వెళ్ళి ఆయన మనస్సు మళ్ళిస్తురూ. నాచర్మం చెప్పులు కుట్టిస్తాను.

గిరీ—అమ్మా ! యేం చెప్పను ! వాడో శ్యాస్త్రం. పిల్ల నౌరకడవే చాలు వాడికి. యీ సమ్మంధం వొదులుకుంటే వాడికి పెళ్ళేకాదు. వాడని వాడొదిలేఘటంకాడు.

కరట—అమ్మా నేనో ఉపాయం చెబుతాను యిలారా. (కరటకశాస్త్రి శిష్యుడు వెంకమ్మ నిష్క్రమింతురు.)

గిరీ—మైడియర్ షేక్స్పియర్ ! నీతండ్రి అగ్గిరావుడోయి, మీయింట్లో యవళ్ళకీ అతణ్ణి లొంగదీశే యలోక్వెన్సు లేదు. నాదెబ్బ చూడు యీవాళ్ళేం జేస్తానో,

వీరేశలింగం పంతులుగారు కన్యాశుల్కం విషయమై రాసిన ఉపన్యాసం పైకి తీయ్. మావఁగారికి లెక్చరివ్వడానికి కొన్ని తీక్కరాకి నూరాలి.

వెంకటేశం—మీ లెక్చరు మాట అలా వుణ్ణీండి గాని యీ రాత్రి నాగండం గడిచింది గదా అని సంతోషిస్తున్నాను, మీరు జ్ఞాపకపోతే పరీక్ష ఫేలయినందుకు మా నాన్న పెయ్యకట్టు తాడుతో చమ్డా లెక్కగొట్టును.

గిరీ—యిలాంటి ప్రమాదాల్తప్పించుకోవడవేఁ ప్రజ్ఞ, యేమైనా డిఫీకల్టీ వొచ్చినప్పుడు ఒకతస్సా వేసారంటే అది బ్రహ్మాస్త్రంగా ఉండాలి. పాలిటిషనంటే యేవనుకున్నావ్? పూజానమస్కారాల్లేక బూజెక్కున్నాను గాని మన కంట్రీయే ఇండిపెండెంట్ అయితే గ్లాడ్స్టన్‌లాగ దివాన్గిరీ చలాయిస్తును. యేమివాయ్! మీ తండ్రి వైఖరి చూస్తే పుస్తకాలకి సొమ్మిచ్చేటట్టు కనపడదు. చుట్టలు పట్నం నించి అరకట్టే తెచ్చాంగదా, యేమిసాధనం?

వెంకటేశం—నాన్నివ్వకపోతే అమ్మనడిగి డబ్బు తెస్తాను.

గిరీ—నీ బుద్ధి యెలా వికసిస్తూందో చూశావా? యిలా తర్ఫీదవుతుంటే నువ్వు కూడా పెద్ద పొలిటీషను వవుతావు.

[బుచ్చమ్మ ప్రవేశించును.]

బుచ్చమ్మ—తమ్ముడూ అమ్మ కాళ్ళు కడుక్కోమంచూంది రా.

గిరీశం—(తనలో) హా బ్యూటిఫుల్! క్వైటు నెక్స్పెక్టెడ్!

బుచ్చమ్మ—అయ్యా మీరు దక్షిణ తించారా?

గిరీ—సాట్డిస్లైట్లీ సెక్షన్, అనగా యంతమాత్రం అభ్యంతరంలేదు. వడ్డించండి దుగో వస్తున్నాను. తోవలో యేటిదగ్గిర సంధ్యావందనం అదీ చేసుకున్నాను.

(బుచ్చమ్మ వెళ్ళును.)

గిరీ—వాట్ యీమె నీ సిష్టరా? తలచెడ్డట్టు కనబడుతున్న దే?

వెంక—మా అక్క, జుత్తుకి చవ్రుత్తానుకోదు.

గిరీ—తల చెడ్డం అంటే, విడో అన్నమాట. పువ్రుదు గివ్రుదు జాంకేసయ్. గాని యిన్నాళ్ళయ్ నీకు విడో మారేజి విషయమై లెక్చర్లిస్తూ ఉంటే యీ కథ యెప్పుడూ చెప్పేవు కావు? మీ యింట్లోనే ఓ అన్ఫార్చ్యునేట్ బ్యూటిఫుల్ యంగ్ విడో ఉండటోయ్! యేమి దురవస్థ! మైహార్ట్ మెల్ట్స్. నేనే తండ్రి నైతే యీ పిల్లకి విడో మారియేజ్జేసి శాశ్వతమైన కీర్తి సంపాదిస్తును. (తనలో) యేవి చక్కదనం, యీ సొంపు యెక్కడా చూళ్ళేదే! పల్లెటూరు వూసుపోదనుకున్నాను గాని పెద్ద కాంపేనుకి అవకాశం యిక్కడ కూడా దొరకడం నా అదృష్టం.

వెంక — మా నాన్న నాకు కూడా పెళ్ళి చేస్తాడు.

గిరీ — యీవేళ్లో పెద్దపెళ్లి నీకు తలవెంట్రుకంత వాసి తప్పిపోయింది, యీ శలవులాఖర్లోగా తాళ్ళాధ్యాయం కాకుండా తప్పించుకుంటే నువ్ పూరా ప్రయోజకుడువే. యిహ నిజవైఁన పెళ్ళా? యింత చదువూ చదువుకుని నీతండ్రి కుదిర్చిన యేవీఁ యెరగని చిన్నపిల్లకా పుస్తెకడతావ్? మాంచియెత్తుగా బుఱ్ఱగా వున్న యంగ్విడోని నువ్ పెళ్ళాడకపోతే ఐషుడ్బి యాషేమ్డాఫ్యూ!

## ౨-వ స్థలము : దేవాలయము.

[పువ్వులతోటలో మండపంమీద కూచుని, శిష్యుడు ప్రవేశించును.]

శిష్యుడు — అర్నెల్లకోమాటు పొస్తకం పట్టుకుంటే కొత్తశ్లోకాలు పాతశ్లోకాలు ఒక్కలాగ్గనపడతాయి. యిప్పుడు కొత్తశ్లోకం కనుక్కొమ్మంటే నాశక్యవాఁ? సిద్ధాంతి నెవణ్ణయినా ప్రశ్న అడిగి కనుక్కోవాలి. లేకుంటే చటుక్కున పుస్తకం విప్పి యేశ్లోకం కనపడితే ఆశ్లోకం చదువుతాను.

"మృగాః ప్రియాళౌ ద్రుమమంజరీణాం"

యిదేదో చదివినజ్ఞాపకం లీలగా వుంది. లేళ్ళు పరుగెత్తాయని కాదు. యేవి గొప్పమాట చెప్పేడోయ్ కవి! లేళ్ళు పరిగెత్తితే యెవడిక్కావాలి? పరిగెత్తకపోతే యెవడిక్కావాలి? నక్కలు పరుగెత్తుతున్నాయ్ కావా, నక్కలు పరిగెత్తుతున్నాయ్ కావా? పిల్లులు పరిగెత్తుతున్నాయి కావా? పనికొచ్చే ముక్క ఒకటి యీ పుస్తకంలో లేదు. నాలుగంకెలు చేరీజు వేయడం వొడ్డీ వాశీ కట్టడం కాళిదాసుకేం తెలుసును? తెల్లవాడిదా మహిమ! యేపట్నం యెక్కడుందో, యేకొండ లెక్కడున్నాయో అడగవయ్యా గిరీశంగార్ని; నిలుచున్నపాట్ను చెబుతాడు.

"ప్రియాముఖం కింపురుషశ్చుచుంబ"

ముద్దెట్టుకున్నాడటోయి ముండాకొడుకు. ముక్కెట్టుకున్నాడు కాడూ?

[కరటకశాస్త్రి శిష్యుడికి కనబడకుండా వెనకనుంచి ప్రవేశించును.]

'వర్ణప్రకర్షే సతి కర్ణికారం
ధునోతినిర్గంధతయాస్మ చేతః॥'

యిదికూడా చదివినట్టే వుందోయి, ఆపువ్వేదో కవి కిష్టం లేదట యిష్టం లేకపోతే మూలిగిపోయిందని కాబోలు? నా గురువుగారికి దొండకాయకూర యిష్టంలేదు, గురువుగారి పెళ్లాం పెరట్లో దొండపాదుందని రోజూ ఆకూరే వొండుతుంది.

బతికున్నవాళ్ళ యిష్టవేఁ యిలా యేడుస్తూంటే చచ్చినయిష్టాయిష్టాల్తో యేంపని? యీ చదువు వొక్కడితో చాలించి గిరీశంగారిదగ్గిర నాలుగింగిలీషు ముక్కలు నేర్చుకుంటాను. వెంకడికి యింగిలీషొచ్చునని యేం గఱ్ఱాగా ఉంది?

తరట—యేమిట్రా అబ్బీ అంటూన్నావు?

శిష్యు—యేదో నాస్వంతఘోష.

కరట—గురువునిగదా, ఆదేదో నాకు కొంచం చెబుదూ.

శిష్యు—చెప్పడానికేవుందండీ? నాటకంలో నాచేత వేషం కట్టించి పెద్ద చాంతాళ్ళాంటి హిందూస్తానీ ముక్కలూ, సంస్కృతం ముక్కలూ, అర్థం తెలియకుండా భట్టీయం వేయించడానికి మీకు ఓపికుంది గాని నాకు నాల్రోజులికో శ్లోకం చెప్పడానికి శ్రద్ధలేదుగదా? పట్నంవొదిలి ఆర్నెల్లకోమాటు అగ్రహారాలంట వొచ్చినప్పుడు మరేం వూసుపోక 'పుస్తకం తియ్యం'టే సంస్కృతం యేం వచ్చేను?

కరట—యిటుపైన్నుంచి యేలా చెబుతానో; రోజుకి నాలుగే శ్లోకాలు చెబుతాను. కొత్తశ్లోకం చదువు.

శిష్యు—"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః ॥

కరట—మొదటికొచ్చావేం?

శిష్యు—మొదలూకొనా వొక్కలాగే కనపడుతూంది.

కరట—(నవ్వి) పోనియ్, మొదణ్నుంచే చదువుదాం.

శిష్యు—చదివినా యేం లాభంవుంది.

కరట—ఎవరు చెప్పేరు?

శిష్యు—గిరీశం గారు.

కరట—యేం చెప్పేడు?

శిష్యు—హిమాలయం రెండు సముద్రాలకీ దాసి, రూళ్ళకఱ్ఱలాగ లేదట. మాప్లో చూపించాడు.

కరట—హిమాలయం శిగగోశిరిగాని, ఆపుస్తకం మూసిచి నామాట విను.

శిష్యు—చిత్తం (పుస్తకం మూయును.)

కరట—చదువన్నదెందుకు. పొట్ట పోషించుకోడానిగ్గదా?

శిష్యు—అవును.

కరట—యీరోజుల్లో నీసంస్కృత చదువెవడి క్కావాలి?

శిష్యు—దరిద్రులి క్కావాలి.

కరట—బాగా చెప్పేవు. నీకు యింగ్లీషు చదువుకోవాలనుందా?

శిష్యు—చెప్పించే దాతేడీ?

కరట—నేను చెప్పిస్తాగా.

శిష్యు—నిజంగాను?

కరట—నిజంగానే, కాని ఒక షరతుంది.

శిష్యు—యేమిటండి?

కరట—నాకు కష్టసాధ్యమైన రాచకార్యం తటస్థించినది. అది నిర్వహించి నువ్వు చేసుకురావాలి.

శిష్యు—నావల్ల నయ్యే రాచకార్యాలు కూడా వున్నాయా?

కరట—యీరాచకార్యం నీవల్లే కావాలి. మరెవడివల్లా కాదు. అదేమిటంటే ఓపది రోజులు నీవు ఆడపిల్లవైపోవాలి.

శిష్యు—గణియం పట్నంలో వుండిపోయింది.

కరట—అట్టే గణియం అవసరంలేదు. నీకు తలమువ్వీ కోకడితే పజ్యాండేళ్ళకన్నెపిల్లలావుంటావు. నిన్ను తీసుకెళ్లి లుబ్ధావధాన్లకి పెళ్లిచేస్తాను. నాలుగు పూటలు వాళ్ళింట నిపుణంగా మెసిలి, వేషంవిప్పేసి పారిపోయిరా. నిజమైన పెళ్ళిముహూర్తం చాలా వ్యవధుంది.

శిష్యు—యిదెంతపని.

కరట—అలాఅనుకోను, అది చేస్తేపట్టాయనా, అనుమానపడతారు. పట్టుబడ్డావంటే పీక తెగిపోతుంది.

శిష్యు—మీకాభయవొద్దు.

కరట—నువ్వు నెగ్గుకొస్తే, మాపిల్లన్నీకిచ్చి యిల్లరికం వుంచుకుంటాను.

శిష్యు—అలా ప్రమాణం చెయ్యండి.

కరట—ఇదుగో యీపుస్తకం పట్టుకు ప్రమాణం చేస్తాను.

శిష్యు—యీపుస్తకంమీద నాకు నమ్మకం పోయింది. మరోగట్టిప్రమాణం చెయ్యండి, గిరీశంగారిని అడిగి ఒక యింగిలీషుపుస్తకం పట్టుకు రానా?

కరట—తప్పితే భూమితోడా.

శిష్యు—మీరు యెగేస్తె భూవేంజేస్తుంది? మీమాటే చాలును కానీండి.

## 3-వ స్థలము: అగ్నిహోత్రావధాన్లు యింటియెదట వీధి

[గిరీశం, వెంకటేశం ప్రవేశింతురు.]

వెంక—శాస్త్రి కన్యాశుల్కం మీద లెక్చరిచ్చారా?

గిరీశం—లెక్చరేమిటోయ్ ఘణం తెగిరిపోయింది. మీతండ్రిది మైరావణ చరిత్రోయ్. మీఅంకల్ కరటకశాస్త్రి సౌకంద్రుల్లా కానపడుతున్నాడు.

వెంక—యేం జరిగిందేం జరిగిందేమిటి?

గిరీశం—విను. రాత్రి భోజనాలవేళ లెక్చరు ఆరంభించమని రోజల్లా బురిడీలు పెట్టాడోయి మీమావఁ. సబ్జక్టు నేను కొంచం యెత్తగానే తను కూడా గట్టిగా సపోర్టు చేస్తానని ప్రోమిస్‌కూడా చేశాడు. నీతండ్రివైఖరి చూస్తేమాత్రం కొంచం ధైర్యం వెనకాడినా లిక్కొనకొచ్చినమాట మళ్ళీ మణిగిపోతూందేది. పెరుగుఅన్నంకలుపుకునేవేళ యిక టైమ్మించి పోతూందని తెగించి లెక్చరు ఆరంభించాను. ఇంట్రడక్షన్ రెండు సెంటెన్సులు యింకా చెప్పనేకాదు. నాలుగు యింగ్లీషు మాటలు దొల్లాయోయ్. దాంతో నీతండ్రి కళ్ళెఱ్ఱజేసి "యీవెధవ యింగ్లీషు చదువునించి బ్రాహ్మణ్యం చెడిపోతూంది; దేవభాషలాగ భోజనాలదగ్గిర కూడా ఆమాటలే కూస్తారు; సంధ్యావందనం, శ్రీసూక్త పురుషసూక్తాలూ తగలబడిపోయినాయి సరేగదా" అని గట్టిగా కేకవేసి చెప్పేసరికి నేను కొంచం పస్తాయించి చెప్పేసరికి "త్రోయింగ్ పెర్ల్సు బిఫోర్ స్వైన్" అనుకొని కరటకశాస్త్రుల్లువేపు చూసేసరికి యేంచేస్తున్నాడనుకున్నావ్? రాస్కేల్ పులకలేమి పలుకలేదుసరిగదా మొహం పక్కకి తిప్పి కడుపుబ్బేటట్టు నవ్వుతున్నాడు. యిక లెక్చరు వెళ్ళింది కాదు. ఛీ యింత యిన్సల్టు జరిగింతరవాత తత్క్షణం బయలుదేరి వెళ్ళిపోదావఁనుకున్నాను.

వెంక—అయ్యో వెళ్ళిపోతారా యేవిఁటి?

గిరీశం—నాటింది లీష్టు. కొసాకి విను, నీతండ్రిని పాకెట్లో వేశాను.

వెంక—నాతండ్రికి లెక్చరిచ్చి పెళ్ళి తప్పిస్తావఁన్నారే?

గిరీ—పెళ్ళి ఆపడానికి బ్రహ్మశక్యంకాదు. డిమాస్థనీసు, సురేంద్రనాథ్ బెనర్జి వచ్చి చెప్పినా నీతండ్రి యీపెళ్ళి మానడు. లెక్చర్లు యెంతసేపూ సిటీల్లోనే గాని పల్లిటూళ్ళలో యెంతమాత్రం పనికిరావు. పూనాలాంటి సిటీలో లెక్చర్ యిచ్చావంటే టెంథౌజండు పీపిల్ వినడానికి వొస్తారు. మనవూళ్ళోనే పెద్దమీటింగులు చెయ్యాలంటే డప్పులు బజాయించి, నోటీసులుకట్టి, బజార్లుకాసి తోవంట పోయేవాళ్ళని యీడ్చుకువొచ్చినా యాభైమంది కారు. పల్లిటూరు పీపిల్ లెక్చర్లకి అన్‌ఫిట్. మొన్న మాసం వొచ్చినబండీవానికి నాషనల్ కాంగ్రెస్ విషయవైఁ రెండు ఘంటలు లెక్చరు యిచ్చేసరికి ఆగాడిదకొడుకు, వాళ్ళవూరు హెడ్ కానిస్టేబిల్ని కాంగ్రెసువారు యెప్పుడు బదిలీచేస్తారని అడిగాడు! విలేజస్‌లో లెక్చర్లు యెంతమాత్రం కార్యంలేదు. నీతండ్రిదగ్గిరమాత్రం లెక్చరన్నమాటకూడా అనకూడదు

వెంక—అయితే నాన్నని యెలాగ జేబులో వేశారేవిఁటి?

గిరీ—అది పోలిటిక్సు డెబ్బోయ్! ఆతరవాత కథ విను. నామీద కేకలేసిన తరవాత కోపవఁణక్క, ఘుమఘుమలాడుకుంటూ, పెరుగూ అన్నం కుమ్మడం ఆరంభిం

చాడు. ఇంతలో మీఅప్పవొచ్చి గుమ్మందగ్గిర నిలబడి కోకిలకంఠంతో "నాన్నా తమ్ముడికి పెళ్ళి చెయ్యాలంటే నాసొమ్ముపెట్టి పెళ్ళి చెయ్యండిగాని దానికొంప ముంచి లుబ్ధావధాన్లుకి యివ్వొద్దని" చెప్పినది దాంతో నీతండ్రికి వెఱ్ఱికోపం వొచ్చి వుత్తరాపోశనం పట్టకుండానే ఆఘాయిగూ అన్నంలో విస్తరి తీసికెళ్లి దాన్నెత్తినిరుద్దేశాడు! తరటకశాస్త్రుల్లు అడ్డుపడబోతే చెంబుతో నీళ్ళు వాడినెత్తిం దిమ్మరించాడు. కరటకశాస్త్రుల్లుకి కోపం వొచ్చి శిష్యుణ్ణి తీసుకు వాళ్ళ వూరెళ్ళి పోయినారు.

వెంక—దీని పేరేనా యేవిఁటి మా నాన్నని జేబులో వేసుకోవడం?

గిరీ—పేషన్స్! కొసాకి విను. స్కౌండ్రల్ కరటకశాస్త్రుల్లు వెళ్ళిపోయినాడనిసంతోషించానుగాని, నీ సిస్టర్ ఫేట్ విషయవైఁ మహావిచార వైఁంది. నేనే దాని హజ్బెండైన్నైవుంటే, నిలబడ్డపాటున నీతండ్రిని రివాల్వర్తో షూట్ చేశి వుందును. మీఅమ్మ యేడుస్తూ ఒకమూల కూచుంది. అప్పుణ్ణేవెళ్ళి, నీళ్ళపొయిలో నిప్పేసి నీళ్ళుతోడి నీసిస్టర్ని స్నానం చెయ్యమన్నాను. సిగర్స్ కాల్చుకుందాఁవని అరుగు మీద బిచాణా వేసేసరికి నీతండ్రికి పశ్చాత్తాపం వొచ్చి, తానూ ఆఅరుగుమీదే బిచాణావేసి, ఒక్కసిగరయినా కాల్చనియ్యకుండా రాత్రల్లా కబుర్లలో పెట్టి చంపేశాడోయ్. మొత్తానికి కత్తు కలిపేశాను.

వెంక—యెలాక్కలిపేరేవిఁటి?

గిరీ—ఒక పొలిటికల్ మహాస్త్రం ప్రయోగించి కలిపేశాను.

వెంక—యేవిఁటండా అస్త్రం?

గిరీ—ఒకడు చెప్పిందల్లా మహాబాగుందండవేఁ. సమ్మోహనాస్త్రవఁంటే అదేకదా?

వెంక—లెక్చరిచ్చి మాతండ్రిని వొప్పించడానికి బదులుగా ఆయన చెప్పిందానికి మీరే ఒప్పుకున్నారూ?

గిరీ—కుంచం నిలువుగా కొలవడానికి వీల్లేనప్పుడు, తిరగేశైనా కొలిస్తే నాలుగ్గింజలు నిలుస్తాయి. బాగాఆలోచిస్తే యిన్ఫెంటు మారియేజి కూడుననే తోస్తూంది.

వెంక—యిన్నాళ్ళూ కూడదని చెప్పేవారే నాతోటి?

గిరీ—ఒపినియన్సు అప్పుడప్పుడు ఛేంజి చేస్తూంటేనే గాని పొలిటిషను కానేరడు. నాకు తోచిన కొత్తఆర్గ్యుమేంటు విన్నావా? యిన్ఫెంటు మారేజీలు అయితేనే గాని యంగ్ విడోస్ వుండరు. యంగ్ విడోస్ ఉంటేనే గాని, విడోమారియేజ్ రిఫారమ్‌కి అవకాశం ఉండదుగదా? సివిలిజేషన్కల్లా నిగ్గువిడోమారియేజ్ అయి

వప్పుకు, యిన్ఫెంటు మారేజీలేక పోతే, సివిలిజేషన్ హోల్డుపుకుంది? మరి ముందు అడుగు పెట్టలేదు. గనక తప్పకుండా యిన్ఫెంట్ మారేజి చెయ్యవలసిందే. ఇది వొహ కొత్త డిస్కవరీ; నంబర్ టూ, చిన్నపిల్లల్ని ముసలాళ్ళకిచ్చి పెళ్ళిచెయ్యడం కూడా మంచిదే అని నేను వాదిస్తాను.

వెంక—సుబ్బిని లుబ్ధావధాన్లికి యివ్వడం మంచిదంటారా యేవిఁటి? అమ్మ అసమ్మంధం జేస్తే నూతిలో పడతానంటూందే?

గిరీ—ఫెమినైన్స్ ఫూల్సన్నాడు. "పడుపడు అన్నసవితే గాని పడ్డ నాసవితి లేదంది" లెవరోను. నూతులో పడడం, గీతులో పడడం నాన్సెన్స్, ఓ రెండు తులాల సరుకోటి మీనాన్న కేయించి యిచ్చాడంటే మీఅమ్మ ఆమాట మానేస్తుంది. గాని నాఆర్గ్యుమెంటు విను.

వెంక—యేవిఁటండి.

గిరీ—పెళ్ళనే వస్తువ శుభవాఁ? అశుభవాఁ? మంచిదా? చెడ్డదా? చెప్పు?

వెంక—మంచిదే.

గిరీ—వెరిగుడ్. పెళ్ళనేది మంచి పదార్థవైఁతే 'అధికస్య అధికం ఫలం' అన్నాడు గనుక చిన్నపిల్లని ఒక ముసలాడికి పెళ్ళిజేసి, వాడు చస్తే మరోడికి, మరోడు చస్తే మరోడికి, యిలాగ పెళ్ళిమీద పెళ్ళి, పెళ్ళిమీద పెళ్ళి అయి, వీడిదగ్గరో వెయ్యి. వాడిదగ్గిరో వెయ్యి, మరోడిదగ్గిర మరో వెయ్యి, రొట్టిమీద నెయ్యి, నేతిమీద రొట్టిలాగ యేకోత్రవృద్ధిగా కన్యాశుల్కం లాగి, తుదకి నాలాంటి బుద్ధిమంతుణ్ని చూసి పెళ్ళాడితే చెప్పావ్ మజా? ఇహ సౌఖ్యం పూర్తిగా లభిస్తుంది. ఇహ సౌఖ్యంవుంటే పరసౌఖ్యం కూడా సాధించావేఁ అన్నమాట యిలాగో తెలిసిందా? ఈజ్ మెంటు హాన్కు యస్టాబ్లిష్ అవుతుంది.

వెంక—కన్యాశుల్కం కూడా మంచిదంటున్నారేవిఁటి?

గిరీ—మరేవిఁటనుకున్నావ్? నెవ్వర్డూబైనాప్సన్నాడు చేస్తే శుద్ధక్షవరవేఁ గాని తిరపతి మంగడిలాగ క్షవరం చెయ్యకూడదు. యీఅస్త్రంతోటే మీతండ్రి వశ్యం అయినాడు. యింగ్లీషువాడు 'థింక్' అన్నాడోయి ఆలోచిస్తేగాని నిజం బోధపడదు. బాగా ఆలోచించగా, కన్యాశుల్కంలేని మేరేజే యీభూప్రపంచంలో లేదు విన్నావా?

వెంక—యెలాగండి?

గిరీ—అలా అడగవోయి, యేం? డబ్బుచ్చుకుంటేనే కన్యాశుల్కమయిందేం? ఇన్ని తులాలు బంగారం పెట్టాలి, యింత వెండి పెట్టాలి, అని రూపాయిలకి బదులుగా వెండిబంగారాలకింద ధనంలాగితే, కన్యాశుల్కం అయిందికాదేం? యీ పెద్దపెద్ద పంతుళ్ళవారంతా యిలా వేస్తూన్నవారేనా?

వెంక—అవును.

గిరీ—యింకా దొరల్లోనో! వాళ్ళతస్సాగొయ్యా. యిల్లుగుల్ల చేస్తారోయి; అవి గుడ్డలు కావు, అవి శెంట్లు కావు, అవి ఆయిత్సు కావు, మేరియేజి సెటిలుమెంటని బోలెడు ఆస్తికూడా లాగుతారు, ఈ ఆర్గ్యుమెంటు నేను చెప్పేసరికి నీతండ్రి బ్రహ్మానందభరితుడైనాడు. లుబ్ధావుధాన్లు పెళ్ళికి అన్నిటికన్న పెద్దసబబొకటి నీకు చెప్తాను విను.

వెంక—యేమిటండి?

గిరీ—లుబ్ధావుధాన్లు ముసలాడూ, బంగారప్పిచికానున్నూ. రెండేళ్ళకో మూడేళ్ళకో అమాంతంగా బాల్చీ తన్నేస్తాడు. అనగా "కిక్సు ది బకెట్" దాంతో నీచెల్లెలు రిచ్చి విడో అవుతుంది. నువ్వు పెద్దవాడివైన తరవాత దానికి విడో మారియేజి చేసి శాశ్వతమైన కీర్తి అతిసులభంగా సంపాదించవచ్చును. యేమంటావ్?

వెంక—అవును.

గిరీ—మరో గొప్పమాట. యీసంబంధం అయితే నీకూ నాకూ సంబంధం కలుస్తుందోయి.

వెంక—అది నాకిష్టమే.

గిరీ—రాత్రి నీతండ్రి, నిను హైకోర్టువకాల్తీదాకా చదువు చెప్పిస్తానన్నాడు. ప్రస్తుతోపయోగం పుస్తకాలమూట కదిపాను గాని, పెళ్ళినుంచి వచ్చింతర్వాత యిస్తానన్నాడు. యీలోగా చుట్టముక్క లేకపోతే గుడ్లెక్కొస్తాయి. సిగర్సుకోసం కాపర్సేనయినా సంపాదించావా లేదా?

వెంక—లేదు. యీవుదయవల్లా అమ్మ ధుమధుమలాడుతూ నేకుంది. మానాన్న పొడుం కోసం గూట్లో నిలవచేసిన పొగాకులోని వోకట్ట వోణీలో దాచి తీసుకొచ్చాను.

గిరీ—దటీజ్ ప్రేక్టికల్! మరి యింతసేపూ చెప్పవుకానేం? చుట్టలుచుట్టుకుని యీ కోవెల గోపురంలో కూచుని కాల్చుకుందాం రా?

వెంక—కోవిల్లో చుట్టకాల్చవొచ్చునా?

గిరీ—కాలిస్తే కోవిల్లోనే కాల్చాలోయి. దీనిపొగ ముందర సాంబ్రాణీ, గుగ్గిలం యేమూల? యేదీకట్టయిలాతే (కట్ట అందుకొని వాసన చూసి) ఆహా! యేమి పొగాకోయి! నిజంగా కంట్రీలైఫులో చాలా చమత్కారం వుంది. బెస్టు టొబాకో, బెస్టు గేదపెరుగు. మాంచిఘీ. అంచేత నేనోయ్ పోయట్సు 'కంట్రీ లైఫ్ కంట్రీ లైఫ్' అని దేవుల్లాడుతాడు.

వెంక—మీరూ పోయట్సేగదా?

గిరీ—అందు కభ్యంతరవేఁవిఁటి? నాకూ కంట్రీ లైఫు యిష్టవేఁగాని సిటీలోలాగ బ్యూటిఫుల్ షెపర్డెస్సూ, లవ్ మేకింగూ వుండవోయ్. గ్రామాల్లో తగుమాత్రంగా వుంటారుగాని, హూడర్టీస్మెల్! అదీగాకిన్నీ మన దేశంలో మెయిడన్సు వుండరోయి, యెంతసేపూ లవ్మేకింగ్ విడోజ్కి చెయ్యాలిగాని, మరి సాధనాంతరం లేదు.

వెంక—మీరు విడోమీద చేసిన పోయిట్రీ రాసియిస్తానని యిచ్చారుకారుగదా?

గిరీ—తర్జుమా చేస్తే వస్తువిలువ తగ్గిపోతుంది. అదీగాకిన్నీ, మరి రెండేళ్ళుపోతేనే గాని దాని రసం నీకు బాగా బోధపడదు. అయినా స్పెషల్ కేసుగా నీకు ఉపదేశం చేస్తాను నోటుబుక్కు తీసి రాయి.

(గిరీశం చుట్ట కాలుస్తూ, మధ్యమధ్య చుట్టచేత పట్టి ఒక్కొక్క ముక్క చెప్పగా వెంకటేశం వ్రాయును.)

THE WIDOW.

She leaves her bed at A. M four,
And sweeps the dust from off the floor,
And heaps it all behind the door,
The Widow!

Of wond'rous size she makes the cake,
And takes much pains to boil and bake,
And eats it all without mistake,
The Widow!

Through fasts and feats she keeps her health,
And pie on pie, she stores by stealth,
Till all the town talk of her wealth,
The Widow!

And now and then she takes a mate,
And lets the hair grow on her pate,
And cares a hang what people prate,
The Widow!

I love the widow—however she be,
Married again—or single free,

Bathing and praying,
Or frisking and playing,
A model of saintliness,
Or model of comeliness,
What were the earth,
But for her birth?

The Widow!

యినే నేను రిఫార్మర్లో అచ్చువేసేటప్పటికి టెన్నిసన్ చూసి గుండె కొట్టుకున్నాడు. చుట్ట తాగడం సమాప్తంచేసి యింటికి పోదాం రా చాలాసేపైంది.

(నాలుగడుగులు యిద్దరూ నడిచేసరికి అగ్నిహోత్రావధాన్లు కలియును)

అగ్ని—ఏవఁండీ పాణుమాన్లుగారూ! మీ పేరేవిఁటండీ!

గిరీ—గిరీశం అంటారండి.

అగ్ని—అదుగో, గిరీశంగారూ రాత్రి మనవఁనుకున్నప్రకారం మన దావాలు గెలుస్తాయనే మీ అభిప్రాయవాఁ?

గిరీ—గెలవకపోతే నేను చెవి కదపాయించుక వెళ్ళిపోతాను. మీ పూహాపోహలు సామాన్యమైనవా? అందులో "యతో ధర్మ స్తతో జయః" అన్నట్టు న్యాయం మీ పక్షం వుంది బాప్పన్నమ్మగారి కేసు విషయమై జబ్బల్పూర్ హైకోర్టు తీర్పొకటి మనకి మహాబలంగా వుంది, నా పెత్తండ్రిగారు యిలాంటి కేసే ఒకటి యీమధ్య గెలిచారండి.

అగ్ని—దీనికల్లా అసాధ్యం యీ కేసు కాకినాడ్లో తేవలసొచ్చింది. మా కరటకశాస్త్రుల్ని పంపిస్తే యెవడో చవటవకీల్ని కుదిర్చాడు. వాడెప్పుడూ డబ్బు తెమ్మని రాయడవేఁగాని కేసుభోగట్టా యేవీఁ రాయడు. గడియగడియకీ వెళ్ళడావంటే దూరాభారం గదా?

గిరీ—మీకు శలవైతే స్టీమరుమీద నేను వెళ్ళి ఆవ్యవహారవంతా చక్కబెట్టుకు వస్తాను. మా పెత్తండ్రిగారు కాకినాడకల్లా తెలివైన ప్లీడరు, ఆయన పట్టిన కేసు యెన్నడూ పోయిందన్న మాట లేదండి.

అగ్ని—మీరు వెళితే నేను వెళ్ళినట్టే, యింతఫీజయినా మీ పెత్తండ్రిగారికి వకాల్తీ యిద్దాం, యేవంటారు?

గిరీ—మీదగ్గిర ఫీజా పుచ్చుకోవడంకూడానండి? ఖర్చులుమట్టుకు మీరు పెట్టుకుంటే ఫీజక్కరలేకుండానే పనిచేయిస్తానండి.

అగ్ని—మీరలా అంటార న్నే నెరుగుదును గాని గెలిచిం తరవాత మనకి తోచిన బహుమతీ యిద్దాం.

గిరీ — యిచ్చినాసరే యివ్వకపోయినా సరేలెండి.

[బుచ్చమ్మ ప్రవేశించును.]

బుచ్చమ్మ — నాన్నా అమ్మ స్నానానికి లెమ్మంటూంది.

అగ్ని — అలాగే. (బుచ్చమ్మ వెళ్ళిపోతూండగా గిరీశం కేగంట చూచును.)

భోజనం చేసినతరవాత కాయితాలు మీచేతికిస్తాను. అవన్నీ సావకాశంగా చూడండి, మా యింటితూరుప్పారుగు రామావుధాన్లుమీద మండడిగోడవిషయమై మానం తెచ్చినదావా అంతం పుచ్చువని మునసబు అన్యాయంగా కొట్టేశాడు. జడ్జీకోర్టులో అప్పీలుచేశాం; మావకీలు అవతలపార్టీదగ్గిర కతికి మన కేసు ధ్వంసం చేశాడు. మీవంటివారు నాకు చెయ్యాసరా వుంటే రామావుధాన్లు పిలకూడ దీసేదును; కానిండిగాని తూరుప్పు మండడిగోడ రామావుధాన్లిదయితే, పడవటి మండడిగోడ నుందవాలా లేదా? న్యాయం చెప్పండి చూడండీ. దానిమీద యేలాగొంజాయెత్తేడో! క్రిమిన్లశీపించమని భుక్తసలహా చెప్పేడు.

[బుచ్చమ్మ ప్రవేశించును.]

బుచ్చ — నాన్నా! అమ్మ స్నానం చెయ్యమంటూంది.

అగ్ని — వెధవముండా సాద! పెద్దమనుష్యుల్తో వ్యవహారం మాట్లాడుతూంటే రామాయణంలో పిడకలవేట్లాటలాగ అసే పిలవడవాఁ?

గిరీ — తప్పకుండా క్రిమినల్కేసు తేవలసిందే, క్రిమినల్ప్రొసిజ్యూర్ కోడు 171 శక్షన్ ప్రకారం తెద్దావాఁ? 172 డో శక్షన్ ప్రకారం తెద్దావాఁ?

అగ్ని — రెండు శక్షన్లూ తేలేవేఁ?

గిరీ — నేరంగలప్రదేశం, ఆక్రమణ — రెండు శక్షన్లూ కూడా ఉపచరిస్తాయి సరేగదా కళ్ళతో చూశానుగనుక యీగోడమీదయినట్టు జల్లీలైగ బొడిచి సాక్ష్యం కూడా పలగ్గలను, యీగోడ స్పష్టంగా మీదాన్లాగే కనబడుతూంది.

అగ్ని — అందుకు సందేహంవుందండీ, యేమరిచి యెన్నాళ్ళు వూరుకున్నాను. పెరటిగోడకూడా చూతురుగాన్రండి, ఆకాక్కా బత్తుడిముక్కు నులిపి గెల్చుకున్నాను, కాని యీదావాలక్రింద సిరిపురంభూమిఁ అమ్మెయ్యవలసి వొచ్చిందండి, రామావధాన్లు కేసుకూడా గెలిస్తే, ఆవిచారం నాకు లేకపోవును.

(అందరు నిష్క్రమింతురు.)

శ్రీ

# కన్యాశుల్కము — తృతీయాంకము

౧-వ స్థలము : రామచంద్రపురం అగ్రహారంలో
రామప్పంతులు యింట్లో సావిట్లో గది.

[మధురవాణి ప్రవేశించును.]

మధు — యీ రామప్పంతులు కథ పైకి పటాటోపం, లోపల లొటారంలా కనిపిస్తూంది. భూవుఁలన్నీ తాకట్టుపడి వున్నాయిట; మరి రుణం కూడా పుట్టదట; వాళ్ళకీ వీళ్ళకీ జుట్లు ముడేసి జీవనం జేస్తూన్నాడు, యీ వూరు వేగం సవిరించి చెయ్ చిక్కినంత సొమ్ము చిక్కించుకుని పెందరాళే ఘరోక్యొమ్మ పట్టుకోవాలి. (పాడును.)
"తెలిసెను మోసపోతినే, తెలిసెను" (పాడుతుండగా రామప్పంతులు ప్రవేశించును)

రామ — యేవిఁటో ఆ మోసపోవడం? తరవాత ముక్కేవిఁటి, పాడూ,

మధు — తరవాత ముక్కేవుఁండి, మిమ్మల్ని నమ్మి మోసపోయినాను.

రామ — అదేం అలా అంటూన్నావు? నిన్ను మోసపుచ్చలేదే? నిర్ణయప్రకారం రెండొందలూ పట్నంలో యిచ్చాను. నెలజీతం నెలసరుండే యిచ్చాను. యిహ మోసవేఁవుంది?

మధు — యేం చిత్రంగా మట్లాడతారు పంతులుగారూ! నాకు డబ్బే ప్రధానమైనట్టు మీ మనసుకి పొడగడుతూంది కాబోలు, నాకు డబ్బు గడ్డిపరక. మీ భూవుఁలు రుణాక్రాంతమైనాయని అప్పట్లో నాకు తెలిసుంటే మీ దగ్గిర రెండొందలూ పుచ్చుకుందునా? మీరు ఖర్చువెచ్చాలు తగ్గించుకోని సంసారం బాగుచేసుకోకపోతే నేనుమాత్రం వొప్పేదాన్ని కాను. ఫలానా పంతులుగారు ఫలానా సాన్నుంచుకుని బాగుపడ్డారంటేనే నాకు ప్రతిష్ఠ. మాయింటిసాంప్రదాయం ఇది పంతులుగారూ! అంతే గాని లోకంలో సాన్లమచ్చని వూహించకండి.

రామ — భూవుఁలు తనఖా అన్నమాట శుద్ధ అబద్ధం యెవరన్నారో గాని; నేను మహారాజులా వున్నాను.

మధు — నాకంటికి మహారాజులా కనపడబట్టే యిల్లూ, వాకిలీ వొదిలి మానం ప్రాణం మీపాలు చేసి నమ్మి మీ వెంట వొచ్చాను. నన్ను మోసం మాత్రం చెయ్యకండి; మిమ్మల్ని పాపం గుచ్చుకుంటుంది.

రామ—నేను మోసంచేసే మనిషినేనా ?

మధు—అలాగయితే లుబ్ధావుధాన్లుగారికి పెళ్ళెందుకు కుదిర్చారు? నాకు తెలియదనుకున్నారా యేమిటి? ఆముసలాడికి పెళ్ళెందుకు? మీకోసమే యీయెత్తంతాను.

రామ—హా! హా! యిదా అనుమానం! కొంచం గెడ్డం నెరుస్తూంది. నన్ను కూడా ముసలాణ్ణంటావా యేమిటి?

మధు—చెట్లకి చావ నలుపు, మనిషికి చావ తెలుపూ. అనగా చీకట్లో నక్షత్రాల్లాగ అక్కడక్కడ తలవెంట్రుక తగిల్తేనే చమక్.

రామ—స్వారస్యం మా చమత్కారంగా తీశావ్! యేదీ ముద్దు. (రామప్పంతులు మధురవాణిని ముద్దెట్టుకోబోవును.)

మధు—(చేతులతో అడ్డి మొఖము ఓరజేసుకొని) నేనా మోసగత్తెనా? లుబ్ధావుధాన్లు పెళ్ళితప్పించేస్తేగాని నేను ముద్దుబెట్టుకోనివ్వను.

రామ—అంతా సిద్ధమైన తరవాత నాశక్యమా అపడానికి (బలాత్కారంగా ముద్దు బెట్టుకొనును.)

మధు—సత్తు వుందనా మోటతనం?

రామ—నాసత్తు విప్పుడేం జూశావ్. చిన్నతనంలో ధ్వజస్తంభం దండతో కొడితే గణగణమని గంటలన్నీ ఒకగడియ వాగేవి. నాడు జబ్బు చేసిందగ్గిర్నుంచీ డీలా అయిపోయినాను.

మధు—యిదా డీలా? నా చెయి చూశండీ యలా కందిపోయిందో ఆన్నా,

రామ—చాప చిరిగినా చదరంతౌను, నీప్రాణునికి యిప్పటిసత్తువే ఉడ్డోలంలా కనపడుతూంది.

మధు—యీ పెళ్ళి మాన్పించక పోతే నేను మీతో మాట్లాడను.

రామ—వెఱ్ఱికుదిరింది, రోకలితలకి చుట్టమన్నాట్ట! రెండేళ్ళాయి ఆముసలిగాడిద కొడుకుమీద నాలౌక్యప్రజ్ఞంతా వినియోగపర్చి పెళ్ళి సిద్ధంచేసి యిప్పుడెలా తప్పించడం?

మధు—యేం లౌక్యం చేశారు?

రామ—ఆలా అడుగు. నాబుద్ధిసత్తువ కూడా నీకు తెలుస్తుంది. లుబ్ధావుధాన్లు పరమ లోభి. వాడిగుణం యిలావుండబోతుందని పోల్చాలేమో అన్నట్టు చిన్నతనంలో వాడికి పేరుపెట్టాను. పెళ్ళాడితే వోల్లమాల్ని ధనంవొస్తుందని ఆశ పెట్టించాను.

మధు—యలాచేశారీమహాచిత్రం? పెళ్ళైతే ధనం ఖర్చౌతుందిగాని, రావడ మేలాగ?

రామ—లౌక్య మంటే మరేమనుకున్నావు? అసాధ్యాలు! సాధ్యం, సాధ్యాలు అసాధ్యం చెయ్యడమేకదూ? మన సిద్ధాంతిని దువ్వేటప్పటికి వాడేం జేశాడను

కున్నావు? లుబ్ధావధాన్లు జాతకం యీగా దిగా చూసి, శీఘ్రంలో వివాహ యోగం వుందన్నాడు, ఆవివాహంవల్ల ధనయోగంవుందన్నాడు, దాంతో ముసలాడికి డబ్బొస్తుందనుఆశ ముందుకి, డబ్బు ఖర్చౌతుం దన్నభయం వెనక్కీ లాగడం ఆరంభించింది. ఇంతట్లో పంతొాగా రిక్కడికొచ్చారు, ఆయన్ని కూడా తయారు చేశాను. లుబ్ధావధాన్లు అనుమానం తీర్చుకుందామని ఆయనకి జాతకం చూపించే సరికి పంతొాగారు యేమన్నారూ? "వివాహధనయోగాలు జమిలిగా వున్నాయి, ఆయితే మీరు పెద్దవాళ్ళు, యిప్పుడు మీను పిల్ల నెవరిస్తారు, పెళ్ళేలా అవుతుంది? ఇలాంటివి జరగడానికి వీల్లేని మహాయోగాలు జాతకాల్లో పట్టినప్పుడు గొప్ప మేలుకు బదులుగా గొప్పకీడు సంభవిస్తుంది. అనగా మీను మారకవోఁ ధననష్టవోఁ సంభవిస్తుంది. గ్రహశాంతి చేసి బ్రాహ్మణ భోజనం బాహుళ్యంగా చెయ్యండి, కొంత జబ్బోగిబ్బో చేసి అంతవో అరిష్టం పోతుంది. మంచిరోజు చూసి సూర్యనమస్కారాలు ఆరంభించండి" అని చెప్పేసరికి అవుధాన్లు గుండె రెండు చెక్కలై వివాహప్రయత్నం ఆరంభించాడు. ఇదీ కథ.

మధు—యేమి కల్పన!

రామ—ఇంకా వుంది! యిహను కృష్ణారాయపురంలో అగ్నిహోత్రావుధాన్లు కూతురు జాతకవేఁలా వుందట? చెప్పడానికి అలవిలేదు. అది కాలుపెట్టిన యిల్లు పసి యిళ్ళవుతుందట. అది పట్టిందల్లా బంగార వౌఁతుందట!

మధు—నిజవేఁనా లేక అదీ మీబనాయింపేనా?

రామ—అదిమట్టుకు నా బనాయింపు కాదు, అగ్నిహోత్రావుధాన్లే జాతకం అలా బనాయించాడు, మాబ్రాహ్మల్లో యిది పరిపాటె, పెళ్ళిళ్ళలో పంపించేది ఒహ జాతకవూఁ నిజంవుండదు.

మధు—యేమ్మోసం!

రామ—లౌక్యం, లౌక్యవఁను.

మధు—రెండింటికీ యేవిఁటో భేదం!

రామ—నమ్మించోట చేస్తేమోసం, నమ్మంచోట చేస్తే లౌక్యవూఁను.

మధు—తాను చేస్తే లౌక్యం, మరోడు చేస్తె మోసం అనరాదా? అబద్ధానికి అర్థ వేఁవిఁటి?

రామ—యేవఁన్నావూ? అబద్ధవఁనా? ఉద్యోగధర్మం లౌక్యవృత్తి అని, అది వక వృత్తి భగవంతుడు కల్పించాడు. ఆలౌక్యవృత్తి యెటువంటిదీ? నిజాన్ని పోలిన అబద్ధవాఁడి ద్రవ్యాకర్షణ చేసేది. ఈధర్మసూక్ష్మాలు నీకెలా తెలుస్తాయి.

మధు—నాకెలా తెలుస్తాయి నిజవేఁగాని, ద్రవ్యాకర్షణ యేలాగ యీపెళ్లివల్ల?

రామ—(తనలో) క్రాసెగ్జామిషను చేస్తూందోయి దీంతస్సాగొయ్యా (పైకి) నీకు

మేజువాణి నిర్ణయించుకున్నాను కానూ, నీకు పదిరూపాయల సొమ్ము దొరకడం ద్రవ్యాకర్షణకాదా ?

మధు—యేంచిత్రవైఁన మనుష్యులు పంతులుగారూ! (తనులపాకు చుట్టతో కొట్టి) నేను రాబోతానని రెండేళ్ళకిందట కలగని, యీ రాబోయే మేజువాణీ బుద్ధిలో వుంచుకొని యీ పెళ్ళి కావడానికి విశ్వప్రయత్నం జేశారూ? ద్రవ్యాకర్షణ యలాగో నాకు బోధపడదు. పెళ్ళికూతుర్ని యిలాకా వేసుకుని, దాండ్వారా ముసలాడి మూటా ముళ్ళా లాగేస్తారు. యింతసత్యకాలపదాన్నయినా ఆమాత్రం ఊహించుకోగల్ను. లేకపోతే నేయింత బతిమాలుకున్నా యీ పెళ్ళి తప్పించక పోవవేఁవిఁ? మీబుద్ధికి అసాధ్యం వుందంటేనే నమ్ముతానా ?

రామ—ఆమాట్నిజవేఁగాని, అన్నిపనులూ ద్రవ్యాకర్షణకోసవేఁ చూస్తానను కున్నావాయేవిఁటి? ఆముసలాణ్ణి కాపాడదాఁవనే, యీ పెళ్ళి తలపెట్టాను.

మధు—'చిత్రం చిత్రం మహాచిత్రం' అని కథుంది, అలా వున్నాయి మీచర్యలు.

రామ—ఆకథేదో చెబుదూ, నాకేం కథలంటే మా సరదా.

మధు—పొగటిపూట కథలేవిఁటి? ముందు యీచిత్రకథేవిఁటో తెలవియ్యండి.

రామ—అది చెప్పేదికాదు చెప్పను.

మధు—చెప్పకపోతే వొప్పను.

రామ—ఒప్పకేంజేస్తావు ?

మధు—యేంజాస్తానా? యీజడతో కొడతాను. శాస్త్రంలో కాముకులకు చెప్పిన ఆయుధవిఁది.

రామ—నేం దెబ్బలికి మనిషిని కాను. శాస్త్రం గీస్త్రం వొకపక్కనుంచి మోట సరసం మాను. చెప్పమంటే చెబుతానుగాని ఆలాంటి కబుర్లు నువ్వు వినకూడదు. మరేంలేదు లుబ్ధావుధాన్లు వెధవకూతురు మీనాక్షి ప్రవర్తన మంచిదికాదు. నాల్రోజులకోమారు అది పీకలమీదికి తెస్తూంటుంది, పోలీసువాళ్ళు బెదరించి పదిడబ్బులసొమ్ము లాగేస్తూంటారు. డబ్బుఖర్చంటే ముసలాడికి ప్రాణపోకట. సంసారం కూడా మీనాక్షి దూబర చేస్తుందంటాడు. పెళ్ళయితే దాని ఆట కడుతుంది.

మధు—మీనాక్షి ప్రవర్తన బాగుందికాదంటూ మీరే చెప్పాలి. మీరు కంటపడ్డతరవాత యే ఆడదాని ప్రవర్తన తిన్నగా ఉంటుంది?

రామ—ఆదుగో చూశావా? అలా అంటావనేకదూ, చెప్పనన్నాను.

మధు—యీచిక్కులు నాకేం తెలీఁవు. పెళ్ళి మానిపించెయ్యండి.

రామ—యీపెళ్ళిలో నీమేజువాణీపెట్టి పదిరాళ్ళిప్పిస్తాను మాటాడకూరుకో.

మధు—(ముక్కుమీద వేలుంచుకొని) లుబ్ధావుధాన్లుయెదట నేను మేజువాణీ ఆఁ!

రామ—పేరువాడు గాని, సభలో పెద్ద నే నేకనూ?

(హెడ్‌కనిస్టేబ్ చుట్టకాలుస్తూ ప్రవేశించి కుర్చీమీద కూర్చొనును.)

హెడ్—రామప్పంతులూ; యినస్పెక్టరికేటోపి వేశావటే?

రామ—(హెడ్‌కనిస్టేబుచెవిలో) గారూ గారూ అనవయ్యా.

హెడ్—యెప్పుడూ లేంది గారేమిటి గిరేమిటి, చింతగారు?

రామ—ఆడవాళ్ళున్నచోటకి లోకువ కానడవేంవా, అన్నా!

హెడ్—ఆడవాళ్ళేటున్నావు, నువ్వూకూడాఅందులోనే జమాయేవిఁటి? ఆహా!హా!

రామ—హాస్యానికి వేళా పాళా ఉండాలి.

హెడ్—నేను హాస్యంకోసం రాలేదు; ఇనస్పెక్టరు పేరుచెప్పి రావిఁనాయుడిదగ్గిర పాతికరూపాయిలు పుల్లాగావట, యిలా రెండరిదగ్గిర లాగావ్ రామప్పంతుల్ని నిల్చున్నపట్లాన్ని పిలక్కట్టుకు యీడ్చుకురా అని నాతో ఖచితంగా చెప్పి యినస్పెక్టరు పాలెం వెళ్ళిపోయినాడు.

రామ—చిన్నప్పుడు వొక్కబళ్ళో చదువుకున్నాం యినస్పెక్టరూ నేనూను. అంచేత అతని పిలక నేనూ, నాపిలక అతనూ లాగినా ఫర్వాలేదు. రావిఁనాయడిమాట మాత్రం శుద్ధాబద్ధం. మీరు ముందు పదండి. గుఱ్ఱం కట్టించుకుని స్టేషనుదగ్గిర కలుస్తాను.

హెడ్—నేనెలావస్తాను నీతోటి; నాకు వొల్లమాల్ని పనుంది. ఒక కనిస్టీబుని నీతో పంపిస్తాను.

రామ—(హెడ్ చెవులో) నాయింట్లోమాత్రం నకారప్రయోగం చెయ్యకు. నీపుణ్యముంటుంది.

హెడ్—అదా నీఘోష! అలాకానియ్యి. (నిష్క్రమించును.)

రామ—(తనలో) అరుగో మళ్ళీ ఏకవచనవేఁ కూస్తాడు! (పైకి) యెవఁడ్రాఅక్కడ.

నౌఖరు—(ప్రవేశించి) సిత్తం బాబు.

రామ—గుఱ్ఱం కట్టుమను.

నౌఖరు—సిత్తం బాబూ, (నిష్క్రమించును.)

రామ—చూశావూ మధురవాణీ నే న్నిలబడ్డచోట రూపాయలు గలగల్లాడ్తాయి. యీ యినస్పెక్టరుగాడికి యీతాలూకాకి వొచ్చింతరువాత అయిదారువేలు యిప్పించాను. వీధితలుపు వేసుకుని, సంగీతసాధకం జేసుకో, విద్యవంటి వస్తువు లేదు. (గుమ్మందాటి నాలుగడుగులు వెళ్ళి, తిరిగివచ్చి) అప్పుడే వీణ తీశావు? యీవూళ్ళో మానుషార్ధులున్నారు; నాస్నేహితులవఁనీ, బంధువులవఁనీ పేరుపెట్టుకొస్తారు. రానీకుమా (తలుపుపైనించివేసి) గడియవేసుకో. (నిష్క్రమించును.)

౨-వ స్థలము : రామప్పంతులు యింట్లో పడకగది.

[మధురవాణి తివాసీమీద కూర్చుని వీణ వాయించుచుండును.
వాయిద్యం ముగించి]

మధు—విద్యవంటి వస్తువు లేదు, నిజమే—ఒక్కటేతప్పు—అదేమిటి? విత్తం. డబ్బు రానివిద్య దారిద్ర్యహేతువు. యీవూళ్ళో నారదుడు వొచ్చి పాడితే నాలుగు దమ్మిడీ లివ్వరు, గనక యీవీణ యిటు పెడదాం. హెడ్డు కనిస్టేబుం సాజ్ఞచేసి వెళ్ళాడు అతడు యిచ్చేదీ వచ్చేదీ లేదుగాని, జట్టీలేవైనావొస్తే ఓవొడ్డుకాస్తాడు.

(వీధితలుపు తట్టబడును)

వొచ్చాడు కాబోలు, (తలుపుదగ్గిరకి వచ్చి) యెవరు మీరు? బంధువులా?

(తలుపవతల కరటకశాస్త్రుల్లు, కన్యవేషంతో శిష్యుడున్నూ.)

కరట—ఆపద కడ్డం బడ్డవారే బంధువులు. మేం మిమ్మల బంధువులం కాముఁగాని మీరు మాకు బంధువులు కాగలరు.

మధు—నేస్తులా?

కరట—(తనలో) యీకంఠంవిన్నట్టుందే. (పైకి) నేస్తం కట్టడానికే వొచ్చాం.

మధు—దేంతో కడతారు?

కరట—(తనలో) యీవేశ్య మధురవాణి కాదుగదా? కంఠాన్ని పోలిన కంఠంఉండకూడదా? (పైకి) నేస్తం కట్టడానికల్లా ఉన్నది సక్కటేకదా టంకం?

మధు—యేమిటో ఆటంకం?

కరట—బంగారం!

మధు—మా పంతులుగారికి మీరు నేస్తులూ బంధువులూ కూడా కాకపోతే తలుపు తియ్యొచ్చును. (తలుపు తీయును.)

కరట—(తనలో) అరే! మధురవాణే!

మధు—(ముక్కుమీద వేలుంచుకొని) చిత్రం!

కరట—యేమిటి చిత్రం?

మధు—యీవేషం!

కరట—ఉదరనిమిత్తం బహుకృతవేషం; యిది దేవుఁడిచ్చిన వేషమేను.

మధు—నాదగ్గిరేనా మర్మం? యీ పిల్లెవరో?

కరట—నాకొమార్త.

మధు—నాటకమల్లా చెడి పాగటివేషాల్లో దిగిందా? పెట్టి పుట్టారు గదా యేల యీ అవస్థ?

కరట.—నీకు యివల్లీ దేవుడిచ్చిన స్థితికేం లోపం రాలేదు. నిన్ను చూదావనివొచ్చాను.

మధు.—ఇన్నాళ్ళకైనా యీదీనురాలు మీకు జ్ఞాపకం రావడం అదెంత గాదు?

కరట.—నీలాంటి మనిషి మళ్ళీ వుందా? నిన్ను చూడ్డం బ్రహ్మానందం కాదా? నీదగ్గరకి రావడం, చేదనా యిన్నాళ్ళూ రాలేదనుకున్నావు? డిప్టీకలక్టరుగారి కుమారత్నంగారు నిన్ను చేపట్టారని తండ్రికి తెలిసినతరవాత, నేను గానీ నీయింటికి వొస్తే పీక [illegible] తసించేస్తాడేమో అనేభయంచేత కొంచం యెడబెట్టి యితడికి యెప్పుడు బదిలీ అవుతుంది నామధురవాణ్ణి యెప్పుడు చూస్తాను అని దేవుణ్ణి సదా ప్రార్థిస్తూ వుంటిని. నువ్వెక్కడెన్నాళ్ళాయి వున్నావు?

మధు.—డిప్టీకలక్టరుగారి కుమారరత్నంగారిని తండ్రి, చదువు పేరుపెట్టి చిన్నపట్నం తగిలిన రెండునెల్లకాకా ఆయన నేస్తుడు గిరీశంగారిద్వారా డబ్బు పంపించాడు. ఆతరవాత మొన్నటిదాకా గిరీశంగారు నన్ను ఉంచారుగాని, డబ్బుకి యిటూ ముటుగా ఉండేది. నాయింటికి వొచ్చినవాడల్లా తన కొడుక్కి దోస్తి అయివుంటాడని డిప్టీకలక్టరు అనుమానిస్తాడేమో అని పేరుగలవాడెవడూ నాయింటికి రావడం మానేశాడు. సంజీవరావుగారి అల్లరి కొంచం మరుపొచ్చిందాకా పైనుండావని యీవూరొచ్చాను.

కరట.—(ముక్కుమీద వేలుంచుకొని) గిరీశం నిన్నుంచుకున్నాడా? మా మేనల్లుడికి చదువుచెప్పడానికి కుదుర్చుకుని మావాళ్ళింట్లో చేరాడు. వాడికి పెందరాళ్ళే ఉద్వాసన చెప్పాలి.

మధు.—(ముక్కుమీద వేలుంచుకొని) నాదగ్గిరకు వచ్చినవాడల్లా చెడిపోయినాడేం? నాదగ్గిరకు మీరు రాకుండా అవరోధం కలిగింపని యిప్పుడే డిప్టీకలక్టరుగార్ని తిట్టేరే. ఆమనసింటె మీన్యాయం యేంబాగా ఉంది? నాదగ్గిరకు వచ్చినందుకు మీభార్యగారు ముందు మిమ్మల్ని మెడబట్టుకొని యింట్లోంచి తరవ్వాలిసింది. తనకి రొట్టా. ఒకాడికి మాకొకనా?

కరట.—క్రియలలో అంతవరకూ జరక్కపోయినా మాటల్లో ఆమర్యాదా ఆమేషా నాకు జరుగుతూనే ఉన్నది.

మధు.—(చిరునవ్వుతో) యీయిల్లాలు మాపంతులు కంటబడితే యీపిడగుట్టు బట్టబయలౌతుంది.

కరట.—యిల్లాలనేస్తున్నావేం అప్పుడేను? కన్నెపిల్ల; దీన్ని పెండ్లి చేయుడానికే, నీదగ్గిరికి తీసుకొచ్చాను.

మధు.—మాపంతులుకేనా పెళ్ళి?

కరట.—"ఏకానారీ సుందరీవాదరీవా" అన్నాడు. త్రిలోకసుందరి నువ్వు దొరికింతరువాత నీపంతులుగారికి యింకా పెళ్ళెందుకు?

మధు—ఆయితే మరెవరికి పెళ్ళిచెయ్యడం? నాకాయేమిటి? అల్లాగైతే, సైయేం! మొగవేషం వేసుకొని, పెళ్ళిపీటలమీద కూర్చుంటాను. యిలాంటి పెళ్ళాందొరకడ వెలాగ? జగత్ప్రసిద్ధులైన కరటకశాస్త్రుల్లుగారి అల్లుణ్ణి కావడం యెలాగ? దివ్యసుందరవిగ్రహాలని పొగడగానే నాబుగ్గలు పొంగుతాయనుకున్నారు కాబోలు! యీపిల్లదగ్గిర నాబోట్లు పదిమందీ మూడడుగుల పీటలు. ఆడది మెచ్చిందే అందం! మొగాడికన్న పసక. మీకేం తెలుసును. మరి నాపెళ్ళాన్ని నాకిచ్చేసి మీతోవని మీరు వెళ్ళండి. (శిష్యుడి చెయిపట్టి లాగును.)

శిష్య—చూశావురా నాన్నా యెలా పట్టుకుందో?

మధు—(ఆపుకోలేకుండా నవ్వుతూ) శాబాసు! యిదేనా పెద్దమనిషి తరహా! ఇంతగు పొడుగవ్వలేవంటూగో మొగుడు పిలిస్తే వెళ్ళకుండేను?

శిష్యుడు—కొడుతుంది కాబోలురా నాన్నా, యింటికి వెళ్ళిపోదాం, రా!

మధు—యేం నంగనాచివే? తరవాత పెళ్ళి చేసుకుంటాను. అందాకా ముద్దియ్యి. (ముద్దెట్టుకొనును.)

కరట—నేరనిపిల్లని చెడగొడుతున్నావు.

మధు—నాలాంటివాళ్ళకి నూరుమందికి నేర్పి చెడగొట్టగలడు యెవరికి శిష్యుడు? యీకన్నెపిల్ల నోరు కొంచం చుట్టవాసన కొడుతూంది!

కరట—అంచేతే కాబోలు డబ్బీలో చుట్టలు తరుచు మాయమవుతూంటాయి మధురవాణీ! దేవుణ్ణాకు నిన్ను చూపించాడు. పంతుల్లేనిసమయం కనిపెట్టి వొచ్చాను. మళ్ళీ అతడొచ్చేలోగా నామాటలు నాలుగూ విని మాకువొచ్చినచిక్కు తప్పించు.

మధు—మీకొచ్చిన చిక్కేవిటి? నేను చేయగలిగిన సహాయవేవిటి?

కరట—చిక్కన్నా చిక్కు కాదు. విను యీవూళ్ళో గిరీశం పెత్తల్లికొడుకు లుబ్ధావధాన్లని ఓకూసలాడున్నాడు; వాడికి మామేనగోడల్ని వివాహానికి మాబావ నిశ్చయించాడు. యీసంబంధంచేస్తే నాచెల్లెలు నూతులో పడతానని వొట్టేసుకుంది. యేం ఉపాయం చేస్తావో, దాని ప్రాణం కాపాడాలి.

మధు—యీపిల్లని అంతకి తక్కువసొమ్ముకి అమ్మితే లుబ్ధావుధాన్లు చంకలు గుద్దుకుని చేసుకుంటావో. అతనిదాకా యెందుకు? నేనే కొనుక్కుంటాను.

కరట—చూపితే అందుకుపోయేదానికి నీకు మిక్కిలి చెప్పాలా యేవిటి?

మధు—యిదివరకే నిర్ణయమైన సమ్మంధం యేమిష పెట్టి తప్పించడం?

కరట—నీబుద్ధి కసాధ్యం వుందా? డబ్బు కసాధ్యం వుందా?

మధు—బుద్ధికి అంతా అసాధ్యవేఁగాని, డబ్బుకి యెక్కడా అసాధ్యం లేదు. యీ పెళ్ళిలో మాపంతులుగారో పదిరాళ్ళు నొరుసుతా యనుకుంటున్నాడే?

కరట—నాసంబంధం చేసుకుంటే నేను యిరవై కాపాసాణాలు యిస్తాను.

మధు—సరే. గాని నాటకంలో యెంతహాస్యమైనా చెల్లుతుంది. నటనలోకి హాస్యం తెస్తేయేవిఁ మూడుతుందో ఆలోచించారా?

కరట—మధ్య నీకొచ్చిన ఫర్వా యేవిఁటి? నాకొచ్చిన ఫర్వా యేవిఁటి యీకత్తెర మీసం, కత్తెరగెడ్డం కడిగేసుకుని నాతోవని నేను వెడతాను. యీకోక నీదగ్గిర పారేసి మాశిష్యుడు వెళతాడు. ఆతరవాత యిదేవిఁటమ్మా యీచిత్రవఁని నువ్వూ నలుగురమ్మలక్కలతోపాటు ఆశ్చర్యపడుదువుగాని, మీపంతులుతో సిఫార్సు జేసి యీమంత్రం యెలా సాగిస్తావో గట్టిఆలోచన చెయ్యి.

మధు—మాపంతులు పక్కడివల్లా యీపని కానేరదు.

కరట—మరి యింకా యవరికాళ్ళు పట్టుకోవాలో చెప్పు?

మధు—మాపంతులతో మాట్లాడ్డం ఐనతరవాత అవుధాన్లుకూతురు మానే స్తం మీనాక్షిని తండ్రికి తెలియకుండా చూసి, ఓ రెండు కాసులు యిస్తానని చెప్పండి. ఆపైని సిద్ధాంతిని చూసి అతనికి ఆలాగే ఆశపెట్టండి. యీపనికి సిద్ధాంతే కీలకం. నేను తెరవెనకనుంచి సమయోచితంగా సాంగుచేస్తాను.

కరట—నీమాటవేరేనే చెప్పాలా? నిన్ను సంతోషపెట్టడం నాకు విధి.

మధు—ఆమాట మీరు శలవివ్వడం నాకు విచారంగా వుంది. వృత్తిచేత వేశ్యని గనక చెయ్యవలసినచోట్ల ప్రవ్యాకరణచేస్తానుగాని, మధురవాణికి దయాదాక్షిణ్యాలు సున్న అని తలచారా? మీతోడబుట్టుకి ప్రమాదం వొచ్చినప్పుడు నేను డబ్బుకి ఆశిస్తానా? యటుంచి యెటొచ్చినా కాపాడతాను. హెడ్కనిస్టీబుకు మాత్రం కొంత నిజం చెప్పుదాం అతగాడు యిప్పుడే వస్తాడు, మాట్లాడతాను. మీరు యిక్కడ కూచోండి.

కరట—స్వాధీనుడేనా? కొంప ముంచడుగద?

మధు—గులాం (నిష్క్రమించును.)

కరట—కూచుందాం రా.

శిష్యు—నాపేరేవిఁటండోయి?

కరట—కొంప ముంచుతావు కాబోలు! సుబ్బి! మధురవాణ్ణి చూడగానే మతిపోయిందా యేవిఁటి?

శిష్యు—దానినవ్వు పట్టుపడాలని నిదానిస్తున్నాను.

కరట—సుబ్బినవ్వినాటు జ్ఞాపకం వుంచుకుంటే సుబ్బి అనేపేరు జ్ఞాపకంవుంటుంది.

(రామప్పంతులు గుఱ్ఱం నూరాన్న వెగి నడిచివచ్చి)

రామ—(కరటకశాస్త్రితో మెల్లిగా) లోపలికెవరైనా వెళ్ళారా?

కరట—(గట్టిగా) యవరో యిద్దరు ముగ్గురు రొచ్చారు గాని మీయిల్లాలుగా రొచ్చి పైకి పొమ్మని గెంటేశారు.

రామ—మీరెవరు? యెందుకొచ్చారు?

కరట—మాది కృష్ణాతీరం. నాపేరు గుంటూరు శాస్త్రులంటారు. తమదగ్గిర రాచకార్య వుండి వొచ్చానండి.

వీధిలోనుంచి జవాను—"యినస్పెకటరుగారు నే వొచ్చిందాకా మఱ్ఱిచెట్టు కింద గుఱ్ఱాన్ని నిలబెట్టుంచుతావన్నారు. రూపాయలు వేగం యివ్వండి"

[మధురవాణి ప్రవేశించును]

రామ—యవరు వొచ్చారుట?

మధు—యవరొస్తారు? మీ నేస్తులట! తగిలాను.

జవాను—రూపాయలండోయి.

రామ—(మధురవాణితో) యేదీ మొన్న నీకిచ్చిన రూపాయలు? సాయంత్రంమళ్ళీ ఫిరాయిస్తాను. యీనైతాను ప్రాణం తింటున్నాడు.

మధు—మీరిచ్చిన రూపాయలు పట్టంతోలేశాను. నేను డబ్బిక్కడ దాచుకుంటే మాతల్లక్కడ కాలక్షేపం చెయ్యడమెలాగ?

రామ—వొట్టబధాలు!

మధు—(తాళములు గుత్తి మొలలోనుంచి తీసి రామప్పంతులుమీద విసిరి) చూసుకోండి.

రామ—(బుజం తడుపుకుంటూ) దురహంకారం కూడదు! విసిరికొడితే దెబ్బతగల్దనుకున్నావా యేవిఁటి?

మధు—దుష్టమాటలనగా తగిల్తే తప్పా?

జవాను—యేవయ్యోయి, పోయి, రూపాయలిచ్చావు కావని యినస్పెక్టరుగారితో చెబుదునా?

మధు—(మెడలో నాను తీసి) యిది తాకట్టువుంచి కావలసినసొమ్ము తెచ్చుకోండి.

రామ—(తనలో) ఆహా! యేమి యోగ్యమైన మనిషి! లేనిపోని అనుమానాలు పడకూడదు.

కరట—పంతులుగారూ యెన్నిరూపాయలు కావాలండి?

రామ—పాతిక.

కరట—నేదాఖలిచ్చేస్తాను (జవానుకు ఇచ్చును.)

రామ—ధనజాతకానికి డబ్బేవొస్తూవుంటుంది. యేవిఁటి మీరాకకార్యం?

కరట—ఇది నాపిల్లండి. దీనికి వివాహం చేయించి ఆసుకృతం తమరు కట్టుకోవాలి.

రామ—వివాహం చేయించడానికి నేను వైదీకిని కాను, నాకు మంత్రాలు రావే?

(చుట్ట జేబులోంచి తీసి కొనకొరికి) యేనంటావు మధురవాణీ? అగ్గిపుల్ల.

మధు—(అగ్గిపుల్ల అందిస్తూ) పంతులునుంచి శిష్యుడివేపూ, శిష్యుడినుంచి పంతులు వేపూ కోపముతో చూచును)

కరట—మంత్రమన్నప్పుడు వైదీకపవాడిదేం మంత్రమండి? ఈరోజుల్లో వైదికమ్మంత్రాల మహిమ పోయిందండి మంత్రమంటే నియ్యోగప్రభువుదే మంత్రం?

రామ—మధురం! యేమంటావు? యీపిల్ల నేస్తే పెళ్ళిచేసుకుందునా?

మధు—(రామప్పంతులువేపూ శిష్యుడివేపూ చురచురచూసి నిష్క్రమించును.)

రామ—సొగసుకత్తెలకి అలక కూడా అదో శృంగారం సుమండీ, శాస్త్రుల్లుగారూ!

కరట—వైదీకపాళ్ళం మాకా శృంగారాలు యిలా అనుభవవౌతాయండి? మాయిల్లాళ్ళు కోపంవొస్తే చీపురుకట్టుచ్చుకు యెగురుతాయండి. సరసమన్నది పుస్తకాల్లో చదవడవేఁగాని మాకు అనుభవవేద్యం కాదండి. శ్రీకృష్ణమూర్తివారు రాధికతో శెలవిస్తున్నారు, ఓరాధికా నీకోపం తీర్చుకోవాలన్నష్టాయనా "ఘటయ భుజబంధనం రచయరద ఖండనం, యేనవాభవతి సుఖజాలం" యేమంటున్నాడంటే కవీశ్వరుడు చేతుల్తోటి ఉక్కిరిబిక్కిరిఅయ్యేటట్టుగా కౌగలించుకో, మరిన్ని పెదిమలు రక్తాలొచ్చేటట్టు కొరికెయ్యి, అంటున్నాడు.

రామ—(మధురవాణి వెళ్ళినగుమ్మంకేసి చూపి) ఉప్పులేక నేపప్పుందుం. మధురవాణికి మాత్రం యీవెర్రి మొర్రికవిత్వాలు చెప్పకండి. నాలాంటివృద్ధవర్లనోట సరసం సహించదు.

కరట—ఆమె మీభార్యాకారండీ? సంసారికన్నా మర్యాదగా వుంది యీవేశ్య! మీది యేవదృష్టం.

రామ—యెంపికలో వుందండి. మీరాకకార్యం చెప్పారుకారు.

కరట—లుబ్ధావధాన్లుగారికీ తమకి చాలా స్నేహమని విన్నాను. ఆయన తమమాట అడుగుదాటరట?

రామ—ఆగాడిదకొడుక్కి ఒకరితో స్నేహం యేమిటండీ? వాడిప్రాణానికీ డబ్బుకీ లంకె; డబ్బుకి వాడికి స్నేహంగాని మరియెవరితోనూ స్నేహంలేదు. అయితేవాడికి వ్యవహారజ్ఞానం లేకపోవడంచాత, కోర్టులంటే భయంచాతా, నాసలహా లేక బతకలేడు. వాడేఅన్నమాటేవిఁటి, యీతాలూకాలో సివిలుమేజస్ట్రేట్లు యెక్కడొచ్చినా రామప్పంతులు పప్పులేని పులగం వుండదు.

కరట — ఆమాట వినే తాము నియ్యోగ ప్రభువులు, మంత్రబలంచాత చక్రం అడ్డేస్తా
రని తమర్ని వెతుక్కొచ్చాను. నా పింతల్లి గొడుగు నియ్యోగి బియ్యాల్ ప్యాసయినా
డండి. డిప్టీకలక్టరీ చేస్తున్నాడు. బంధువులకి అతనివల్ల గడ్డిపరకంత సాయం లేదు
గదా మీదమిక్కిలి కూరా నారా యవళ్ళయినా గృహస్థులు గృహస్థ మర్యాదకి
పంపించి, తల్లయినా పెళ్ళాం అయినా అది ప్రత్యక్షం జేసి రగగొట్టిందాకా అభోజ
నం కూచుంటాడు! పెట్టడానికి పుచ్చుకోవడానికి నియ్యోగ ప్రభువులు, తమకి
చెల్లింది గాని, మావాళ్ళ ఉద్యోగాలు మంటిగడ్డ ఉద్యోగాలండి, "ఇయ్యా ఇప్పిం
చంగల అయ్యలకేగాని మీసమున్యాలకేలా రొయ్యకి లేదా బారెడు" అని కవీశ్వరు
డన్నాడు.

రామ — యీ యింగిలీషు చదువులు లావైనకొద్దీ వైదీకులే అన్నమాటేవిటి అడ్డమైన
జాతులవాళ్ళ వారికి మా చాకచక్యా లబ్బుతాయండీ? ఈ లౌక్యం మాలో స్వత
హాగా పుట్టినది మీరు తెచ్చిపెట్టుకున్నది. యెరువుసరుకు యెరువుసరుకే విన్నారా?
మీవాళ్ళు లంచాలు పుచ్చుకోవడం చాతకాక, పతివ్రతలమని వేషం వేస్తారు.

కరట — అదే పతకమైంతే అది అమ్మకు బతికినాం అన్నట్టు మావాళ్ళకే చాతయితే
నాకు యీ అవస్థేవండి? మావాడు పనిచూంది పార్టీలో చెబితే పదివాళ్ళ సొమ్ము
దొరుకును. యీ చిక్కులు లేకపోవును.

రామ — యేవిఁటా చిక్కులు?

కరట — ఋణబాధ చాలా లావుగా వుందండి రేపటి పున్నంలోగా ఒక పస్తావేజు
తాలూకు రూపాయిలు చెల్లకపోతే నా వాపడిపోతుందండి. యీ పిల్లని నల్లబిల్లిలో
వెంకటదీక్షితులు గారికి పదహారు వందలకి అమ్మ నిశ్చయించుకొని తీరా వొచ్చే
సరికి యిప్పట్లో రూపాయలివ్వలేం పెళ్ళయిన నెలరోజుల్లో యిస్తావన్నారండి,
అందుచేత అది వొదులుకొని లుబ్ధావుధాన్లుగారు వివాహ ప్రయత్నంలో వున్నా
రని విని తమదర్శనానికి వొచ్చానండి. ఇదిగాని తాము సమకూరుస్తే పదివరహాల
సొమ్ము దాఖలు చేసుకుంటాను.

రామ — నేను నలభైయాభై రూపాయల వ్యవహారాల్లో జొరబడేవాణ్ణి కాను.

కరట — తాము చేసే సదుపాయాన్నిబట్టి యెంతయినా దాఖలు చేసేవాణ్ణేనండి. నా
ఋణాలు పదవారు వందలుంటాయండి. అటుపైని యేవొచ్చినా తాము దాఖలు
చేసుకోండి.

రామ — "ఐతే, గియ్తే" బేరాలు మాకవసరం లేదు. అగ్నిహోత్రావుధాన్లకి పద్దెనిమిది
వొందలిస్తున్నాడుగదా, అందుకు సగానికి తగ్గితేనే గాని అవుధాన్లు ఆసంబంధం
మాని మీసంబంధం చేసుకోడు. అందులో మీ ఋణాలు తీరేదేవిఁటి? నాకిచ్చే

దేవిఁటి? యేవైఁతేనేవిఁ? ఆవ్యవహారం యెలాగ మించిపోయింది. పదిరోజులకింద టొస్తే ఫాక్తుపరుస్తును. ఆసంబంధం భోగట్టా మొదట నేనే తెచ్చాను. నాచేతులోంచి ఆవ్యవహారం పోలిశెట్టి లాగేశాడు. కృత్యాద్యవస్థమీద మధురవాణి మేజావాణీకి వాణ్ణొప్పించేసరికి నాతాతలు దిగొచ్చారు. మరి వక ఉపాయం చెబుతాను వినండి, మీకు మయినరు కొమాళ్ళున్నారా?

కరట—చిన్నవాడికి మయినారిటీ దాటి మూడేళ్ళయిందండి.

రామ—అయితే యిహ లెంపేవిఁటి? ఆకుఱ్ఱవాడు మయినరని వాదిద్దాం.

కరట—సాక్ష్యం యెలా వొస్తుందండి?

రామ—ఓహొహొహో! మీకేమీ తెలియదే! యిలాంటి వ్యవహారాలు నాతల మీద యెన్ని వెంట్రుకలున్నాయో అన్ని మోసేశాం, విన్నారా? ఊళ్లాం బసవరాజు గారిసంభావన్లకే పేట సాక్ష్యాలక్కూడా గెజటార్డర్ చేశాం. పుండనాలు వేసుకున్నవారికి ఓరూపాయి జాస్తా.

కరట—జాతకం వుందిగదా యేంసాధనం?

రామ—కాకితవైఁతే అగ్గిపుల్లతో ఫైనల్! తాటాకైతే నీళ్ళపొయ్యి! కొత్తజాతకం బనాయించడం అయిదునిమిషాలపని. మాసిద్ధాంతిపట్టుకు నాలుక్కాలాలు చల్లగా వుండాలి. నాదగ్గిర పాతతాటాకులు అలేఖాలు అటకనిండా వున్నాయి. ముప్పై యేళ్ళనాటి కాకితా లున్నాయి. ఒక నూఱ్ఱూపాయలు నాకు ఫీజుకింద యిచ్చి ఖర్చులు పెట్టుకోండి. గ్రంథం నడిపిస్తాను.

కరట—దారి ఖర్చుకోసం తెచ్చినరూపాయలు మీకు దాఖలు చేశాను. మరి బుఱ్ఱ గొరిగించుకుందావంటే డబ్బిమ్మడీ లేదు. కోర్టంట తిరగడాని కయినా చేతిలో ఓడబ్బు సొమ్ముండాలిగదా? యిదోహర్తె టోంపలా నాతో వుంటే యెలాగండి కోర్టంట తిరగడం? తమ లౌక్యానికి అసాధ్య వన్నది వుంటుందంటే నే నమ్మజాలను, యెలాగయినా కుదిర్నసంబంధం తప్పించి మాసంబంధం కుదిర్చి నాకు యిచ్చేసొమ్ములో పదోవంతు తాము అంగీకరించి మిగిలింది నాకు దయచెయ్యండి. దీన్ని మొగుడింట అప్పజెప్పి ఆపైన యీగ్రంథం యేదోకొస చూసిందాకా తమర్ని అంటగాగి వుంటాను.

రామ—పదోవంతు పనికిరాదు. మా బేరం యెప్పుడూ సగానికి సగం.

కరట—సంగోరు మీకిస్తే మరి నేను ఋణాలేం దీర్చుకోను?

రామ—ఋణాత్తీర్చుకోఅక్కర్లేకుండా గ్రంథం జరిగిస్తాంగదూ? అప్పుడే మీచేతులో రూపాయలు పడడానికి సిద్ధంగా వున్నట్లు మాట్లాడుతారేవిఁటి? నేను ఎంతశ్రమ పడ్డ పైని పతకం తిరగాలి? అది ఆలోచించారా?

కరట—తాము అలాఅంటే నేనేం మనవిచెయ్యనండి? రక్తమాంసం అమ్ముకుంటూన్నప్పుడు ఆకాని కూడయినా సంతుష్టిగా దొరకటం న్యాయం గదండి? వ్యవహారాల తొట్రుబాటుచేతనూ సిలకట్టు ఒప్పి వుండడంచాతనూ, తొందరపడుతున్నాను గానండి, కొంచం వ్యవధివుంటే రెండువేలకి పైగా అమ్ముకుందునండి.

రామ—"అయితేనియితేను" అనుకున్న లాభంలేదని చెప్పానుకానా? ఐదోవొంతుకు యేవఁంటారు?

కరట—ఈపాపపుసొమ్ముకే తమరు ఆశించాలా అండీ?

రామ—పాపపుసొమ్ము మాదగ్గిరకి రాగానే పవిత్రమైపోతుంది. ఒకార్లికివ్వడంకోసమే గాని నాక్కావాలా యేమిటి?

కరట—ఐతే కానియ్యండి.

రామ—ఇక నాప్రయోజకత్వం చూడండి. మధురం! మధురం! కాకితం, కలం, సిరాబుడ్డి తీసుకురా, మామోలు సిరాబుడ్డికాక గూట్లోది పెద్ద సిరాబుడ్డి తే.

మధు—(అవతలనుంచి) నాకంటె మధురం కంటబడ్డకరవాత నేనెందుకు.

రామ—ఆడవాళ్ళకి అనుమానం లావండి. వింటున్నారా? అదో ముచ్చట!

కరట—కేవలం వజ్రాన్ని సంపాదించారు!

రామ—వజ్రవేఁగానండి, పట్టణవాసప్పు అలవాటుచాత పదిమందితో మాట్లాడితే గాని, దానికి వూసుబోదు.

కరట—ఆమాత్రం స్వేచ్ఛ యివ్వడవేఁ మంచిదండి; ఆడదాన్ని కట్టే రోకాయించ కూడదండి?

రామ—రోకాయిస్తే యేంజేస్తుం దేవిఁటండి?

కరట—యిలాంటిమానంగలమనిషైతే నూతులో గోతులో పడుతుందండి.

రామ—అలాగనా అండి?

కరట—అందుకు సందేహమేమిటండి? నాజూకైన మనస్సుగలస్త్రీని మల్లెపూవులాగ వాడుకోవాలండి.

రామ—ఆ నాజూకులూ గీజూకులూ మీకేం తెలుసునండి.

కరట—పుస్తకాల్లో చదువుకున్న ముక్కలు. నాయకుడు నిరాకరిస్తే నాయిక వొచ్చినన్నియేవే. ఉద్యానాల్లో ఉండుకున్నటువంటి లతలతో వురికి పోసుకుంచుందండి. మహాకవులనాటకాల్లో అల్లాగే జరిగినట్లు రాశారండి.

రామ—మరెవళ్ళతో మాట్లాడిన తప్పులేదుగాని, హెడ్ కనిస్టీబుతోమాత్రం మాట్లాడ వద్దని బుద్ధిచెప్పండి, మీరు తండ్రిలాంటివారుగదా?

కరట—అంత అదృష్టవాఁ అండి! అల్లాంటి పిల్లే నాకు ఉంటే, మూడు నాలుగువేల కమ్ముకుని రుణాలూ పణాలూ లేకుండా కాలక్షేపం చేసివుందును. దీన్నయినా

నాలుగు సెక్షన్లలో అక్కజూపితే రెండు మూడు కేసులు యిదివరకే చేతులో పడి ఉండునండి, మేనరికం చెయ్యాలని తల్లి భీష్మించుక్కూచోబట్టి యీ దురవస్థ మాకొచ్చింది. అందుచాతనే యింట్లో చెప్పకుండా యీపిల్లను వెంటతీసికొచ్చి యీ దేశంలో పెళ్ళికి చూస్తున్నాను.

రామ — నా సహాయం లోపం ఉండబోదు.

కరట — అయితే కార్యమయినట్టే!

రామ — యేదీ పిల్లా యిలా రా. చెయి చూపించూ.

(శిష్యుడు సిగ్గు నటించి వెనక్కి తగ్గును.)

కరట — చూపించవమ్మా. భయం లేదమ్మా. (కరటక శాస్త్రులు శిష్యుణ్ణి రామప్పంతులు దగ్గిరకి తోయును. రామప్పంతులు చెయ్యిపట్టుకుని అరిచెయ్యి చూచుచుండును. శిష్యుడు చెయ్యి లాగుకొంటున్నట్లు నటించును. మధురవాణి సిరాబుడ్డీ, కలం, కాకితం పట్టుకుని రామప్పంతులు వెనక నిలుచుండును.)

రామ — ఆహా! యేం ధనరేఖ! సంతానయోగ్యత బాగా ఉంది.

మధు — మీరు చేపట్టింతరవాత, అందుకు లోపం వుంటుందా?

(సిరాబుడ్డిలోని సిరా రామప్పంతులు ముఖంమీదపోసి ఛఱ్ఱున వెళ్ళిపోవును.)

## 3-వ స్థలము: కృష్ణరాయపురం అగ్రహారంలో అగ్నిహోత్రావధాన్లుగారి ఇల్లు.

వీధి — గుమ్మం యెదట గిరీశం నిలిచి సన్నని గొంతుకతో పాడును.

“కాముని పికశరములబారికి నే,
నేమని సహింతునే, చెలి, యేమని సహింతునే?”

వీడితస్సాగొయ్యా, వీడిబాణాలు పువ్వులటోయి? ఆమాట యెవడు నమ్ముతాడు వెఱ్ఱికుట్టె రెండుపడైనా నమ్మాలిగాని? అనుభవవేద్యమైన దీని నిజంయేవిటంటే:— మంచిపదునుబట్టిన లోహం మొనకి, డయమండ్ పాయింట్ వేసి, పాయిజన్ లో ముంచి కంటికి కనబడకుండా మంత్రించి విసురుతాడు. దీంచాతనే పైకి గాయం కనపడదుగాని పోలీసువాళ్ళ దెబ్బల్లాగ లోపల తహతహ పుట్టిస్తాయి. యీవిడో బ్యూటీ చూస్తే యేమీ తోచకుండా ఉన్నది. అయితే యిది చెప్పినట్టల్లా వశ్య మయ్యే మనిషి కాదు. పాతఅస్త్రాలేం పనికిరాకుండా ఉన్నాయి. నా యెక్స్పీరియన్సూ, నా శృంగార చేష్టలూ గుడ్డిగవ్వంత పని చెయ్యకుండా వున్నాయి. యింత సింప్లిసిటీ యెక్కడా కానలేను. దీనికి లవ్ సిగ్నల్సు రావు రామా! యేమీ తెలియవు. యింగ్లీషు మాటలు ఆడితే యేమున్నీ అర్థం చేసుకోలేక ఆ లేడికళ్ళతో

తెల్లబోయి చూస్తుంది. ఆయామ్ డెస్పరేట్లీ యిన్ లవ్ విత్ హర్. దీన్ని చూసిన దగ్గిర్నుంచీ లౌవ్ లవ్సూ, డార్లింగ్లుసూ, మీద పరమాసహ్యం పుట్టింది. పోజిటివ్ యబహారెన్స్. వాళ్ళ పెంకెతనాలూ, పెద్దరాల దొంగవేషాలూ, డామిట్! అంతా యిన్సిన్సిరిటీయేగదా? ఇన్నాళ్ళు మధురవాణిల్లో పడి యెలాగు యాస్ని అయిపోయినానో, నాకు నాకట్టుకే ఆశ్చర్యంగా వుంది! మధురవాణికి యీమనిషికిని కంపారిజన్ ఉన్నదా? అది రంగువేసిన గాజుపూస ఇది ప్యూర్ డైమండ్? కాదని యవడైన అభాజనుడు అంటే అమాంతంగా వాడి పీక కూపదీస్తాను. దీనిని చెడగొట్టడానికి ప్రయత్నం చెయ్యకూడదు; చేసినా సాగేదికాదుగనక కొత్తదారీ కొంత న్యాయమైన దారితొక్కాలి. యేమిటయ్యా అది? మహోపాయం చేసి దీన్ని లేవతీసుకుపోయి విడోమారియేజి చేసుకుంటినట్టాయనా కీర్తి సుఖం కూడా దక్కుతాయి. "టూ బర్డ్స్ ఎట్ వన్ షాట్! ఇలాంటి ఆటర్లీ యిన్నోసెంట్ విడోని వొప్పించి తీసుకుపోయి పెళ్ళాడితే మజా, ప్రయోజకత్వము గాని, రెండేసీ మూడేసీ సంతానాలు కలిగి తురకాడితోనో, దూదేకులవాడితోనూ లేచిపోవడానికి సిద్ధంగా ఉన్న దండుముండల్ని విడో మారియేజి చేసుకుంటే హెల్! పూటకూళ్ళమ్మలాంటిముండని పెళ్ళాడ్డం విడో మారియేజి అనిపించుకోదు అది దొంగముండా మారియేజి! ఇదేమిటయ్యా యిది, యీబుచ్చమ్మ సాక్షాత్తూ పరమ పవిత్రమైన విత్ గిల్టు లెటర్స్! అయితే, గియితే, మ. రా. శ్రీ యస్. గిరీశం గారు విడో మారియేజి చేసుకోవడమేనా? "టు మారీ యె విడో, ఆర్ నాట్ టు మారీ, దటీజ్ ది క్వశ్చన్!" షేక్స్పియర్ పడ్డఅవస్థలో పడ్డాం! తొందరపడి తొందరపడి హాజీసాహేబు తురకల్లోకలిసిపోయినాడన్నట్లు" నావంటి బుద్ధిమంతుడు యేపనీ చెయ్యకూడదు. దానిలాభనష్టాలు బేరీజువేసి, జమాఖర్చు చేసుకుని మరీ డిసైడ్ చెయ్యాలి. లెటస్. సీ. Imprimis ఒకటో పద్దు డెబిట్ (నష్టం). విడో మారియేజి చేసుకుంటే మావాళ్ళు అక్కర చెయ్యరు. అందుకు క్రెడిట్ (లాభం). వాళ్ళిప్పుడు చేస్తూన్న అక్కరేవుంది? గనక బాలెన్స్ (గాక బాకీ) నిల్ బండి సున్నా! రెండోపద్దు_డెబిట్ (ఖర్చు)_లోకం నన్ను బహిష్కారం చేస్తారు. అందుకు క్రెడిట్ (జమ) లోకంలోకల్లా విలువైన వస్తువను నేను అంకించుకుని పనలేనిఆలోకానికే నేను బహిష్కారం వేస్తాను. గనక క్రెడిటు బాలెన్సు (నిలవ) యేమిటయ్యా? నెగెటివ్ యడ్వాంటేజి, హావింగ్ నథింగ్ టు దూ విత్ పాపర్ వర్ల్డు_పోజిటివ్ యడ్వాంటేజి_పొజెసింగ్ ఆలిట్స్ వెల్త్. మూడో పద్దు_డెబిట్_నష్టం_వీడి వెధవముండ" అంటారు_ నోటావీనీ_ యీపద్దు నిజంగా

డెబిటేనా? అక్కౌంట్ డిపార్టుమెంటువాణ్ణడిగి సంశయం తీర్చుకోవాలి. అందాకా మ. రా. శ్రీ గిరీశంగారి అభిప్రాయం యేమంటే — విడో అనేది ఏమిటి? ఏ నేమ్! ఓ పేరు? ఆ పేరు మనిషి మొహాన్ని వ్రాసుంటుందా? మనిషిని నుస్తాబుచేసి యెదట నిలబెడితే యిది పునిస్త్రీ, యిది విడో అని చెప్పదగిన పెద్దమనిషి యెవడు? ఒహడూ లేడు. గనక విడో అనే వస్తువ యెక్కడుందయా? వెక్కిరించే వెధవల నోళ్ళలో ఉంది. ఇంక క్రెడిట్, (లాభం) — ఏమనగా — విడో పెళ్ళాడిందంటే అశుభం నో గాయిత్రీం అని ఒకె వెకసాం కన్నెచ్చ్యాడు. ఇక డెబిట్లేని శుద్ధ క్రెడిట్ సంబంధ మైతా, "చుక్కలవలె, కర్పూరపుతునకలవలె నీదు కీర్తి ముల్లోకములన్ క్రిక్కిరిసి పిక్కటిల్లెను", అన్నట్టు గిరీశంగారి కీర్తి మిన్నుముట్టుతుంది. గిరీశంగారి విధవావివాహమహోత్సవం కథ న్యూసుపేపర్లో పెద్దక్షరాల్తో పడుతుంది. క్రెడిట్ నెంబర్ ఫైవ్, విడో మారియేజి యసోసియేషన్ వారు ఒక తృణం యిస్తారు, బుచ్చమ్మక్కూడా కొంచం డబ్బుంది. డెబిట్ — దావా తెస్తేగాని అప్పంధాన్ని మావఁగారు దాన్లో దమ్మిడీ యివ్వడు.

ప్రొజెండ్ కాన్సన్నీ విచారించగా అవశ్యం విడో మారియేజి చేసుకుని తీరవలసిందే. అయితే సాధనవేఁవిఁటి? ఏదైనా యాసెస్ బ్రిడ్జికట్టి వొడ్డు చేరాలి (పైకి ముఖం యెత్తి ఆలోచించి) వెంకమ్మ, మొగుడితో దెబ్బలాడి నూతులో పడ్డప్పుడు నేను సాహసించి వురికి పైకి తీసిందగ్గర్నుంచీ వూరంతా నేను సాక్షాత్తూ సత్యహరిశ్చంద్రుణ్ణిగా భావిస్తున్నారు. అడుగడుక్కీ బుద్ధిదాల్లేస్తూంటుంది గాని, నేనంతవాణ్ణికానా ఏవిఁటి? స్నేహంపట్ల పీకిచ్చేస్తారే గిరీశంగారు సాధారణులా? గనక బుచ్చమ్మని మనం లావుచనుంచేసినా నుతిమించేవరకూ యెవరూ తప్పుబట్టబోరు. రాత్రిళ్ళు అరబ్బీనైట్లు, కాశీమజిలీలు, మదనకామరాజు కథలూ చెబుతూ వుంటే యింతో సర్దాగా పక్కని కూచుని వింటుంది. లవ్ స్టోరీసు బుఱ్ఱకెక్కించాను. కొంత గ్రౌండు ప్రిపేరైంది గనక, యిహ విడో మారియేజి మంచిదని బోధపఱుద్దాం. సాటిక పారినట్టయినా, రామపరం చలో, విడో మారియేజి కరో! లెట్ మీ బిగిన్ ది కాంపైన్ ఎట్ వన్స్. (తలుపు కన్నములోనుంచి తొంగి చూచి) నడవలో కూర్చుని విస్తళ్ళు కుడుతున్నది. గొంతు సవరించి కొంచం మ్యూజిక్ వినిపిస్తాను. (ఎటులోర్తునే చెలియా అను జావళీ కూను రాగముతో పాడి) బుచ్చమ్మ వదినగారూ తలుపు తీయాండి (బుచ్చమ్మ తలుపు తీయును) వదినా... వోల్!... నెంకటేశం యేమి చేస్తున్నాడు?

బుచ్చమ్మ— పెరట్లో గొడ్లకి . మలందుతున్నాడూ.

గిరీశ — ఈవూరుకుంటే మరి చదువు చెడిపోతుంది. పట్నంలో ఉన్నప్పుడు దస్కా దగ్గిరనుంచి కదిలితే వొప్పేవాడను కాను... ఒక్కమాటు పి... పిలుస్తారా పాఠం చెపుతాను.

(బుచ్చమ్మ తమ్ముని తీసుకొని వచ్చుటకు వెళ్ళును)

ఆహా! దీని కస్సాగొయ్యా, మొహంయెదటికి వచ్చేటప్పటికి కొంచం ట్రెంబ్లింగ్ పట్టుకుంటుంది వకటి అనవలెనని మరివకటి అనేస్తూయుంటాను. మరెవళ్ళూ లేరు. వంటరిగా దొరికిందిగదా — యిలాంటప్పుడు నామనస్సులో మాట చెప్పిస్తే తీరిపోవును! ఆకోతివెధవని తీసుకురమ్మని చెప్పాను, కాని పాఠాలలో చిన్న లెక్చరు వేతాము. (వెంకటేశ్వర్లు, బుచ్చమ్మ ప్రవేశింతురు.) యేమివాయి మై డియర్ బ్రదరిన్లా వెంకటేశం పాఠాలు చదవడం పూర్తిగా మానివేశావు? ఇక్కడ? ఇక్కడేమరి మాసంగోజులు ఉంటే వచ్చిందికూడా మరచిపోతావు. ఏది టెక్స్టు బుక్కు పట్టుకురా. (వెంకటేశము పుస్తకము పట్టుకొనివచ్చును). గాడ్స్‌వర్క్సు అనే పాఠం తియ్యి. రీడ్ మై గుడ్ బోయ్.

వెంక — (తడుముకుంటూ) దేర్ యిజ్ నాట్ ఏన్ ఆబ్జక్టు ఇన్ క్రియేషన్ వుచ్ డజ్ నాట్ సెర్వ్ సమ్ యూస్‌ఫుల్ పర్‌పజ్.

గిరీశ — అట్టె! అట్టె అక్కడ నిలుపు, క్రియేషన్ అనగా యేమిటి?

వెంక — క్రియేషన్ అనగా - అనగా - ఆవులు,

గిరీశ — నాన్సెన్స్, చదువేస్తే ఉన్నమతికూడ పోవుతున్నది. ఆవులు యెదట ఉన్నాయనా ఆవులంటున్నావు? మళ్ళీ ఆలోచించి చెప్పు.

వెంక — మాటకి అర్థం అడిగారండి?

గిరీశ — క్రియేషన్.

వెంక — అదా! క్రియేషన్ అంటే ప్రపంచం. నేను, యెదట ఆవులు కనబడితే ఈ యీ ఆవు పెరుగు నెలరోజులే కదా తినడమని ఆలోచిస్తున్నాను.

గిరీశ — వన్ థింగ్ ఎట్ ఏ టైమ్ యిప్పుడు పాఠంమాట ఆలోచించు. క్రియేషన్ అనే వక్కమాటపైనే వక్కఘంట లెక్చరు యివ్వవచ్చును. ప్రపంచం యేలాగున్నది? కపిద్ధాకారగ భూగోళా అని మనుధర్మ శాస్త్రంలో చెప్పినాడు. కపిద్ధమంటే యేమిటి?

వెంక — నారింజపండు.

గిరీశ — వెరిగుడ్. అందుకు అమరనిఘంటులో పద్యం నీకు వచ్చునా?

వెంక — రాదు చెప్పండి రాసుకుంటాను.

గిరీశ — యింతలు బదరీ ఫలములు యింతలు మారేడుపళ్ళు యీడుకు జోడై బంతులు తామరమొగ్గలు దంతీపుచ కుంభములబోలు తరుణీ కుచముల్.

యీ ప్రపంచములో ఏమి వస్తువులుంటవి ?

వెంక — ఆవులు.

గిరీశ — డామ్ నాన్సెన్స్, యెంత సేపూ ఆవులేనా ? ఏవిఁటి వుంటవో బాగా ఆలోచించి చెప్పు.

వెంక — గేదెలు.

గిరీశ — డట్ విల్ నాట్ డు, మళ్ళీ ఆలోచించి చెప్పు.

వెంక — అయితే నాకు తెలియదు.

గిరీశ — విడోస్-ఇంత చిన్న ప్రశ్నకు నీకు జవాబు తెలియదు ! ప్రపంచమందుండే వస్తువులన్నిటిలోకీ ముఖ్యమైనవి విధవలు. దానివిషయమై పెద్ద లెక్చరు యివ్వవచ్చును. మనదేశములో ఒక దురాచారము ఉన్నది. మొగవాడికి పెళ్ళాము చచ్చిపోతే తిరిగీ పెళ్ళాడుతాడు. ఆడదానికి మొగుడు చచ్చిపోతే ఎంత యవ్వనములో నున్నా, ఎంత సొగసుగా నున్నా, మరివకడిని పెళ్ళాడవల్లలేదు. ఇది అన్యాయ మంటావా, కాదంటావా ?

వెంక — తప్పకుండా అన్యాయమే.

బుచ్చమ్మ — యేవండీ గిరీశంగారూ, వెధవలు పెళ్ళాడడం పాపం కాదూ ?

గిరీశ — ఆహా ! మీసత్యకాలం చూస్తే నాకు విచారంగా వున్నది. వెధవలు పెండ్లాడ వలసినదని పరాశరస్మృతిలో స్పష్టంగా నున్నది. వేదంలో కూడా నున్నది. రాజమహేంద్రవరములో యింతంతా పండితులు సిద్ధాంతం చేసినారు. పూర్వకాలంలో వెధవలు పెండ్లాడేవారు. వెంకటేశం ! నలచరిత్రలో దమయంతి రెండో పెండ్లి చాటించిన పద్యం చదువు.

వెంక — నాకు రాదు.

గిరీశ — ఇంత ముఖ్యమయినపద్యం మరచిపోవడం యంత తప్పూ ! నోటుబుక్కు తీసి రాసుకో — "దమయంతి రెండోపెళ్ళికి ధరనుండే రాజులెల్ల దడదడ వచ్చిరీ" — చూశావా ! లోకంలో ఉండే రాజులంతా వెధవని పెళ్ళాడడానికి వచ్చారట. (బుచ్చమ్మవైపు జూచి) చూశారా ? శాస్త్రాలన్నీ వొప్పుకోవడమే కాకుండా మీదిమిక్కిలి వెధవలు పెళ్ళాడకుండా వుండిపోతే దోషమని కూడా చెప్పుతూ ఉన్నాయి. ఇందువిషయమై శంకరాచార్యులవారు పత్రిక కూడా యిచ్చి యున్నారు.

బుచ్చమ్మ — అయితే మనవాళ్ళంతా వెధవల్ని పెళ్ళి చేసుకోకూడదంటారే ?

గిరీశ — అదంతా యింట్లో చాకిరీ చేయించుకోవడము కోసరముగాని మరేమీ కాదు. ఝామురాత్రి ఉందనగా లేచి మరునాడు రెండుఝాములదాకా యెద్దులాగు పని చేయిస్తారుకదా ? ఒకపూటకంటె యెక్కువ భోజనం చెయ్యనియ్యరుగదా ?

అప్సరసలాగు కొంత సొగసుగానున్నా మంచిగుడ్డ కట్టుకోనివ్వారు. సరుకు పెట్టుకోనివ్వరు, తుమ్మెమ్మసవంకల్లా ఉండే జుత్తుకూడా తినివేస్తారుగదా! ఫర్ ఎగ్జాంపిల్, మీఅక్కయ్యకు ఆచంద్రబింబమువంటి ముఖముపైని ఒక కుంకుమబొట్టుంటే త్రినేత్రుడికైనా చూడడానికి అలవి వుండునా? ఆహా! యీ అవస్థ చూస్తే నా హృదయం కరిగిపోతున్నది ఆల్‌రైట్! ప్రపంచములో యింకా యేమి వస్తువులున్నవి?

వెంక — చేగోడీలు.

గిరీశ — డామ్ నాన్సెన్స్-ఎంతసేపూ తిండివిషయమయ్యే ఆలోచిస్తావు. బాచిలర్స్, బ్రహ్మచారులు కూడా వున్నారు. వాళ్లు చెయ్యవలసినపని యేమిటి?

వెంక — వేదం చదువుకోవడం; పెయ్యలకి గడ్డి తేవడం.

గిరీశ — నాన్సెన్స్-అది మాతండ్రివద్గిర చదువుకునేవిద్యార్థులమాట. బ్రహ్మచారియొక్క రియల్ డ్యూటీ అంటే, విధింపబడినపని యేమనగా, విధవలను పెండ్లాడడమే ఇంకా క్రియేషనులో యేమున్నది?

వెంక — నాకు తెలియదు.

గిరీశ — రామవరములో వైధవవివాహము చేసుకున్నవాళ్ళకల్లా నెలనక్కింటికి నూరు రూపాయలు యిచ్చి పోషించడమునకు విడో మారేజి సభ వకటి యున్నది. ఇది వరకు అయిదువేలమంది విధవలకు వివాహములుఅయి పునిస్త్రీలు అయిపోయినారు. రల్‌రైట్ క్రియేషన్ అనే మాట అయినది. ఆసెంటెన్సు అంతకూ అర్థము చెప్పు.

వెంక — మీరొకమాటు చెప్పినతరవాత నేచెబుతాను.

గిరీశ — ఆల్‌రైట్! ప్రపంచములో దేవుడు ప్రతివస్తువునూయేదోవొక ఉపయోగముకొరకు చేసియున్నాడు. చేగోడీ యెందుకు చేసినాడు?

వెంక — తినడముకు.

గిరీ — దట్ ఈజ్ రైట్, ఆవుల నెందుకు చేశాడు?

వెంక — పాలు యివ్వడముకు.

గిరీశ — పెర్‌ఫెక్ట్‌లీ రైట్, ఆడవాళ్ళ నెందుకు చేశాడు?

వెంక — వంటచెయ్యడానికి.

గిరీ — నాన్సెన్స్. పెండ్లాడడముకూ. పిల్లలకనడముకున్నూ, గనక పెండ్లాడకుండ ఉన్న విధవపిల్లలు దేవునిఆజ్ఞను అతిక్రమించిన పాపములు చేస్తున్నారు.

[అగ్నిహోత్రావధానులు ప్రవేశించును.]

అగ్నిహో — ఏమండీ గిరీశంగారు మాకుర్రవాడికి చదువు చెప్పుతున్నారా?

గిరీశ — ఘంటసేపాయి చెపుతున్నానండి.

అగ్ని — యేదీ నేనూడా వింథాను కొద్దిగా చెప్పండీ.

గిరీశ — మైడియర్ బోయ్. గాడ్ క్రియేషన్. సృష్టి యెవరు చేసినారూ ?

వెంక — దేవుడు.

గిరీశ — ఫాదర్ ఈజ్ నెక్స్ట్ టు గాడ్. దేవుని తరువాత ముఖ్యం యెవరూ ? నే ఫాంచర్

వెంక — తండ్రి.

అగ్నిహో — మొత్తముమీద మీయింగ్లీషు చదువు మంచిదిలాగే కనబడుచూన్నది. భాష భేసంగాని మనముక్కలే వాళ్ళవిన్నీ.

గిరీశ — వెంకటేశం! దేవుడు సృజించిన ప్రపంచములో యేమి వస్తువు లున్నవి ? నే కోర్ట్స్.

వెంక — వెధవలు

గిరీశ — నాన్సెన్స్, నే కోర్ట్స్.

అగ్నిహో — యిది యేమిటండోయి ప్రపంచంలో వెధవ లున్నారంటున్నాడు. ఇంగ్లీషు పుస్తకాల్లో యిదేనా యేమిషి ఉన్నది ?

గిరీశ — వెధ్వల్ అన్నది లాటెన్ మాటండి_ఆమాట కర్థం కచేరీలండి కచేరీలు యెందు కున్నవి ?

వెంక — దావాలు తేవడముకు.

గిరీశ — దట్ ఈజ్ రైట్ - చూచారండీ మీవాడికి కచేరీలభోగట్టాలుకూడా నేర్పుతున్నాను.

అగ్నిహో — అయితే మన దావావిషయమై నేనిచ్చిన కాకితాలు సమగ్రం చూశారా ?

గిరీశ — కేసు గెలవడముకు యేమీ అభ్యంతరములేదు. మీకు తెలియడంకోసం గ్రంథం అంతా తెలుగుచేస్తున్నాను. మామగారూ మీవిషయమై యెంత శ్రమ అయినా పడి అమలాపురం వెళ్ళి అక్కడ కోర్టులో కేసు గెలిపించకపోతే నన్ను పేరు పెట్టి పిలువవద్దు.

అగ్నిహో — ఏదో అంతా మిమ్మల్నే నమ్ముకుని ఉన్నాము. ఎంత డబ్బయినా కేసు గెలిస్తే చాలును. పెళ్ళిపనులకి మీ సమ్మక్కవుంటేనేకాని తూగదు సుమండీ. నామీద కోపంచాత కరటకశాస్త్రుల్లూ వాళ్ళూ వెళ్ళిపోయినారు. వాళ్ళు వొచ్చే టట్టు కనబడదు.

గిరీశ — మీరు కూర్చున్నదగ్గిరనుంచి కాలు కదపకుండా ఎరేంజిమెంటు యావత్తూ నేను చేస్తాను కాదూ.

(నిష్క్రమించుచున్నాను.)

౪-వ స్థలము: పెరటిలో జామిచెట్టు కొమ్మమీద
వెంకటేశము కూచుని జామిపండు కొరుకుచుండును.

[చెట్టుకొమ్మలు ఆవరించియున్న నూతిలో బుచ్చమ్మ
నీరు తోడుచుండును.]

బుచ్చమ్మ—తమ్ముడూ. గిరీశంగారు గొప్పవార్రా?

వెంక—గొప్పవారంటే అలా యిలాగా అనుకున్నావా యేమిటి? సురేంద్రనాథ్ బానర్జీ అంత గొప్పవారు.

బుచ్చమ్మ—అతగాడెవరు?

వెంక—అందరికంటే మరీ గొప్పవాడు.

బుచ్చమ్మ—అయితే గిరీశంగారికి ఉద్యోగం కాలేదేమి?

వెంక—నాన్సెన్స్! నువ్వు ఆడదానివి; నీకేం తెలియదు. ఉద్యోగవంటే గొప్పను కుంటున్నావు ఉద్యోగవంటే యేమిటో తెలిసిందా? సర్వెంట్ అన్నమాట.

బుచ్చమ్మ—అనగా యేమిటి?

వెంక—సర్వెంటనగా నా! నౌఖర్ అన్నమాట. మన గేదెని కాసే అశిరిగాడు ఒక సర్వెంట్. మన యిల్లు తుడిచే అంకి ఒక సర్వెంట్, వీళ్ళు మననౌఖర్లు. పోలీసూ, మునసబూ, తెల్లవాడి నౌఖర్లు. జీతంలావు రాగానే గొప్పనుకున్నావాయేమిటి? సురేంద్రనాథ్ బానర్జీ, గిరీశంగారులాంటి గొప్పవాళ్ళు తెల్లవాడిదగ్గర కాదు, దేవుఁడిదగ్గరైనా నౌఖరీ చెయ్యమంటె చెయ్యరు. కలక్టరేవంటాడో తెలిసిందా? పోలీసువెళితే "స్టాండ్!" నిలుచో అంటాడు. గిరీశంగారు వొచ్చారంటె షేక్ హాండ్ చేసి కుర్చీమీద కూచోండి అంటాడు. ఆయనకి హైదరాబాదు నవాబు వెయ్యిరూపాయల పనియిస్తామంటె నీపనెవడిక్కావాలి పొమ్మన్నాడు.

బుచ్చమ్మ—ఆయనకి పెళ్ళయిందిరా?

వెంక—లేదు.

బుచ్చమ్మ—అమ్మయ్యో, వెధవలు పెళ్ళాడ్డం మంచిదంటారుగదా, ఆయనెందుకు పెళ్ళాడారు కార్రా.

వెంక—నీకు యెంత చెప్పినా తెలియదు (గట్టిగా) ఆయన ఉద్యోగం చెయ్యకపోవడం, పెళ్లిమానుకోవడం లోకం మరామత్తుచెయ్యడానికట; యిప్పుడు తెలిసిందా?

బుచ్చమ్మ—యలా మరమ్మత్తు చేస్తున్నార్రా?

వెంక — నావంటి కుర్రాళ్ళకి చదువుచెప్పడం. (నిమ్మళంగా) చుట్ట నేర్పడం (గట్టిగా) నాచ్చికొర్చన్ అనగా సానివాళ్ళ నందర్నీ దేశంలోంచి వెళ్ళగొట్టడం ఒకటి. నేషనల్ కాంగ్రెస్ — అనగా దివాన్గిరీ చలాయించడం ఒకటి. ఇప్పుడు తెలిసిందా?

బుచ్చమ్మ — ఉద్యోగం చెయ్యకన్నావేం? దివాన్గిరీ యేరాజుగారి దగ్గిర్రా?

వెంక — ఏ రాజు దగ్గిరా? — ఆడదానివి నీకెందుకూ యీ భోగట్టా అంతాను?

బుచ్చమ్మ — నువ్వు కూడా లోకమరమ్మత్తు చేస్తావుట్రా?

వెంక — ఓ!

బుచ్చమ్మ — ఐతే విధవముండని పెళ్ళాడతావురా?

వెంక — నాన్న తన్నకుండా ఉంటే తప్పకుండా పెళ్ళాడతాను; గాని బోడిగుండు చేస్తేమాత్రం నాక్కర్లేదు.

[గిరీశం ప్రవేశించి]

గిరీశం — వదినా యీ చెట్టుక్రింద నిలబడితే మీరు వనలక్ష్మిలా ఉన్నారు. (బుచ్చమ్మ వైపు తేరి చూచును.)

బుచ్చమ్మ — విన్నారా? తమ్ముడు వెధవని పెళ్ళాడతాడ్ట!

గిరీ — నా ప్రియశిష్యుడూ, మీకు ప్రియసోదరుడూ అయిన వెంకటేశం విధవా వివాహం చేసుకుంటే మేం యావన్మందిమిన్నీ బ్రహ్మరథం పట్టమా?

బుచ్చ — గురువులుగదా ముందు మీరెందుకు చేసుకోరు?

గిరీ — అడగవలసినమాట అడిగారు. చెబ్తాను వినండి. మీరడిగినతరవాత చెప్పకపోవడం తప్పని చెబుతున్నానుగాని, యీమాటలు చెప్పవలసినవి కావు. ఏమంటారా? నాగొప్ప నేచెప్పుకోకూడదుగదా? అదొకటి. అంతకంటె ప్రమాదమైన మాట మరోటుంది. చూశారా వొదినా! — మొదట్నుంచీ విధవా వివాహం కూడదు కూడదు అని తప్పు అభిప్రాయంలో పడిపోయివున్న అత్తగారూ, మావఁగారూ లాంటి పెద్దవాళ్ళకి యెన్ని శాస్త్రాలూ సవబులూ మనం చెప్పినా, వాళ్ళకి నెత్తికెక్కవు. ఇలాంటిమాటలు వాళ్ళతో మనం చెప్పినట్టాయనా కఱ్ఱుచ్చుకుంటారు. మావఁగారు వేదంమట్టుకే చదువుకున్నారుగాని నేను శాస్త్రాలు అన్నీ చదువుకున్నాను. అబ్బో, నేను మనశాస్త్రాల్లో పుడ్డోల్లుణ్ణి. శాస్త్రకారుడు యేమన్నాడూ? "బాలాదపి సుభాషితం" అన్నాడు, అనగా మంచిమాట చంటిపిల్లడు చెప్పినా విని ఆ ప్రకారం చెయ్యండయ్యా అన్నాడు అయితే మన పెద్దవాళ్ళు శాస్త్రంలో చెప్పినప్రకారం నడుస్తారా? యంతమాత్రం నడవరు. మనము శాస్త్రమూ, సవబులూ చూపిస్తే యేమంటారు? యీకుంటవెధవలు చెప్పడం మనం

పిండవూనా అని యిబ్బుచ్చుకుంటారు. నామాటకేం చెప్పకుంటే, నాదెయినుంలాంటి శరీరం కొడితే కట్టలుతెగిపోవాలిగాని చెక్కుచెదరదు. నా ప్రియురాలికోసమైతే యేమో? మీఅంతరిపి మెత్తనిస్వభావమైన శరీరాలు పువ్వులవంటి దెబ్బలకు విరిగిపోతాయి గనక యీ మాటలు విన్నా మనం యెవరితోనైనా చెప్పినట్టైతే నాని పెద్దోళ్ళతో ప్రాణం పోయినా అనవలసినది కావు యేమంటారు?

బుచ్చ—అవును.

గిరీ—అవునంటే చాలదు. యెవరితోనూ యీమాటలు నామనసులో మాటలు నాలుగూ యెలా చెప్ప

బుచ్చ—యెవరితోనూ చెప్పను.

గిరీ—వొట్టేసుకోవాలి.

బుచ్చ—యేమని వొట్టేసుకోను?

గిరీ—యేమంటారా? మీరు యెవరితోనైనా చెబితే బుఱ్ఱ పగిలిపోవాలని వొట్టేసుకోండి.

బుచ్చ—అహాఁ అలా వొట్టేసుకోను! మీబుఱ్ఱ చల్లగా ఉండాలి. చెబితే నాబుఱ్ఱ పగిలిపోవాలని వొట్టేసుకున్నాను.

గిరీ—అందుకు నేవొప్పుకోనా యేమిటి? నాబుఱ్ఱ పగిలింతరవాత మీబుఱ్ఱజోలికి యెవడైనా రావాలిగాని, మీప్రాణానికి నాప్రాణం అడ్డు వెయ్యనా?

బుచ్చ—మాఅమ్మని బతికించారుకారా? మీరు అలాంటివారే.

గిరీ—ఆమాట మీరే అన్నారుగనుక, వినండి—చెప్తాను. నేను పెళ్ళాడి పెళ్ళాం బిడ్డలు నాకుంటే, వాళ్ళని తలచుకున్నతరవాత ప్రాణానికి తెగించి మీ అమ్మని తియ్యడానికి నాతులోకి గెంతగలిగివుందునా? ఈజన్మమంతా లోకోపకారం కింద వినియోగపర్చుకుందామని నిశ్చయించుకుని యిదివరదాకా ఏకాకినైవుంటిని. సత్యమే మీలాంటి నామేలుకోరినవాళ్ళు "పెళ్ళిచేసికో" అంటే ఆమాటతో సేయడం కష్టమే; గాని ఒకమాటకిమాత్రం జవాబు న్యాయంగా చెప్పండి, ఒకళ్ళకి ఉపకారం చెయ్యడం గొప్పా? అందరికీ ఉపకారం చెయ్యడం గొప్పా?

బుచ్చ—అందరికి చెయ్యడమే గొప్పనుకుంటాను.

గిరీ—సరే! ఆమాటమీద నిలవండి, పెళ్ళాడి, ఆలూబిడ్డలికి, ముచ్చకాయ ముగ్గురికి ఉపకారం చెయ్యడంకంటే లోకోపకారం కింద యీప్రాణం వినియోగపర్చడం పుణ్యంకాదా? చచ్చేకాలానికి స్వర్గం యెదురుగుండా కొస్తూందే?

బుచ్చ—లోకానికి యేం ఉపకారం చాస్తారు?

గిరీ—అలాఅడగండి సోషల్ రిఫారమ్, సోషల్ రిఫారమ్ అంటే సంఘసంస్కారం.

అసలు యింగిలీషుమాట యంత అర్థవొఁతుందో, మీకు దానితర్జుమా కూడా అంతే అర్థం అవుతుంది. విప్పి చెప్పాలంటే ఒక సిమిలీ, అనగా ఉపమానం చెప్పి మీకు బోధపరుస్తాను. లోకం తప్పుతోవలో వెళుతూంటే ఆతోవలోంచి మళ్ళించి మంచితోవలో పెట్టడమనేది సోషల్ రిఫారమ్.

బుచ్చ—ఏమిటా తప్పుతోవ ?

గిరీ—జారుడు బురదా గొట్టూ గోతులూ వున్నతోవ యలా వుంటుందో యిప్పుడు మన వాళ్ళ ఆచారాలు అలాఉన్నాయి; ఆతోవలోంచి బండీతప్పించి మంచి దిమ్మిసా కొట్టిన హైరోడ్డులోకి మళ్ళించాలి. ఆబండికి రెండు చక్రాలు. ఒకటి విధవా వివాహం, రెండు నాచికోశ్చన్, అనగా సానివాళ్ళని హతవార్చడమున్నూ ఈ రెండే రాజమార్గాలు.

బుచ్చ—మనవాళ్ళ దురాచారా లేవిఁటో నాకు బోధపడలేదు.

గిరీ—ఐతే చెబుతాను వినండి. ముసలాళ్ళకి చిన్నపిల్లల్నిచ్చి పెళ్ళిచెయ్యడం ఒకటి. డబ్బుకి పిల్లల్ని అమ్ముకోవడం ఒకటి. అవునంటారా కాదంటారా ?

బుచ్చ—అవును.

గిరీ—ఆముసలాళ్ళు చస్తే కష్టం సుఖం యరగని పసిపిల్లలు వెధవలు అవుతారు. ఉప్పూ పులుసూ తిన్నడంచాత యేమీయెరగని పసిపిల్లలు పూర్ణయవ్వనం వచ్చిన తరవాత మనసుపట్టలేకపోతే వాళ్ళదా తప్పు ? "వెధవవివాహం కూడదూ, విధవ వివాహం కూడదూ" అని ఓర్వలేని మాటలు చెబుతూ, డబ్బు కాశించి, ముసలి పెళ్ళిళ్ళు చేసే మూర్ఖులాతప్పు ? వూరుకుంటారేం ?

బుచ్చ—నాకు తెలియదు.

గిరీ—అఘాఁను మరి మీరేవఁనగల్రు ? తల్లినీ, తండ్రినీ యేవఁనుకున్నా మనసులో అనుకొని జీర్ణించుకోవాలిగాని, మీలాంటిమంచివాళ్ళు పైకంటారా ? నాలాంటివాణ్ణి యేవఁండీ మావఁగారూ, పిల్లల్ని రూపవంతుడూ, యవ్వనవంతుడూ, బుద్ధిమంతుడూ అయిన్న కుర్రవాడికి యిమ్మని శాస్త్రంలో ఉందిగదా, శాస్త్రానికి విరుద్ధంగా యెందుచాత డబ్బు కక్కుర్తిపడి ముసలాళ్ళకి గట్టబెడుతున్నారయ్యా ? శాస్త్రంలో "వెధవలికి పెళ్లిచెయ్యవలసినది. చెయ్యవలసినది" అని శాసించి చెప్పి ఉండగా యెందుకు చెయ్యరయ్యా అని అడిగితేనట్టాయన అర్ధచంద్రప్రయోగం చేసి ఆవతలికి గెంటుతారు; అంచాత "శాంతం భోషాణపెట్టె" అనుకుని నోరు మూసుకుని వూరుకున్నాను. యిహ నాచ్చికోశ్చన్ మాట వినండి. సానివాళ్ళని హతవార్చడం మంచిదంటారా కాదంటారా

బుచ్చ—వాళ్ళని చంపేస్తారా యేమిఁటి ?

గిరీ—చంపక్కర్లేదు, పొమ్మనక్కర్లేదు, పొగబెడితేను చాలునన్నట్లు సానివాళ్ళని

పెళ్ళిళ్ళకి పిలవకపోవడం, వాళ్ళిళ్ళకి వెళ్ళకపోవడం, వాళ్ళని ఉంచుకోకపోవడం, పైన చెప్పిన పనులుచేసేవాళ్ళని కనబడ్డచోటల్లా తిట్టడం, యిలా నావంటి బుద్ధిమంతులంతా ఒహటై కొంతకాలం చేసేసరికి, కలికాలంలోకైనా మరి సాంది వుండదు. లేకుంటే చూడండి మన వెంకటేశం పెళ్ళికి తప్పకుండా సానిమేళం తెస్తారు. నే యెరుగుదును. కూడేసిన్న పనల్లా మావఁగారు చూస్తారు. కూడనిపని మానివేస్తారు; సానిమేళం తేవడమనేది డబ్బిచ్చి తద్దినం కొనుక్కోవడమన్న మాటకాదా? పెళ్ళినాటికి నా ప్రియశిష్యుడికి కొంచం యీడొస్తుందిగదా ఆసాని ముండలు యెఱ్ఱగా బుఱ్ఱగా వుండడం చూసి, పెళ్ళాంమీద అసహ్యం పుట్టి యీ పసిపిల్ల యెదగడవెఁప్పుడు, కాపరానికి రావడవెఁప్పుడు, యీ సానివాళ్ళు మామ జాగా ఉన్నారని వాళ్ళని వెంకటేశం వుంచుకుంటే కొంప మునిగిపోతుందిగాని తరవాయి వుండిపోతుందా యేవఁంటారు?

బుచ్చ—ఆవును నిజవేఁ.

గిరీ—గనక లోకం బాగుపడేటందుకుగాను వెధవలికి పెళ్ళి చెయ్యడానికి సానివాళ్ళని సాగనంపడానికి వీరకంకణం కట్టాను. మరేవచ్చి మీ కమ్మత్ర్యాంటివాళ్ళకి అనేకులికి విద్యాబుద్ధులు చెప్పుతున్నాను. గజీశగాణ్ణి మాటచేత నూతుల్లో గోతుల్లో పడ్డవాళ్ళని పైకి తీస్తాను. ఇంకా నేషనల్ కాంగ్రెస్ ఒహటుందిగాని అందులో నేచేసే పని చాంతాడంత వ్యాఖ్యానం చేస్తేగాని మీకు బోధపడదు. పరిపరి విధాల లోకోపకారం చేస్తున్నాను.

బుచ్చ—యీపనులన్నీ పెళ్ళిచేసుకుంటేమాత్రం చెయ్యకూడదా?

గిరీ—యెలా చేయడం? లోకవఁంటే గంజిగుంట అనుకున్నారా? యేషియా, యూరోప్, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా అని ఐదు ఖండాలు, అందులో అమెరికాలో మనుష్యులు బుఱ్ఱకిందికీ కాళ్ళుపైకీ పెట్టి నడుస్తారు. ఇక్కడ పగలు గదా యిప్పుడు? అక్కడ రాత్రి. నార్తుపోల్ అని మరో దేశం ఉంది. అక్కడ ఆర్నెల్లు పొగలే, అప్పుడు మరి రాత్రుండదు. ఆర్నెల్లు రాత్రే; అప్పుడు మరి పొగలుండదు. అక్కడేవిఁటనుకున్నారు. సముద్రం అంతా మంచు కెరడైపోతే లేళ్ళని బళ్ళకికట్టి సవారీవి, వాయువేగమనోవేగంగా వెళతారు. ఇన్ని దేశాలకీ వెళ్ళి అక్కడివాళ్ళకల్లా ఉపకారంచేస్తేగదా లోకోపకారం అవుతుంది. పెళ్ళాం బిడ్డలూ ఉంటే వాళ్ళను వొదిలి యలా పోవడం అయితే పెళ్ళాడమని మీరు చెప్పినమాటకూడా నతలామా కొట్టిపారేయకూడదు. లోకానికోసం బతకడం ఉత్తమం. అయితే లోకం అంతా యెంత విలవో అంతకన్న యెక్కువ విలవైన రత్నంలాంటి ఆడమనిషి దొరికితే తప్పకుండా పెళ్ళాడవలసిందే. ఈవూరొచ్చే వరకూ నాకలాంటి దివ్యసుందరవిగ్రహం కనపళ్ళేదు. మొహవెఁదట చెప్పకూడదు. అలాంటి మనిషి యీవూళ్ళో కనపడ్డది; అందరానిపండుకు ఆశించడ వెఁందుకని

మనస్సు మళ్ళించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నానుగాని మనస్సు లొంగకుండా వుంది. భగవంతుడేం జేస్తాడో! మనసుతో యేమంటున్నానంటే "ఓ వెఱ్ఱిమనసా! నువ్వు వలచిన చిన్నది అణిముత్యమేగాని యిన్నాళ్ళూ పెళ్ళి మానేసి యిప్పుడు "పెళ్ళాడదాం పెళ్ళాడదాం" అని యెందుకు సందడిపడతావు? 'సంసార సాగరం దుఃఖం, తస్మాజ్జాగ్రత జాగ్రత' అన్నాడు. సంసారం పడిపోతే మళ్ళీ నీకు లోకోపకారం చేయడానికి సావకాశం ఉంటుందా?" అని మనస్సుకి బోధపరుస్తున్నాను. పెళ్ళాడితే లోకోపకారానికి అవకాశం యెంతమాత్రం ఉండదు. చూశారా వదినా! మాటవరసకి మనం పెళ్ళాడతాం అనుకుందాం. సంసారం గడుపుకోవడానికి డబ్బు సంపాదించుకోవాలా? ఇదివరకల్లా అంటే బ్రహ్మచర్యం ఆచరిస్తున్నాను. గనుక 'సత్రా భోజనం మఠా నిద్ర' సరిపోయింది. మాటవరసకి మిమ్మల్ని పెళ్ళాడినతరవాత అలా సరిపోదే! మనంగాని నూవంగాని ముహూర్తానికి లక్ష్యపెట్టక యెవరితోనూ చెప్పకుండా రామవరం వెళ్ళిపోయి అక్కడే శాస్త్రోక్తంగా పెళ్ళాడావంటే, ప్రస్తుతం పుట్టుకువిడో మారియేజి సభవారు నెలకి నూర్రూపాయిలు యిస్తారు ఓనాలుగైదు మాసాలు అలా కాలక్షేపంచేసి హైదరాబాదులోగాని, బరోడాలోగాని, ఓ వెయ్యి రూపాయలఉద్యోగం సులభంగా సంపాదించుకుంటాను హైదరాబాదు నవాబు నెలరోజులకిందట పెద్ద ఉద్యోగమిస్తానన్నాడు. 'నేను ఒకరిదగ్గిర నౌఖరీ చేస్తానా?' అని వెఱ్ఱిపీగి తోసిపారేశాను. మీరు వివాహం చేసుకోమని సహాయిస్తారని అప్పుడే యెరిగి ఉంటే ఆఉద్యోగం మించిపోనియ్యకపోదును.

బుచ్చ—మీరు ఉద్యోగం చెయ్యరన్నాడే, తమ్ముడు?

గిరీ—అవును బ్రహ్మచారిగావుండి లోకోపకారం చేస్తూఉన్నంతకాలం పెళ్ళి చేసుకోనని శపథంపట్టాను. కాని యిప్పుడు నాఅదృష్టంవల్ల లోకం అంతటికన్నా విలవైన వజ్రంలాంటి భార్యావొరికితే పెళ్ళాడకతీరుతుందా? లోకంయొక్క విలవ వెండి అనుకోండి. లోకం వెండైతే మీలాంటి సువర్ణచ్ఛాయగల కుందనపుబొమ్మ, పన్నెండో వన్నె బంగారం అవునంటారా కాదంటారా? బంగారం విలవ యెక్కువా వెండి విలవ యెక్కువా? చెప్పండి.

బుచ్చ—బంగారమే యెక్కువ.

గిరీ—సరే, మీలాంటి బంగారంబొమ్మ లభించినప్పుడు లోకం గీకం అవతలబెట్టి పెళ్ళాడకతీరదుగదా; మాటవరసకి మనం పెళ్ళాడతాం అనుకోండి. పెళ్ళాడిం తరవాత సంసారం సుఖంగా జరుపుకోవాలంటే లావుగా డబ్బుండాలిగదా? ఉద్యోగం చేస్తేగాని డబ్బు లావుగా రాదే?

బుచ్చ—అవును.

గిరీ—అట్టే డబ్బెందుకని అడుగుతారు ఒకవేళ, చెబుతాను వినండి సంసారానికి యిల్లన్నది ఒకటుండాలిగదా? యేమంటారు?

బుచ్చ—అవును.

గిరీ—నాకు మేడలుంటేగాని కుదరదు యిలాంటి చిన్నయిళ్ళలో నాకు ఉక్కిరిబిక్కిరిగా ఉంటుంది. ఆ మేడచుట్టూ తోట ఉండాలి. మామిడిచెట్లూ, అరటిచెట్లూ, జామిచెట్లూ, చెప్పలేనన్ని వృక్షాలూ వేస్తాం. మన వెంకటేశం కోతిలాగ పళ్ళు తింటూ యెప్పుడూ ఆచెట్లమీదే ఉంటాడు.

వెంక—ఆచెట్లపళ్ళన్నీ నేనే కోస్తాను.

గిరీ—అంతవాడివి కావనా? మనం అలాగ యిల్లూ, వాకిలీ, తోటా, దొడ్డీ, యేర్పరచుకునేటప్పటికి మనకి చిన్నపిల్లలు పుడతారు. వాళ్ళని సంరక్షణ చెయ్యాలా? వాళ్ళు నేను కుర్చీమీద కూచుని రాసుకుంటూంటే వొచ్చి చెయ్యిపట్టుకు లాగి నాన్నా యిది కావాలి అది కావాలంటారు. మీరు బీరపువ్వులాగ వొంటినిండా సరుకులు పెట్టుకుని, చక్కగా పసుపూ కుంకుమా పెట్టుకుని, మహాలక్ష్మిలాగ యింట్లో పెత్తనం చేస్తూఉంటే ఒక పిల్ల యిటువేపువొచ్చి మెడ కావలించుకునీ, ఒకపిల్ల అటువేపువొచ్చి మెడకావలించుకుని "అమ్మా యిది కావాలి, అమ్మా అది కావా" లని అడుగుతారు. వాళ్ళకి సరుకూ సప్పరా చేయించాలి. జరీదుస్తులు కుట్టించాలి గిరీశం గారిపిల్లల్ని తీసుకురా అని ఒకప్పుడు నవాబుగారి శలవౌతుంది, మనపిల్లల్ని వెంకటేశంలాగ కాయగావంచా, తెల్ల చొక్కాయితో పంపించడానికి వల్లకాదుగదా? వాళ్ళకి చిన్న బళ్ళూ గిళ్ళూ కొనాలి. వాళ్ళకి చదువూ సంధ్యా? చెప్పించి ప్రయోజకుల్ని చెయ్యాలి? ఇదంతా సంసారతాపత్రయం కాదా? ఇందులో పడిపోతే మరి లోకోపకారం చేయడానికి అవకాశం వుంటుందా? చెప్పడం మరిచిపోయాను. అప్పుడు మన వెంకటేశం మనదగ్గిరే వుండి చదువుకుంటాడు.

బుచ్చ—అలా అయితే మరి నాన్నకి ఖర్చుండదు. నాన్నా అమ్మా వాడిచదువుకోసం దెబ్బలాడ్రు.

గిరీ—నే వొద్దన్నానా?

వెంక—నాకో చిన్న గుఱ్ఱబ్బండి కొనాలి.

గిరీ—వేరే నీకు బండీయెందుకు? మాపిల్లలబండీలో నువ్వుకూడా వెళ్ళుదువు గాని వాళ్ళు అల్లరిచెయ్యకుండానూ, కిందపడిపోకుండాను చూస్తూవుందువుగాని.

వెంక—అక్కయ్యని పెళ్ళాడేస్తారా యేవిఁటి?

గిరీ—మాటవరసకి అని అంటూంటే, మతిపోయినట్లు మాట్లాడతావేవిఁటి?

బుచ్చ—అంతేకద?

గిరీ—అంతేగదంటే అంతకంటె అదృష్టం నాకు పట్టడం యెలాగ? ఆమాట మీరు అన్నా, నేను అన్నా, మీవాళ్ళు నన్ను తన్ని తగిలేస్తారు. వెంకటేశంగానీ అన్నట్లాయనా, పెట్యాకట్టుతాడు వుణ్నే వుంది.

వెంక—ఓయి నాయనో! వీపు తడువుకొనును.) గప్‌చుప్! నే అవూసెత్తను.

బుచ్చ—మా నేస్తం రాంభొట్లుగారి అచ్చమ్మ మీరు వొప్పుకుంటె మిమ్మల్ని పెళ్ళాడతానంది.

గిరీ—పెళ్ళాడదనే వొస్తె, అచ్చమ్మనీ పిచ్చమ్మనీ పెళ్ళాడతాను. ఎప్పటికైనా 'ఒకళ్ళతో నాకు పనేవిఁటి? నాబతుకు సుఖవేఁదో నేను చూసుకుంటాను.' అది మీలాంటి దివ్యసుందరవిగ్రహాలూ, గుణవంతురాలూ, నామీద కనికరించి "గిరీశంగారూ నన్ను పెళ్ళాడండి" అంటే పెళ్ళాడతానుగాని అచ్చమ్మల్నీ, పిచ్చమ్మల్నీ మెడకి కట్టుకుని ఉత్తమబ్రహ్మచర్యం, లోకోపకారం, మానుకుంటా ననుకున్నారా యేవిఁటి?

వెంక—మంచిపండు పడిపోయింది అందుకోండి.

గిరీ—(పండు తీసి) ఆహా! యేమిచాయ! వొదినా మీవొంటి చాయని వుంది యీ పండు యిందండి.

బుచ్చ—బిందెలో పడెయ్యండి. తమ్ముడూ దిగొచ్చి బిందెయెత్తు.

గిరీ—వాడక్కర్లేదు. నేనెత్తుతాన్లెండి (యెత్తి) ఆహా! యేమి వయ్యారం!

(బుచ్చమ్మ నిష్క్రమించును.)

శిష్యా! రెండు పళ్ళు రాల్చు.

వెంక—నాన్నొస్తున్నాడండోయి దొడ్డితోవ్వేపు. యేవిఁటి సాధనం?

గిరీ—ఆకులు దట్టంగా ఉన్నవేపు దాగో. నేను యాతాం తోడ్డం ఆరంభిస్తాను.

[అగ్నిహోత్రావధానులు ప్రవేశించి]

అగ్ని—గిరీశంగారూ నీరుతోడుతున్నారండీ? ఆసిరిగాడు తోడుతాడే, యింగిలీషు చదువుకున్నవాళ్ళు, మీకెందుకా శ్రమ?

గిరీ—పనివంటి వస్తువ లోకంలో లేదండి ఊరికే కూచుంటే నాకు వూసుపోదు. మొక్కలకా మంచిది. నాకా కసరత్తూ, గవునరు తోట్లో గొప్పు తవ్వుతాడు. సీవంరాణీవారు బీదలూ సాదలకీ యివ్వడానికి బట్టలు కుడతారు. ఇంగిలీషువాడు సోమరితనం వొప్పడండి. వాళ్ళలో పెద్దకవీశ్వరుడు షేక్స్పియర్ యేవన్నాడో విన్నారా, "డిగ్నిటీ ఆఫ్ లేబర్" అన్నాడు— అనగా కలక్టరు గొప్పవాడు కాడు, జడ్జీ గొప్పవాడు కాడు; కాయక్లేశపడి కష్టపడేమనిషే గొప్పవాడన్నాడు.

అంచాతనే యీగొప్ప దొర్లంతా మెప్పు పొందాలంటే తోటమాలీపని చేస్తారు. చెట్లూ చావఁడీలూ యెక్కడం వొహటే వాళ్ళలో గొప్పవిద్య. లాభంలేనిపని యేదీ దొర చెయ్యడండి మావఁగారూ. దొరగారు వూర్నించి వూరికి వెళుతూండగా దాహవేఁస్తుంది. చెట్లని పళ్ళుంటాయి. నడితోవలో చెట్టెక్కడం నేర్చుకోకపోతే దాహంతో చావలిసిందేగదా? యేజన్సీ కమాన్ చేస్తూవుంటే పెద్దపులి వొస్తుందనుకోండి. దొరకి చెట్టెక్కడం చాతయితే చటాల్న చెట్టెక్కి ప్రాణం కాపాడుకుంటాడు. అంచేత చదువుతోపాటు చెట్లెక్కడం కూడా నేరుస్తారు.

అగ్ని — దొర్లతరిఫీదంతా అవో చిత్రం. వెంకడు రానుకుంటున్నాడా, చదువుకుంటున్నాడా అండి?

గిరీ — యింతసేపూ చదువుచెప్పి "చెట్లూ, చావఁడీలూ యెక్కి ఆడుకో" అని తోలేశాను.

అగ్ని — మీ కేం మతిపోయిందా ఏమిటండీ? కాలూ చెయ్యీ విరుగుతుంటే?

గిరీ — రేపు మనవాడికి గుంటుపురం తాసిల్దారీ అయి అడివిలో కమాను వెళ్ళుతుండగా! పెద్దపులొస్తే చెట్టెక్కలేక, కాళ్ళు వొణికి చతికిలబడాలని మీ అభిప్రాయవాఁ యేవిఁటి?

అగ్ని — మనవాడికి తాసిల్దారీ అవుతుందండి.

గిరీ — యెందుకాకూడదు గుఱ్ఱాలెక్కడం మనవాడు నేర్చుకోకపోతే, "నాయనా! నువ్వు కమానుకి పనికిరావు. డసుకుదగ్గిర కూచుని గుమాస్తాపని చేసుకో. తాసిల్దారీ గీసిల్దారీ తలపెట్టకు" అని దొర్లంటారు.

అగ్ని — అలాగైతే చిన్న చెట్టెక్కించండిగాని పెద్దచెట్లప్పుడే యెక్కనివ్వకండి.

గిరీ — అంచాతనే జామచెట్టు యెక్కమన్నాను, చూశారా?

అగ్ని — ఓరి కోతివెధవా!

గిరీ — అదుగో తిడుతున్నారూ? దొర్లచదువు చదువుకుంటే దొర్లతరిఫీదు యివ్వక తప్పదు. మీరిలా తిడితే భయపడి కిందపడతాడు; యిలాంటి పనులు మీకిష్టం లేకపోతే, యింగిలీషుచదువు మానిపించి వేదం చెప్పించండి.

అగ్ని — మరిచిపోయి తిట్టాను. యీ యింగిలీషువాళ్ళ సంగతంతా అవో వెఱ్ఱిమొఱ్ఱి.

గిరీ — మీవంటి ప్రాజ్ఞులు అలా అనడం నాకు ఆశ్చర్యంగా వుంది. వాళ్ళ నడవడిక మంచిదవడంచాతనే దేవుఁడు యింత రాజైశ్వర్యం వాళ్ళ కిచ్చాడు. మన శాస్త్రాల్లో మాటలు మనం మనం మరిచేపోయినావుఁ. అమాటలే తెల్లవాళ్ళు దొంగతనంగా పట్టుకుపోయి, శాస్త్రం చెప్పినట్లల్లా ఆచరించి మనరాజ్యం లాగుకున్నారు. మీరు యెరిగినవారు గదా చెప్పండి. గురువుఁగారిదగ్గిర శిష్యులు యేంచేసేవారు?

వనానికి వెళ్ళి చెట్లెక్కి సమిధలు తెచ్చేవారు. రెండికీ మొండికీ ఓర్చేవారు. ఇప్పుడు మీరింత ప్రాజ్ఞులైన మీరేవంటున్నారూ? మావాడు యిల్లు కదిలి వెళ్తే కందిపోతాడు. మావాడు జాంచెట్టెక్కితే కాళ్ళు విరుచుకుంటాడు అని భయపడుతున్నారు. మీ శిష్యులు బ్రహ్మాండవైన మఱ్ఱిచెట్టుకొనకెక్కి ఆకులు కోసి తెస్తున్నారు కారా? మన పుస్తకాల్లో మర్మం కనుక్కొని దొర్లు బాగుపడుతున్నారు. మనపుస్తకాలు బూజెక్కించి మనం చెడుతున్నాం.

అగ్ని—మీరు చాలా తెలుసును ఈ తెల్లవాళ్ళు చేసే విద్యలన్నీ మన గ్రంథాల్లోంచి యెత్తుకెళ్ళినవే, యీ రెయిలుస్టీమరు గయిళ్ళు యావత్తు మన వేదంలో వున్నాయట. మీది మా పరిశీలనైన బుద్ధి మనకేం గెలవడానికి మీరు రావలసిన సవబులు మా బాగున్నాయి.

గిరీ—యింకా బాగుండును. రికార్డు పూర్తిగా లేదు. కొన్ని కాగితాలు మీరే పారేశారో, మీ వకీలు వుంచేసుకున్నాడో నాకు బోధపడకుండా వుంది.

అగ్ని—నేను పారెయ్యలేదండీ. నాకు యింగిలీషు తెలియకపోవడం చాలా చిక్కొచ్చింది.

గిరీ—మీకే యింగ్లీషువొస్తే భాష్యం అయ్యంగార్లా అయిపోరా? యీ మడి తడిపేసి వున్న కాగితాలు యావత్తూను జాబితా రాస్తాను, తమరు వెళ్ళండి.

అగ్ని—మీరు సంసారం పనిపాట్లు యేం శ్రద్ధగా చేసుకుంటారు! మావాడికి మీలా ప్రయోజకత్వం అబ్బితే నాకో కాడి అవసరం వుండదు. దిగేటప్పుడు నిమ్మళంగా సాయంచేసి మరీ దింపండేం? కీడెంచి మేలెంచమన్నాడు. (నిష్క్రమించును)

వెంక—(నిమ్మళంగా) నాన్న యింట్లో కెళ్ళిపోయినాడు.

గిరీ—నిమ్మళంగా దిగు.

వెంక—(వురికి బతికించారు. వెళ్ళిపోబోవును.)

గిరీ—ఆగు ఆగు ఆవొళ్ళో పళ్ళిలా పట్రా.

వెంక—దొబ్బుతారా యేవిఁటి అన్నీని? అన్యాయం!

గిరీ—"అన్యాయం పాపనాశనం" అన్నాడు. ఒక్క అన్యాయంతో పాపాలన్నీ పోతాయి. అన్నిపళ్ళూ నువ్వుమాత్రం తింటావా యేమిటి? తింటే స్టమకేక్. కడుపునొప్పొస్తుంది; కడుపునొప్పొస్తే మీఅమ్మనోరు పగల్దీసి సోలెడు ఆవఁదం వసగుండా గొంతుకలో పోస్తుంది.

వెంక—నేనావఁదం తాగను.

గిరీ—అలా అయితే పళ్ళెట్టే తినకు. (యీతాంవొదిలి వెంకటేశం వొళ్ళోని కాయలు దోంచుచుండును.)

వెంక—(యేడుపు మొహంతో) పెద్దపళ్ళన్నీ దొబ్బుతారా యేవిఁటి?



# కన్యాశుల్కము — చతుర్థాంకము

## ౧-వ స్థలము : రామప్పంతులు యింటిసావిడి.

(రామప్పంతులు కుర్చీమీద కూర్చునివుండగా మధురవాణి నిలబడి తమలపాకులు చుట్టి యిచ్చుచుండును.)

రామ — నేనే చిన్నతనంలో యింగిలీషు చదివివుంటే జడ్జీలయెదట ఫెళ్లఫెళ్లలాడించుదును. నాకు వాక్ స్థానమందు బృహస్పతి వున్నాడు. అందుచేతనే యింగిలీషు రాకపోయినా నాప్రభ యిలా వెలుగుతూంది.

మధు — మాటలు నేర్చిన శునకాన్ని వేటకి పంపితే ఉసుకోమంటే ఉసుకోమందిట.

రామ — నేనా శునకాన్ని ?

మధు — హాస్యానికన్నమాటల్లా నిజవఁనుకుంటారేవిఁ ?

రామ — హాస్యానికా అన్నావు ?

మధు — మరి మీతో హాస్యవాఁడకపోతే, వూరందరితోటీ హాస్యవాఁడమన్నారా యేవిఁటి ?

రామ — అందరితో హాస్యవాఁడితే యెరగవా ?

మధు — అంచేతనే కుక్కన్నా, పందన్నా, మిమ్మల్నే అనాలిగాని, మరొకర్ని అనకూడదే! మిమ్మల్ని యేవఁనడానికైనా నాకు హక్కు వుంది. యిక మీమాటకారితనం నాతో చెప్పేదేమిటి ? మీమాటలకు భ్రమసేకదా మీమాయలలో పడ్డాను?

రామ — నాకు యింగిలీషే వొస్తే, దొరసాన్లు నావెనకాతల పరిగెత్తరా ?

మధు — మీఅందానికి మేము తెనుగువాళ్లము చాలమో ! యింగిలీషంటే జ్ఞాపకవొచ్చింది. గిరీశంగారు మాట్లాడితే దొరలు మాట్లాడినట్టు వుంటుందిట.

రామ — అటా, యిటా. నీకేం తెలుసును. వాడు వొట్టిబొట్లేరు ముక్కలు పేల్తాడు. ఆమాటలు గాని కోర్టులో పేల్తే చెప్పుచ్చుకు కొడతారు.

మధు — అదేమో మీకే తెలియాలి ! గాని, గిరీశంగారు లుబ్ధావధాన్లుగారికి తమ్ములటా? చెప్పేరు కారు !

రామ — నీమనసు వాడిమీదికి వెళుతూందేం ? ఐతే నీకెందుకు, కాకపోతే నీకెందుకు?

మధు — సుతిలేనిమాటా, సుతిలేనిపాట . అని.

రామ — నాకాఁ సుతిలేదంటావు ?

మధు — [illegible]

రామ—యెంచేత ?
మధు—నుసట్ను వ్రాయడంచేత.
రామ—యేమని వ్రాశుంది ?
మధు—విచారం వ్రాసివుంది.
రామ—యెందుకు విచారం ?
మధు—గిరీశంగారు లుబ్ధావధాన్లు గారి తమ్ముళ్లైతే పెళ్ళికివొస్తారు. పెళ్ళికి వొస్తే, యేదైనా చిలిపిజట్టీపెట్టి మీమీద చెయిచేసుకుంటారేమో అని విచారం.
రామ—అవును. బాగా జ్ఞాపకంచేశావుగాని డబ్బు ఖర్చైపోతుందని అవుధాన్లు బంధువుల సెవళ్ళనీ పిలువడు
మధు—గిరీశంగారు పిలవకపోయినా వస్తారు.
రామ—నువుగానీ రమ్మన్నావా యేమిటి ?
మధు—మీకంటే నీతిలేదుగాని నాకు లేదా ?
రామ—మరి వాడొస్తాడని నీకెలా తెలిసింది ?
మధు—పెళ్ళికూతురు అన్నకి చదువుచెప్పడానికి కుదురుకుని, వాళ్ళింట పెళ్ళిసన్నాయి అంతా ఆయనే చేస్తున్నారట ఆంచేత రాకతీరడని తలుస్తాను.
రామ—వాడొస్తే యేమి సాధనం ?
మధు—నన్నా అడుగుతారు ?
రామ—పెళ్ళే తప్పిపోతే ?
మధు—యెలా తప్పుతుంది ?
రామ—తప్పిపోడానికి ఒక తంత్రం పన్నాను.
మధు—అయితే, మధురంమాట చెల్లించారే ?
రామ—చెల్లింపక రావప్ప యేచెరువునీళ్ళు తాగుతాడు ?
మధు—యేదీ ముద్దు (ముద్దుపెట్టుకొనును.)
రామ—గాని మధురం, కీడెంచి మేలెద్దాం. ఒకవేళ దెబ్బ బేజోటు అయిపోయి వాడు రావడవే తటస్థిస్తే యేమిటి సాధనం ?
మధు—ఆడదాన్ని నన్నా అడుగుతారు ?
రామ—ఆడదాని బుద్ధిసూక్ష్మం. కోర్టువ్యవహారం అంటే చెప్పా. యెత్తుకి యెత్తు యింద్రజాలంలా యెత్తుతాను. చేయిసుట్టు సరసమంటేమాత్రం నాకు కరచరణాలు ఆడవు.
మధు—పెళ్ళి నాలుగునోజులూ, తలుపేసుకుని యింట్లో కూచోండి.
రామ—ఆడదాని బుద్ధి సూక్ష్మమని చెప్పేనుకాదూ ? వూమంచి ఆలోచన చెప్పేవు.
మధు—గాని, నాకొక భయం కలుగుతూంది. నిశిరాత్రివేళ పైగొళ్ళెం బిగించి కొంపకి అగ్గి పెడతాడేమో ?

రామ—చచ్చానేఁ! వాడు కొంపలు ముట్టించే కొరివి కాను మరి యేవిఁగతి?

మధు—గతిచూపిస్తే యేమిటి మెప్పు?

రామ—"నువ్వు సాక్షాత్తూ నన్ను గాపాడిన పరదేవతవి" అంటాను.

మధు—(ముక్కుమీద వేలుంచి) అలాంటిమాట అనకూడదు. తప్పు.

రామ—మంచి సలహా అంటూ చెప్పావంటే, నాలుగు కాసులిస్తాను.

మధు—డబ్బడగలేదే? మెప్పడిగాను. నేను నా ప్రాణంతో సమానులైన మిమ్మల్ని కాపాడుకోవడం యెవరికో ఉపకారం?

రామ—మెచ్చి యిస్తానన్నా తప్పేనా?

మధు—తప్పుకాదో వేశ్యకాంగానే దయాదాక్షిణ్యాలు వుండవో?

రామ—తప్పొచ్చింది లెంపలు వాయించుకుంటాను చెప్పు.

మధు—పెళ్ళివంటలకి పూటకూళ్ళమ్మని కుదర్చండి.

రామ—శబాష్! యేమి విలవైన సలహా చెప్పావు. (యేదీ చిన్న ముద్దు పెట్టుకోబోయి ఆగి) గాని గిరీశంగాడు నన్నూ దాన్నీ కలియగట్టి తంతాడేమో?

మధు—ఆభయం మీకక్కరలేదు. పూటకూళ్ళమ్మ కనపడ్డపంటే, గిరీశంగారు పుంజాలు తెంపుకు పరుగెత్తుతారు. ఆమె నోరు మహాచెడ్డది.

రామ—అవును నోరేకాదు, చెయ్యికూడా చెడ్డదే. దాని దెబ్బ నీకేం తెలుసును. గాని, మా దొడ్డసలహా చెప్పావు. యేదీ ముద్దు. (ముద్దు పెట్టుకొనును.)

(ముద్దుపెట్టుకుంటుండగా, లుబ్ధావధాన్లు ఒక వుత్తరము చేతబట్టుకుని ప్రవేశించును)

లుబ్ధా—యేమిటీ అభావ చేష్టలూ!

రామ—(గతుక్కుమని తిరిగిచూసి) మావాఁ పడుచువాళ్ళం గదా? అయినా, నా మధురవాణిని నేను నడివీధిలో ముద్దెట్టుకుంటే నన్ను అనేవాడెవడు?

మధు—నడికుప్పమీద యెక్కి ముద్దు పెట్టుకోరాదా? పెంకితనానికి హద్దుండాలి, బావగారికి దండాలు, దయచెయ్యండి (కుర్చీ తెచ్చి వేయును.)

రామ—నాకు మావగారైతే, నీకు బావగా రెలాగవిఁటి?

మధు—మా కులానికి అంతా బావలే. తమకు యలా కష్టలైనారో? (లుబ్ధావధాన్లుతో) కూచోరేం? యేమిహేతువో గాని బావగారు కోపంగా కనపడుతున్నారు. రేపు పెళ్ళయినతరవాత అక్కగారిని, వీధితలుపుగడియవేసి మారీ ముద్దెట్టుకుంటారేమో చూస్తానుగదా? అయినా మీఅల్లుడుగారికి చిన్నతనం యింకా వొదిలింది కాదు.

రామ—పైలా పచ్చీసీలో, చిన్నతనంకాక పెద్దతనం యలా వొస్తుంది? యేం మావాఁ! కోపవాఁ?

లుబ్ధా—నాకు పెళ్ళీవొద్దు. పెటాకులు వొద్దు.

రామ—(మధురవాణి చెవిలో) చూశావా మధురం సాయంత్రం అప్పుడే పారింది. (పైకి లుబ్ధావధాన్లుతో) అదేం అలా అంటున్నారు? నిశ్చయం అయినతరవాత గునిసి యేం లాభం?

లుబ్ధా—నీసొమ్మేం పోయింది? గునియడం గినియడంకాదు. నాకీపెళ్లి అక్కర్లేదు.

మధు—(రామప్పంతులు చెవిలో) యేమిటీ వృత్తాంతం?

రామ—(మధురవాణిచెవిలో) అగ్నిహోత్రావధాన్లు పేరుపెట్టి నేనే బనాయించాను.

మధు—(రామప్పంతులు చెవిలో) యేమని?

రామ—(మధురవాణి చెవిలో) నువ్వు ముసలివాడివి గనుక నీసంబంధం మాను వొద్దని.

మధు—చిత్రం చెప్పేస్తాను.

రామ—(మధురవాణి చెవిలో) నీకు మతి పోయిందా యేమిటి? పెళ్ళి తప్పించమని నువ్వే నాప్రాణాలు కొరికితే, యీయెత్తుయెత్తాను. నోరు మూసుకో.

మధు—(లుబ్ధావధాన్లు చెవిలో) యీ సంబంధం మీకు కట్టిపెట్టాలని పంతులు చూస్తున్నారు. వొప్పుకోకండి.

రామ—(మధురవాణితో) యేమీ జేహద్బి! (లుబ్ధావధాన్లుతో) స్త్రీబుద్ధిః ప్రళయాంతకః అన్నాడు. దానిమాటలు నమ్మకండి. యంతమనిషి లేదు.

లుబ్ధా—(చేతిలోని వుత్తరమును ఆడిస్తూ) యీకుట్రంతా నీదే.

రామ—(తీక్షణంగా మధురవాణివైపు చూసి, లుబ్ధావధాన్లుతో) కోపం కోపంలా ఉండాలిగాని, యేకవచనప్రయోగం కూడదు.

లుబ్ధా—యిదంతా మీకల్పనే. నాకొంపముంచడానికి తలపెట్టారు. చదవండి.

రామ—(ఉత్తరం అందుకోక కుర్చీ వెనక్కి తీసుకుని) అవుత్తరం సంగతి నాకేం తెలుసును?

లుబ్ధా—చేసినవాడివి నీకు తెలియకపోతే, యెవరికి తెలుస్తుంది?

రామ—అదుగో మళ్ళీ యేకవచన ప్రయోగం! మెత్తగా మాటాడుతున్నావని కాబోలు ఆనాడీచేస్తున్నారు? ఉత్తరంగిత్తరం నేను కల్పించావని, మళ్ళీఅన్నావంటే కథ చాలా దూరం వెళుతుంది. అసంగతిమట్టుకు కాని వుండండి. రామప్పంతులు తడాఖా అంటే యేమనుకున్నారో?

లుబ్ధా—నువ్వు—

రామ—అదుగో మళ్ళీ.

లుబ్ధా—మీకల్పనైతేనేం, మరోహరి కల్పనైతేనేం, బుద్ధిపొరపాటు నాది. మధ్య నీ వెధవలతో నాకేం పని. వెంటనే బయల్దేరిపోయి, ఆ అగ్నిహోత్రావధాన్లును అడుగుతాను.

రామ—మాటలు జోరుగా వొస్తున్నాయి. జాగ్రత (లుబ్ధావధాన్లు వెళ్ళును) నన్నేనా వెధవలు అంటున్నాడు.

మధు—నన్ను కూడా కలుపుకోవాలని ఉందా యేవిటండి?

రామ—నన్ను మట్టుకు వెధవని కింద కట్టావూ?

మధు—నేవుండగా వెధవలు మీరెలా ఔతారు?

రామ—నన్ను సప్తవెధవని చేశావు మరి యింకా తరవాయి యేం వుంచావు?

మధు—అదేవిటి మాటలు?

రామ—ఆ ఉత్తరం నేను బనాయించానని, ఆ వెధవతో యెందుకు చెప్పేవు?

మధు—మీతోడు నేను చెప్పలేదే?

రామ—మరి నేను బనాయించేసని వాడికెలా తెలిసింది?

మధు—యెందుకీ ఆందోళన?

రామ—మరి, ఆ వెధవ, ఆ వుత్తరం తీసికెళ్ళి అగ్నిహోత్రావధాన్లుకి చూపిస్తే నామీద వాడు వెంటనే ఫోర్జరీకేసు బనాయిస్తాడే? పీక తెగిపోతుంది? యేవిటి సాధనం?

మధు—యంత్రం యెదురు తిరిగిందో? ఐతే చక్రం అడ్డువేస్తాను. (మధురవాణి తొందరగా వీధిలోనికి వెళ్ళును.)

రామ—యిదెక్కడికి పారిపోతూంది? యిదే చెప్పేసింది. దొంగపని చేసినప్పుడు రెండో వారితో చెప్పకూడదు. వెధవని చెవులు నులుపుకుంటాను. పరిగెత్తి వెళ్ళి చేతులో కాగితం నులుపుకొత్తునా?—గాడిదకొడుకు కరిస్తే? పోయి మీనాక్షి కాళ్ళు పట్టుకుంటాను.

[మధురవాణి వక చేతితో లుబ్ధావధాన్లు చెయ్యిపట్టుకుని ప్రవేశించును]

మధు—(రామప్పంతులుతో) చాలు, చాలు మీ ప్రయోజకత్వం. బావగారికి అన్నా, తమ్ముడా, కొడుకా, కొమ్మా? మిమ్మల్ని ఆప్తులని నమ్ముకుని, సలహాకి వస్తే ఆలోచనాపాలోచనా చెప్పక ఏకవచనం, బహువచనం, అని కాష్టవాదం పెట్టేరు, బావా! కుర్చీమీద కూర్చోండి (కుర్చీమీద కూచోబెట్టి) (రామప్పంతులుతో) యీ ఉత్తరం యేవిటో నింపాదిగా చదివి చూచుకోండి. (ఉత్తరం రామప్పంతులు చేతికి యిచ్చును.)

రామ—(ఉత్తరం అందుకుని తనలో) బతికాన్రా దేవుఁడా (చూచుకుని) అరే నా వుత్తరవేఁ కాదే యిది. నా నీడ చూచి నేనే బెదిరాను. (పైకి) మావాఁ? వొస్తూనే తిట్లతో ఆరంభిస్తే యెంతటివాడికైనా కొంచం కోపం వొస్తుంది సుమ్మా

దగానూ, మర్యాదగానూ, నన్నొచ్చి యేంసహాయం చెయ్యమంటే అది చేయనూ?

లుబ్ధా.—మీకైతే యీపటాటోపం వొద్దని రాయండి. అతగాడికి పటాటోపం కావలిస్తే ఆఖర్చంతా అతగాడే పెట్టుకోవాలి.

మధు—(లుబ్ధావధాన్లు జుత్తుముడి విప్పి దులిపి) యేంధూళి! సంరక్షణచేసేవాళ్ళు లేక పోబట్టేగదా? గూటిలోనుంచి వాసననూనె దువ్వెనా తెచ్చి తలదువ్వుచుండును.)

రామ—(ఉత్తరం విప్పి కొంతచూసి చదువును.) "సేవకుడు తమ్ముడు గిరీశం"_వీడా.

మధు—పైకి చదవండి.

రామ—నీగిరీశం, అనగానే పైకి చదవాలేం?

మధు—అయితే, మీరే చదువుకు ఆనందించండి.

లుబ్ధా—'నీగిరీశం' అన్నారేం?

రామ—అది వేరే కథ.

లుబ్ధా—పైకి చదవండి.

రామ—(చదువును.)

"సేవకుడు, తమ అత్యంతప్రియసోదరుడు గిరీశం అనేక నమస్కారములు చేసి చాయంగలవిన్నపములు, త॥ యీనాటికి వృద్ధాప్యంలోనయినా మీరు తిరిగి వివాహం చేసుకొని ఒకయింటివారు కావడమునకు నిశ్చయించితిరన్నమాట విని యమందానందకందళిత హృదయారవిందుడనైతిని."

లుబ్ధా—వెధవ, వృద్ధాప్యమంటాడూ? నిన్నగాక మొన్న నేగదా యాభై దాటేయి.

మధు—(దువ్వెన మొలనుపెట్టి, లుబ్ధావధాన్లు జుత్తు ముడివేసి) సంరక్షణలేక యిలా వున్నారుగాని, యెవరు మిమ్మల్ని ముసలివాళ్ళనేవారు?

రామ—(చదువును) "మీకు కాబోవు భార్య, నాప్రియశిష్యుం డగు వెంకటేశ్వర్లు చెలియలగుటంజేసి నాకు బ్రహ్మానందమైనది. నేను అగ్నిహోత్రావధాన్లు వారి యింటనే యుండి పెళ్లిపనులు చేయించుచున్నాడను, వారు నన్ను పుత్రప్రాయముగా నాదరించుచున్నారు. బహుదొడ్డవారేగాని చంద్రునకు కళంకమున్నటుల వారికి కించిత్తు ద్రవ్యాశా, కించిత్తు ప్రథమకోపమూం గలవు."

వ్యాకరణం వెలిగిస్తున్నాడయ్యా గుంటడూ!

"షరా—ఆకోపం వొచ్చినప్పుడు మాత్రం యెదట పడకుండా దాగుంటే యెముకలు విరగవు. ప్రాణం బచాయిస్తుంది; మరేమీ ఫర్వా వుండదు—ద్రవ్యాశ అనగా అది వారికి గాని, మీకు గాని ఉపచరించేదికాదు. మీవూరివారెవరో గాని వకతుంటరి, వీరు విశేషధనవంతులనియు, పెళ్ళి దేవదుందుభులు మ్రోయునటుల చేతురనియు, వర్తమానము చేయుటను, యేబది బండ్లమీద యీవూరివారి నందరిని

తర్లించుకు రానైయున్నారు. ఇంతియుకాక, దివాంజీ సాహెబువారి నడిగి, ఒక పంజరంబునూ మూడు లొట్టిపిట్టలునూ, యేనుగుజ్జుంబులు గూడ తేనైయున్నారు. బంగారపుటడ్డలపల్లకి గూడ దెచ్చెదరు.

"—దానిమీగ సవారీ ఐ, అలంకారోత్తులతో వూరేగి, మీరు పెళ్ళి చేసుకోవడం నాకు కన్నులపండుచేగాని, యింతా స్వభాగ్యయోగదా అని నాబోటి ఆప్తులు విచారిస్తున్నారు. యెద్దుప్రంకు నాకికి రుచి. రామప్పంతులు సామ్మేంపోయింది?"

వెధవ! నావూసెందుకోయి వీడికి?

'యిందులో ఒకపరమరహస్యం. అది యొద్దియనిన, యీ రామప్పంతులు చిక్కులకు,

"జాకాల్: తెలివికి, బిగ్ యాస్."

యిదేవిఁటోయి, యీ బొట్లేరు యింగిలీషు!

'అనగా'

వ్యాఖ్యానం కూడా వెలిగిస్తున్నాడయ్యా!

"జాకాల్, అనేది, గుంటనక్క—"

పింజారీ వెధవ!

"బిగ్ యాస్, అనగా, పెద్ద—"

వీడి సిగాదరగా? యేం వీడిపోయీకాలం! వీడిమీద తక్షణం డామేజి దావా పడేస్తాను.

(మధురవాణికి నవ్వొచ్చి ఆపుకోజాలక, విరగబడి నవ్వును)

యెందుకలా నవ్వుతావు? నీమొగుడు నన్ను తిడుతున్నాడనా ఆనందం?

మధు—(నవ్వుచేత మాట తెమలక, కొంతసేపటికి) కాదు—కాదు—మీతోడు—లొంటి—

రామ—నాతోడేవిఁటి! నేను చస్తే నీకు ఆనందవేఁ!

మధు—(ముక్కుమీద వేలువుంచి, రామప్పంతులుదగ్గరకు వెళ్ళి, శిరస్సు కౌగిలించుకొని, మూదెట్టుకొనును) యేమి దుష్టమాటా?

రామ—మరెందుకు నవ్వుతావ్?

మధు—లొటి—లొటి—లొటి—

రామ—యేవిఁటా "లొటి?"

మధు—లొటి—పిట—

రామ—అవును, లొటిపిట, అయితే?

మధు—(సమాళించుకొని) యెందుకో?

రామ—యెందుకో నాకేం తెలుసును?

లుబ్ధా—ఉత్తరంవల్ల మీరే తెమ్మన్నట్టు అగుపడుచూండే?

రామ—నేనా? నేనా? నాకెందుకూ లొటిపిట?

మధు—(ఉప్పెనగా తిరిగి నవ్వుతూ) యెక్కడానికి.

రామ—నేనా యెక్కడం?

మధు—యెందుకు కాకూడదూ? మీరొక లొటి—పిట—బావగారొక లొటిపిట—పో—పో—పోలిశెట్టి—పెళ్ళిసప్లయిదారుడుగనక, అతడో లొటిపిట—యెక్కి—పాలాలంట—వూరేగండి—వెన్ను కంప్పెక్కి—ఆ వైభవం—కళ్ళారా—చూస్తాం—(మిక్కిలిగా నవ్వును. నవ్వు సమాళించుకుని) బావగారూ, క్షమించండి. ఆదుష్టప్రాతకి నవ్వేను—మరేంగాదు.

రామ—దుష్టంటే దుష్టా! గాడిద!

లుబ్ధా—మీరొహ, పెద్దగాడిదని కూడా తెమ్మన్నారని కాబోలు రాశాడండీ.

రామ—లేదు, లేదు, గాడిదెమాట వుత్తరంలో యెక్కడా లేదు.

లుబ్ధా—వుంది నేను చదివానండీ గాడిదనెందుకు తెమ్మన్నావయ్యా నానెత్తి మీదకి?

రామ—నీకు మతిపోతూందా యేమిటి? గాడిదమాట లేదంటూంటే నే? (మధురవాణి తిరిగీ నవ్వుచుండును) నీక్కూడా మతిపోయిందా? ఎందుకానవ్వు? నన్ను చూశా? అవుధాన్లును చూశా?

మధు—యెందుకు ఆఅనుమానం?—సామెత—వుంది.

రామ—యేమిటా సామెత గీమితాను?

మధు—గాడిద అందిట—పాటకి నేను—అందానికి మాఅప్పా—అందిట—

రామ—అంటే?

మధు—పెళ్ళికి గాడిద—లొటిపిటామాట—యిన్నాళ్ళకి - మళ్ళీ విన్నానుగదా అని.

రామ—వింటే?

మధు—నవ్వొచ్చింది. మీరు కూడా నవ్వరాదూ? యెందుకీ దెబ్బలాట?

రామ—వీడిమీద డామేజి దావా వెంటనే పడేస్తాను.

మధు—(లుబ్ధావధాన్లుతో) బావా, యెందుకు మాపంతులు గారిమీద అన్యాయంగా అనుమానం పడతారు? ఆయన నిజంగా మిమ్మల్ని అన్నగార్లా భావించుకుంటు న్నారు గిరీశంగారు పంతులుమీద వ్రాయడానికి కారణాంతరం ఉన్నది. మీతో చెప్పవలసిన సంగతికాదు గాని, మీఉభయులకూ స్నేహం చెడడానికి సిద్ధంగా ఉన్నప్పుడు చెప్పకతీరదు. మీగిరీశంగారు నాకు కొన్నాళ్ళు యింగ్లీషు చెప్పే వారు, కొద్దిరోజులు నన్ను ఉంచుకున్నారు. మాపంతులుగారు ఆయనదగ్గిరనుంచి

నన్ను తీసుకువెళ్ళిపోయి వచ్చినాక నా దుఃఖంచేత లేనిపోనిమాటలు కల్పించి "నక్కా గిక్కా" అని ప్రేలారుగాని, ఆబొల్లిమాటలు నమ్మకండి.

రామ—"నక్కా గిక్కా" వొట్టినే పోతుందనుకున్నావాయేమిటి? డామేజిదావా పడ్డతరవాత దానిసంగతి తెలుస్తుంది.

మధు—బావా, మరోకమాట ఆలోచించండీ. పంతులుకేం లాభం యేనుగులూ, లొటిపిటలూ—(నవ్వును)

రామ—మనిషివికావాయేమి? గాడిదెమాట లేవంటూంటేనే?

మధు—పోనియ్యండి. మీకెందుకు కోపం; గాడిదెలు లేకపోతే కడంవ్వే ఆయెను. యివన్నీ మీయింటిమీద పడి తింటే మాపంతులుగారికి యేం లాభం? చెప్పండీ. ఒకవేళ రాతలుబేరం జరుగుతుంది గనక పోలిశెట్టికి లాభించవచ్చును.

లుబ్ధా—బాగా చెప్పావు—పోలిశెట్టి చేసినపనే!

రామ—చవగ్గా వేస్తాడని ఖుష్పవెచ్చం కోమటాడిమీద పెట్టావు. అనుభవించు.

మధు—ఇప్పుడు మించిపోయినదేమి? పెళ్ళికూతుర్ని పంపిస్తే పది రూపాయలు ఖర్చుతో యిక్కడ మడిపెట్టేస్తాం. మీరెవరూ రావద్దని, మీమావంగారి పేర ఉత్తరం వ్రాయండి.

లుబ్ధా—మా ప్రశస్తమైన ఆలోచన చెప్పావు. మావంగారూ మధురం మా బుద్ధిమంతురాలు.

రామ—అదుగో! "మధురం గిధురం" అని మీరు అనకూడదు. "మధురవాణి" అనాలి.

లుబ్ధా—పొరపాటు—గాని తీరామోసి వాళ్ళు పెళ్ళికూతుర్ని ఒక్కర్తినీ పంపించేస్తే?

మధు—మరేం మీతీపు దిగదీసింది? పెళ్ళి చేసుకోండి.

లుబ్ధా—నాప్రాణంపోతే యీసంబంధం చేసుకోను. ఆవుత్తరం కాసకూ చదివితే అభావచేష్టలు మీకే బోధపడతాయి.

మధు—చదవడం మానేసి యేమిటి ఆలోచిస్తున్నారు?

రామ—గిరీశంగాడిమీద పరువునష్టానికి డామేజి దావా తేకమాన్ను—వాడిమొహంలాగే ఉంది వుత్తరం చదివేదేవిటి.

లుబ్ధా—మావెన్నల నాపరువుమాత్రం యేమైనా వుంచాడనా? అయిన తరవాయి చదవండీ.

రామ—(చదువును) తౌజాకలం, చిన్నది. బహులక్షణంగా వుంటుందిగాని కొంచం పెయ్యనాకినమాత్రం కద్దు. అద్దానిని మనవారు వైధవ్యహేతువ అంద్రు. యిది నట్టి నాన్స—సూపర్—స్టి—షన్—అనగా, తెలివితక్కువ నమ్మకం,

మనవంటి ప్రాజ్ఞులు లెక్కించవలసినది కాదు. షరా—దీనికి వక చిన్న బైరాగీ చిటికీ వున్నది. చిమ్మటతో పెయ్యా నాకుడు వెండ్రుక లూడబీకి, ఒక పౌ—, పౌడర్—అనగా గుండ కద్దు; ఆగుండ ప్రామినచో మరల పెయ్యా నాకుడు పుట్ట నేరదు. ఈలాగా దైవాత్తూ వైధవ్యంబే ప్రాప్తించినచో, పదేపదే క్షౌరంబౌను. గావున పెయ్యానాకుడు బాధించ నేరదు. రెండవ నెంబరు షరా—ఒకవేళ వైధవ్యం తటస్థించినా మావపినెగారు జుత్తు పెంచుక నేరుతేల, మీరేం చెయ్యగలరు; నేనేం జెయ్యగలను ?

మధు—చాల్చాలు; యీపాటికి చాలించండి. గిరీశంగారు యేం తుంటరి ?

రామ—యిప్పుడైనా వాడినైజం నీకు బోధపడ్డదా ? (చదువుచు) మూడవ షరా—యీరోజుల్లో స్త్రీపునర్వివాహం గడబిడలావుగ నున్నది. తమకు విశదమే మీరు స్వర్గంబునకుం బోయి ఇంద్రభోగంబు లనుభవించుచుండ నామెకు పునర్వివాహము చేసికొన బుద్ధి పొడమవచ్చును. అదిమాత్రం నేను ఆపజాలనని స్పష్టముగా తెలియం బడి. ఏలననిన? వద్దని మందలించుటకు ఎవట పడితినో, "మీయన్న స్వర్గంబున రంభతో పరమానందంబు నొందుచు నున్నాడుకదా. నాగతేమి" యని యడిగినచో నేమి యుత్తరమీయువాడ ?

మధు—మరి చాలించండి.

రామ—నీయిష్టం వొచ్చినప్పుడు చదివి, నీయిష్టం వొచ్చినప్పుడు మానేస్తానను కున్నావా ? (చదువును)

నాల్గవ షరా—కొదువ కొన్ని హంశములూ బహుబాగా ఉన్నవి. తప్పకుండా యీ సంబంధం మీరు చేసుకోవలసిందే. మీఅత్తగారు సాక్షాత్తూ అరుంధతివంటివారు. మనలో మనమాట, ఆమెకు యీసంబంధం యెంతమాత్రమూ యిష్టములేదు. పుస్తె కట్టేసమయమందు, మీ యింటినూతులో పడి ప్రాణత్యాగం చేసుకుంటానని, యిరుగుపొరుగమ్మలతో అంటున్నారు. కాని ఫర్వాలేదు. ఆనాలుగు గడియలూ, కాళ్ళూ, చేతులూ, కట్టేద్దాం. మూడుముళ్ళూ పడ్డతర్వాత నూతులో పడితే పడ నియ్యండి. మనసొమ్మేం బోయింది. పోలీసువాళ్ళ చిక్కులేకుండా మాత్రం వాళ్ళ కేమైనా పారేసి వాళ్ళని కట్టుకోవలసివస్తుంది. యీసంగతులు యావత్తూ మీ మేలుకోరి వ్రాసితిని. యిక్కడ వారికి తెలియదు. మరిచిపోయినాను. పిల్ల జాతకం అత్యుత్కృష్టంగా ఉందట. ఆబనాయింపు కూడా రామ_"

మధు—రామ ?

రామ—అది ఆడవాళ్ళు వినవలసిన మాటకాదు.

లుబ్ధా—అది కూడా మీరే బనాయించారంటా డేవిటండీ ?

రామ—వాడి నోటికి నువ్వే బద్ధంవుంచీ! ఆమేజీ పడితేగాని కట్టడు.

లు—కొంచం అయినా నిజం ఉండక పోతుందా, అని నాభయం. అత్తవారికి ఇష్టం లేదని పోలిశెట్టి కూడా చెప్పాడు. యీసంబంధానికి వేయివేల దణ్ణాలు; నాకొద్దు బాబూ.

మధు—బాగా అన్నారు. మీసంబంధం మాకు యెంతమాత్రం వొద్దని, మీమావఁగారి పేర వ్రాయండి. కాకితం కలం తేనా?

లు—మావాఁ! మరి ముందూ వెనకా ఆలోచించక వెంటనే ఉత్తరం రాసిపెట్టండీ.
(నిలబడి మధురవాణి చెవిలో రహస్యము మాట్లాడును; మధురవాణి లుబ్ధావధాన్లు చెవిలో మాట్లాడును)

రామ—మొహంమీద మొహంపెట్టి, యేవిఁటాగుసగుసలు!

పైనుంచి పోస్టుజవాను—"లుబ్ధావుధాన్లుగా రున్నారండి. వుత్తరం వొచ్చింది."

(మధురవాణి పైకివెళ్లి వుత్తరము తెచ్చి లుబ్ధావుధాన్లు చేతికి యిచ్చును. లుబ్ధావధాన్లు రామప్పంతులు చేతికి యిచ్చును.)

లు—సులోచనాలు తేలేదు. మీరే చదవండి.

రామ—(తనలో చదువుతూ) మరేవిఁ! చిక్కే వొదిలిపోయింది. మీమావఁగారి దగ్గిర్నించి.

లు—యేవఁని! యేనుగులూ, లొటిపిటలూ తేనంటాడా యేవిఁటండి!

రామ—మీసంబంధవేఁ అక్కర్లేదట.

లు—యేవిఁటి? యెంచేతనో! వాడికా అక్కర్లేదు! నాకా అక్కర్లేదు. తన పరువుకి నేం తగాను కానో!

మధు—నిమిషంకిందట పెళ్ళివొద్దన్నారే! ఇప్పుడు పెళ్ళి తప్పిపోయిందనికోపవాఁ!

లు—యింకా యేం కూస్తాడో చెప్పండీ.

రామ—మీరు పిసినిగొట్టని యెవరో చెప్పారట.

లు—నేనా పిసినిగొట్టుని? ఒక్కపాటున పద్దెనిమిది వొందలు యేపిసినిగొట్టు పోస్తాడు? యింతసొమ్ము యెన్నడైనా, ఒక్కసారి అగ్నిహోత్రావుధాన్లు కళ్ళలో చూశాడా? సంసారం పొదుపుగా చేసుకుంటే పిసినిగొట్లా? వాడిసొమ్ము వాడినెత్తిని కొట్టినతరవాత, నేనెలాంటివాణ్ణి అయితే వాడికేం కావాలి?

మధు—యెలాంటివాళ్ళేం? బంగారంలా వున్నారు?

రామ—మీరు ముసలివాళ్ళనీ, మీకు క్షయరోగం వుందనీకూడా యెవరో చెప్పేరట.

లు—నేను ముసలివాణ్ణా వీడి సిగ తరగా! యాభైయేళ్ళకే ముసలిటండీ? కొంచం దగ్గు వుండడవేఁ కాగట్టండి (దగ్గును) నిలివెడు ధనం పోసి పిల్లని కొనుక్కున్నతరవాత, మరి దానిఘోషా, నాఘోషా వాడి కెందుకయ్యా? డబ్బుచ్చుకున్నతరవాత చచ్చినశవానికైనా కట్టకతీరదు. మాట్లాడేం?

రామ—అవును; నిజమే. మీరు ముసలివాళ్లైతేనూత్రం?

లు—అదుగో 'ఐతేమాత్రం' అంటారేమిటి? నుక్వే పెట్టేవు కాబోలు యీ పెంటం తాను.

రాను—అన్ని పెంటలు పెట్టడానికి మీతమ్ముడు గిరీశం అక్కడే ఉన్నాడుకదూ?

లు—వీడు, అక్కడెలా పోగయినాడయ్యా నాకు శనిలాగ?

మధు—ఏమి! యీ మొగవారిచిత్రం! యింతసేపూ పెళ్ళివొద్దని వగిస్తిరి; యిప్పుడు పెళ్ళి తేలిపోయిందని వగుస్తున్నారు. నిజంగా మీకు పెళ్ళాడాలని వుందండీ?

లు—వుంటే వుంది, లేకపోతే లేదు గాని యీ దుర్భాషలు నేను పడి వూరు కుంటానా?

మధు—మరేం జేస్తారు?

రామ—యేంజేస్తారా? నామీజీకి దావా తెస్తారు.

లు—దావా వొద్దు, నీపుణ్యం వుంటుంది. వూరుకో బాబూ.

రామ—కాకపోతే యింతకన్న చవకైనదీ, సాంప్రదాయమైనదీ, సంబంధం కుదిర్చి, చేసుకున్నావంటే అగ్నిహోత్రావుధాన్లుని చెప్పుచ్చుకు కొట్టినట్టు ఉంటుంది.

లు—చవగ్గా కుదరడమెలాగ?

మధు—నామాట విని పెళ్ళి మానేసి వూరుకోండి.

లు—యేం? ముసలివాణ్ణని నీకూ తోచిందా? యేమిటి?

మధు—మీకా ముసలివాళ్ళు? యెవరా అన్నవారు?

లు—నీకున్న బుద్ధి ఆఅగ్నిహోత్రావుధాన్లుకి వుంటే బాగుండును.

మధు—ఓపన్ను కదిలిందా? కన్నుకు దృష్టితగ్గిందా? చూడండి మీదండలు కమ్మెచ్చులు తీసినట్టు యెలా ఉన్నాయో?

రామ—(తనదండలు చూసుకొని) మావి పెకట్లో గొప్పు తవ్వడం నుంచి దండలు మోటుగా వున్నాయి; గాని నాదండలు సన్నవైనా ఉక్కుఖడ్డీలు.

మధు—(తన చీరకొంగుతో లుబ్ధావధాన్లుఛాతీ కొలిచి) యేంఛాతీ!

రామ—యేమిటే వాళ్ళకం?

మధు—ఉత్తరం మీలో మీరు చదువుకుంటారేం? పైకి చదవండి.

రామ—నువ్వు నన్ను ఆజ్ఞాపించే పాటిదానవా? మేం చదువుకుంటాం. ఇవి ఆడ వాళ్ళు వినవలసిన మాటలు కావు. నువ్వు అవతలకి వెళ్ళు.

మధు—నేను కదలను.

రామ—అమాంతంగా యెత్తుకెళ్లి వెనకింట్లో కుదేస్తాను.

మధు—(కుర్చీవెనకను నిలబడి లుబ్ధావుధాన్లు దండలు చేతులతో గట్టిగా పట్టుకుని) మార్కండేయులు శివుణ్ణి చుట్టుకున్నట్లు, బావగార్ని చుట్టుకుంటాను. యెలా లాక్కువెళతారో చూస్తాను.

లు—(తనలో) యేమి మృదువూ చేతులు! తల, తలదగ్గిర చేరిస్తే. యేమి ఘుమఘుమా (పైకి) "బాలాదపి సుభాషితం" అన్నాడు మావఁగారూ. మధురవాణిన్ని వుణ్నియ్యండి. మంచి బుద్ధిమంతురాలు. నిజం కనిపెడుతుంది.

రామ—అయితే మరి పను (చదువును) మీకొమార్తె ప్రవర్తన బాగా వుండక పోవడం చేత విస్మృతిన్ని వెతేకారని లోకంలో వార్త గట్టిగా ఉన్నది.

లు—(కొంతతడవు వూరుకుని) నువ్వే నాకొంప తీశావు.

మధు—ఏంతులేనా?

లు—ఓహార్ని అనవసిన పనేవుంది?

మధు—(కొంతతడవు వూరుకొని) నేను మీయింటికి వెళ్ళిపోవస్తాను. రండి. పెళ్ళిగిళ్ళీ మానెయ్యండి. మీకు పెళ్ళాంకన్న యెక్కువగా సంరక్షణ చేస్తాను.

లు—(ఆనందం కనపరుస్తూ ఓదగాణ్ణి) నేను డబ్బివ్వగలనే? నీలాంటి విలవైన వస్తువను పంతులుగారే భరించాలి.

మధు—నాకు డబ్బక్కర్లేదు, తిండి పెడతారా?

లు—ఆహా! అందుక లోపమా!

మధు—ఏమి పడండి మరి యీ పంతులుగారి మాట మాటలు వినక పెళ్ళి మానేసి, సుఖంగా యింట్లో కూచుందురుగాని.

రామ—(మధురవాణివైపు తీక్ష్ణముగా చూసి) నువ్వు భోజనం చెయ్యలేదన్నమాట జ్ఞాపకం వుందా? వెళ్ళు.

మధు—మీ చర్య చూస్తేనే కడుపు నిండుతుంది. (ఛఱ్ఱుమని యింటిలోనికి పోవును.)

లు—యీమధురవాణి, విన్నారా! మావాఁ! వేశ్యయినా! చాలా తెలిసినమనిషి. మనసంపార్లకి దానికి ఉన్న బుద్ధి వుంటేబతికిపోదుం.

రామ—అవునను. బుద్ధిమంతురాలే, గాని వొళ్ళెరగని కోపం యేమైనా వెట్టి అనుమానం పుట్టితే తనూపై దానకు. ముఖాన మావాఁ, మీలాంటి శిష్టులు శరీరం తాళకూడదు. అది చిన్నతనంచేత మొఖంమీద మొఖంపెడితే. "పిల్లా యడంగా నిలపడి మాట్లాడు" అని చప్పాలి ఒక్కటే వొచ్చింది దీనికి దుర్గుణం పరాయివాళ్ళతో మాట్లాడితేగాని దానికి తోచదు. పట్ణవాసంలో వుండడంనించి ఆ దురలవాటు అబ్బింది.

లు—చిన్నతనంగదా! మధురవాణి నాపిల్లలాంటిది. ముట్టుగుంటే అదో తప్పుగా భావించకండి.

రామ—నీసొమ్మేంబోయింది! అదికాదు. చూశారా మావాఁ వుంచుకున్న ముండా కొడుకు యెదట మగోమొకాణ్ణి పట్టుకుని "వీడి దండలు కమ్మెచ్చులు తీసినట్టున్నాయి. వీడిఛాతీ భారీగా ఉంది"—అని అని చెవిలో నోరుపెట్టి గుసగుసలాడుతూంటే అగ్గెత్తుకొస్తుందా రాదా?

లు — పొరపాటు. లెంపలు వాయించుకుంటాను. క్షమించండి.

రామ — మీ లెంపలు వాయించుకుంటే కార్యంలేదు. దాని లెంపలు వాయించాలి. మీమీద దానికి కొంచం యిష్టం వున్నట్టుంది. గట్టిగా బుద్ధిచెప్పండి.

లు — నామీద యిష్టంవేఁవిఁటి మావాఁ! యెక్కడైనా కద్దా?

రామ — మీయింటికి వెళ్ళిపోయొస్తానంటూంది? మరి తీసికెళ్ళు.

(పై మాటలాడుచుండగా మధురవాణి పట్టుచీర కట్టుకుని ప్రవేశించి)

మధు — ఆలాగే తీసికెళ్తారు. మీకు భారమైతేను. ఆమహానుభావుడికి చాకిరీ చేస్తే పరంపైనా ఉంటుంది.

లు — మామగారు హాస్యానికంటున్నారుగాని, నన్నొదుల్తారా? నేతగను, తగను.

రామ — అలాగడ్డి పెట్టండి!

మధు — ఆయన హాస్యానికి అంటున్నా, నేను నిజానికే అంటున్నాను. గడ్డి గాడిదలు తింటాయి; మనుష్యులు తినరు.

రామ — అదుగో మళ్ళీ గాడిదలంటుంది! (మధురవాణి నవ్వు దాచుటకు ముఖం తిప్పికొని, లోగుమ్మము దాటి, విరగబడి నవ్వును.)

లు — మధురవాణికి మీదగ్గిర భయం భక్తీ కూడా కద్దు.

రామ — ఉంది. కోపవొస్తే గడ్డిపరకం తఖాతరీ చెయ్యదు. పరాయిమనిషి ఉన్నాడని అయినా కానదు.

లు — పెళ్ళిప్రయత్నం యిక మానుకోవడవేఁ ఉత్తమం అని తోస్తుంది. యేవిఁటి తమ శెలవు?

రామ — నాశెలవేం యేడిసింది! పెళ్ళిచేసుకోవొద్దని మధురవాణి శెలవైంది కాని బుద్ధికి ఆనందించి అలా నడుచుకుంటున్నారు. స్త్రీబుద్ధిః ప్రళయాంతకః అని చెప్పనే చెప్పాను.

లు — మీరు అప్పులనేగలా మీసలహాకి వొచ్చాను. మధురవాణి చెప్పిందనా పెళ్ళి వద్దంటున్నాను. తప్పిన పెళ్ళి తప్పిపోయింది ఖర్చులు కూడొచ్చాయి గదా అని సంతోషిస్తున్నాను.

రామ — రెడ్డొచ్చాడు మొదలాడన్నాడట. సాధకబాధకాలు యెన్ని పర్యాయములు చెప్పినా అవి అన్నీ పూర్వపక్షంచి, నుక్తాయింపు మళ్ళీ డబ్బు ఖర్చుమీదికి వొస్తూవుంటుంది. పెళ్ళిచేసుకోని కడుపుకలిస్తే మీయిల్లు పదియిళ్ళౌతుంది. పెళ్ళి చేసుకోక గుటుక్కుమంటే ఈకష్టపడి ఆర్జించిన డబ్బంతా యెవడి పాలు కాను?

లు — అదుగో యేమో యెక్కువ వగనం ఉన్నట్టు శెలవిస్తారు నాకేవుంది?

రామ—ఉన్నంతసేపుంటె పరానికి యిన్నినీళ్ళు [illegible] వొదిలేవాడుండాలా?

లు—అలా అయితే, తమరెందుకు పెళ్ళిచేసుకున్నారు కారా?

రామ—నేను పిత్రార్జితం అంతా కరరావుకు మట్టేశాను. యిక పరానికా శాక్తేయుణ్ణి. యోగసాధనలు చేస్తాను. నాకు మరి కర్మతో పనిలేదు. లోకంకోసం తద్దినాలు పెడుతున్నాను. అయితే సానిదాన్ని యెందుకు వుంచుకున్నావయ్యా! అని అడగగలరు.

"కామి గాక మోక్షకామి కాడు" అన్నాడు. యిక మీసంగతో? మీరు నిద్రపోతూండగా చూసి యెప్పుడో ఒకనాడు మీనాక్షి అపాతు యెక్కడీసి రంకుమొగుణ్ణి తీసుకుపారిపోతుంది. ఆపైని దరిద్రదేవత మిమ్మల్ని పెళ్ళాడుతుంది.

లు—అయితే యేం జేయమంటారు?

రామ—మీరు పునః ప్రయత్నం చేసి పెళ్ళాడండి. పెళ్ళాం భయం చేత మీనాక్షి ఆటకట్టుతుంది. మీనాక్షి భయం చేత మీపెళ్ళాం కట్టుగా ఉంటుంది. అవునంటారా? కాదంటారా?

లు—నిజమైనమాటే.

రామ—నిజమైతే నేం? మీకు వొహపరాకు. సాధకబాధకాలు అడుగడుక్కీ జ్ఞాపకం చేస్తూండాలి. మీకు జాతకరీత్యా, వివాహం జరక్కపోతే, మార్కం ఉందన్న మాట పరాకు పడ్డారా?

లు—పరాకులేదు, గాని యిన్నాళ్ళాయి కొట్టుకుంటూంటే, యీనాటికి పద్దెనిమిది వొందలకి, వక సంబంధం కుదిరి, తీరా క్రియాకాలానికి తేలిపోయిందిగదా? యిప్పుడు చవగ్గా మనకి సంబంధం కుదురుతుందా? కుదరదు. కుదరదు.

రామ—నిన్న వొచ్చాడయ్యా, గుంటూరునించి వక బ్రాహ్మడూ; వున్నాడో వెళ్ళిపోయినాడో?

లు—సంబంధానికా?

రామ—అవును. యెంతబుద్ధితక్కువపనిచేశానూ! నా యెరికని యెక్కడైనా సంబంధం వుందా అని అతకాడు అడిగితే లేదని చెప్పేను. యీ సంబంధం తప్పిపోతుందని నేనేం కలగన్నానా యేవిఁటి? అతడు జటాంత స్వాధ్యాయిన్నీ వుంచి సాంప్రదాయమైన కుటుంబీకుడున్నూ. ఆసంబంధం చేస్తే అగ్నిహోత్రావధాన్లుని చెప్పుచ్చుకు కొట్టినట్టౌను.

లు—బేరం యేం చెప్పేడు?

రామ—బేరం మహాచవకయ్యా. అదే విచారిస్తున్నాను. అతగాడు గుంటూరునుంచి వస్తున్నాడు. అక్కడిరాళ్ళకి, మనదేశపు కొంపలమ్ముకునే బేరాలతాపీ యింకా తెలియలేదు. అందుచేత నందిపిల్లిలో పన్నెండువందలకిసంబంధం కుదుర్చుకున్నాడు.

వ్యవధిగాగాని పెళ్ళికొడుకువారు రూపాయలు యివ్వలేమన్నారట. ఆబ్రాహ్మ
డికి ఋణాలున్నాయి. వాయిదానాటికి రూపాయలు చెల్లకపోతే దావా పడిపో
తుందని యెక్కడయినా పిల్లని అంటగట్టడానికి వ్యాపకం చేస్తున్నాడు. ఒకటి
రెండు స్థలాల్లో వెయ్యేసి రూపాయలకి బేరం వొచ్చిందిట. పన్నెండు వందలికి
గాని యివ్వనని చెప్పేడు.

లు—మరొక్కవొందె వేదాం మనం?

రామ—ఆతగాడు వుంటేనా, నూరు వేయడానికి యాభై వేయడానికినీ?

లు—కనుక్కుండుకూ మీకు పుణ్యం వుంటుంది. యెక్కడ బసో?

రామ—దాని సిగగోసినడబ్బు, డబ్బుమాట అల్లావుణ్ణీండిగాని, ఆపిల్ల యేమి యేపు
యేమి ఐశ్వర్యలక్షణాలు! ధనరేఖ జెత్తిపోతులావుంది. సంతానరేఖలు స్ఫుటంగా
వున్నాయి. పిల్ల దివ్యసుందరవిగ్రహం.

[మధురవాణి ప్రవేశించును]

మధు—గ్రహవేఁవిఁటి?

రామ—గ్రహవేఁవిఁటా? అవుధాన్లుగారి గ్రహస్థితి చూస్తున్నాం. జాతకరీత్యా యీ
సంవత్సరంలో వివాహం కాకతప్పదు.

మధు—మీమాట నేను నమ్మను? (అవుధాన్లు దగ్గిరకు వెళ్ళి ముఖంయదట ముఖం
వుంచి) ఆమాట నిజమా.

లు—అంతా నిజం అంటున్నారు.

మధు—సిద్ధాంతిగారేవఁన్నారు?

లు—జాతకం చూసిన సిద్ధాంతల్లా ఆమాటే అంటున్నాడు. ఇదివరకల్లా నాజాతకం
మాగట్టి దాఖలా యిస్తూంది. ఒక్కటీ తప్పిపోలేదు.

మధు—అయితే మీప్రారబ్ధం. ఆ వెయ్యనాకుడు పిల్లనిమాత్రం యీపంతులు మాయ
మాటలు విని చేసుకోకండి.

రామ—భోంచేస్తూ వొచ్చావు యేం పుట్టి మునిగిపోయిందని?

మధు—వెండిగిన్నెకోసం వొచ్చాను.

రామ—తీసుకెళ్ళు. (మధురవాణి నిష్క్రమించును)

లు—పెళ్ళిచేసుకోవద్దంటుందేవఁండీ?

రామ—నిమ్మళంగా మాట్లాడండి సానిదియెక్కడైనా పెళ్ళిచేసుకోమంటుందయ్యా?
నీమీద కన్నేసింది.

లు—నామీద కన్నెయ్యడవేఁవిఁటి మావఁగారూ! యవరు విన్నా నవ్వుతారు.

రామ—మీరుగాని పెళ్ళిచేసుకోవడం మానేస్తే మీయింట్లోవొచ్చి బయిఠాయిస్తుంది.
అది ఘంటాపథంగా చెబుతూవుంటే చెవుల్లేవా యేవిఁటి మీకు? దానితో మీరె

వేఁయినా వెఱ్ఱివెఱ్ఱిచేష్టలు చేశారంటే మీకూ నాకూ పడుతుంది గట్టిరంధి. జాగ్ర
తెరిగి మసులుకోండి.

లు — నేనా? నేనా? యేవిఁటి అలా శెలవిస్తున్నారు మావాఁ! నాపిల్ల ఒకటి అది వొకటినా? ఆ గుంటూరు శాస్తుల్లు ఉన్నాడో, వెళ్ళాడో, ఒక్కమాటు కనుక్కోలేరు?

రామ — యదటింట్లోనే బసచేశాడు కనుక్కుంటాను గాని, మధురవాణి భోజనం యేపాటి అయినదో చూసి మరీ వెళతాను. (లోపలికి వెళ్ళి వచ్చి పైకి వెళ్ళును)

లు — మధురవాణ్ణి తీసుకుపోతా ననుకుంటున్నాడు యీపంతులు అహా! హ! (పొడుము పీల్చి) మనిషికి మనిషికి తారతమ్యం సొంటే కనిపెట్టాలి. పంతుల్లాగ మీసం వుంచుకుని, రంగు వేసుకుంటే, తిరిగీ యౌవ్వనం వొస్తుంది. యీచవక సంబంధం కుదిరినట్టాయనా యేమి అదృష్టవంతుణ్ణి.

రామప్పంతులు స్త్రీవేషముతో నున్న శిష్యుణ్ణి రెక్కపట్టుకు
తీసుకువచ్చును. అరచెయ్యి చూపించి)

రామ — మావాఁ! యేం ఖోదా కొట్టుకొచ్చిందోయి నీకు! యిదిగో ధనరేఖ. చెయ్యి కొనమట్టి రెండోపక్కకి యెగబాకినట్టుకదోయి, యివిగో సంతానరేఖలు. కంఠం దగ్గిర చూశావా హారరేఖలు?

లు — అట్టే పరిశీలన అక్కర్లేదు చాల్లెండి.

(పైప్రసంగము జరుగుచుండగా మధురవాణి వెనకపాటున వచ్చి పంతులు నెత్తిమీద
చెంబుతో నీళ్ళు కుమ్మరించును.)

రామ — యేమిటీ బేహద్బ!

మధు — మంగళస్నానాలు (శిష్యుడి గెడ్డం చేతనొక్కి) నీకు సిగ్గులేదే లంజా?

(మధురవాణి నిష్క్రమించును)

రామ — కోపవొఁస్తే మరివొళ్ళెరగదు యీ కొరకంచో చీపురుగట్టో పట్టుకు వెంట దరువుతుంది. యీపిల్లని తీసుకు పారిపోదాం రండి.

(శిష్యుడి చెయ్యిపట్టుకుని పైకి నడుచును.)

లు — నడుస్తుంది. రెక్కవొదిలెయ్యండి.

రామ — (రెక్క వొదిలి) ఓహో, కాబోయే యిల్లాలనా?

[ముగ్గురూ నిష్క్రమించి. వీధిలో ప్రవేశింతురు]

లు — యీపిల్లని చేసుకోమని మీ అభిప్రాయవేఁనా?

రామ — నా అభిప్రాయంతో యేంకార్యం? మీ మనస్సమాధానం చూసుకోండి. పిల్ల యేపు గావుందా? రూపురేఖావిలాసాలు బాగున్నాయా? అని చూసుకోండి.

లు — సంసార్లకి సౌందర్యంతో యేఁపని?

(సిద్ధాంతి తొందరగా యెదురుగుండా వస్తూ ప్రవేశించి)

సిద్ధాం—(లుబ్ధావధాన్లతో) యవరు మావాఁ యీపిల ? లుబ్ధావుధాన్లుజవాబు చెప్పక, రామప్పంతులువైపు బుఱ్ఱతిప్పి సౌజ్ఞ చేయును.)

రామ—మావాళ్ళే.

సిద్ధా—(నిదానించి) భాగ్యలక్షణాలేంబట్టాయి యీపిల్లకి !

రామ—యేవిఁటండి ?

సిద్ధా—విశాలమైఁన నేత్రాలూ, ఆకర్ణాలూ, ఆవుంగరాలజుత్తూ, విన్నారా! యేదమ్మా చెయ్యి (చెయ్యిచూసి) యేఅదృష్టవంతుడు యీపిల్లని పెళ్ళాడాడోగాని—

రామ—యింకా పెళ్ళి కాలేదండి.

సిద్ధా—మీరు పెళ్ళిచేసుకోవాలని వుంటే యింతకన్నా అయినాతనం, అయిశ్వర్యం, సిరి, సంపదాగల పిల్ల దొరకదు. యిది సౌభాగ్యరేఖ, యిది ధనరేఖ, పంతులూ బోషాణప్పెట్టెకు వెంటనే పురమాయించండి. యేది తల్లీ చెయితిప్పూ, సంతానం వకటి, రెండు, మూడు, చెయ్యివొదిలి (లుబ్ధావధాన్లతో) యెదీ మావాఁ పొడిపి సరు (పొడుంపీల్చి) పోలిశెట్టి కూతురు ప్రసవం అవుతూంది జాతకం రాయాలి. మళ్ళీ దర్శనంచేస్తాను.

రామ—వక్కమాట (సిద్ధాంతితో రహస్యంగా మాట్లాడును. సిద్ధాంతి చంకలో పంచాంగం తీసి, చూచును. మరి నాలుగు మాటలాడి పంచాంగం చంకలో పెట్టుకుని తొందరగా వెళ్లిపోవును.)

లు—యేవంటాడు ?

రామ—నేనే యీపిల్లని పెళ్ళిచేసుకుంటాననుకుంటున్నాడు, రేపటిత్రయోదశినాడు పెళ్ళికి మంచిది అన్నాడు.

లు—ఆరోజు వివాహముహూర్తం లేదే ?

రామ—శుభస్య శీఘ్రం అన్నాడు. ద్వితీయానికి అంత ముహూర్తం చూడవలసిన అవసరం లేదు. తిథీ నక్షత్రం బాగుంటే చాలును. యిదిగో మీమావఁగారు వొస్తున్నారు;

లు—బేరవాఁడి చూడండి.

[కరటకశాస్త్రుల్లు ప్రవేశించును.]

కరట—గంగాజలం సిరన్నసన పోసుకున్నారా యేవిఁటి పంతులుగారూ ? మాపిల్లని యెక్కడికి తీసికెళుతున్నారు ?

రామ—(కరటకశాస్త్రితో) మాట.

[ఇద్దరూ రహస్యముగా మాటలాడుదురు]

రామ—(లుబ్ధావధాన్లును యెడంగాతీసికెళ్ళి) పద్నాలుగు వొందలు తెమ్మంటున్నాడు యెవళ్ళో పదమూడు యిస్తావన్నారట.

లు—యిదా మీరు నాకు చేసినసాయం ? పోనియ్యండి, ఆపన్నెండుకైన తగలెట్టండి.

రామ—ఉపకారానికి పోతే నాకానిష్టూరం ? కోరి అడిగితే కొమ్మెక్కుతారు, యేం జెయ్యను. (కరటకశాస్త్రిలో రహస్యంగామాట్లాడి, తిరిగివచ్చి లుబ్ధావధాన్లుతో) మావాఁ కృత్యాదవస్థమీద వొప్పించాను. పిల్లదానికి సరుకు పెడితేగాని వల్లలేదని భీష్మించుకుని కూచున్నాడు. యేవఁంటావు ?

లు—అది నావల్లకాదు.

రామ—ఊరుకోవయ్యా, అలాగే అందూ, మధురవాణి తాలుకు కంటె తెచ్చి ఆవేళకి పెట్టి తరవాత తీసుకుపోతాను.

లు—ఆదేదో మీరే చూసుకోండి.

రామ—నేనే చూసుకుంటాను. ఖర్చువెచ్చాలేవో మనవేఁ చేసుకుని. కొంచంలో డబడబలాడించేదాం. పోలిశెట్టిని సప్లయికి పెట్టకండి. పెద్దపాలెంవెళ్ళి లౌక్యుల్ని యెవరు పిలవడం ?

లు—మరి నాకెవరున్నారు. మీరే పిలవాలి.

రామ—లౌక్యుల్ని పిలవడానికి వెళ్ళినప్పుడు దుస్తు డాబుగా ఉండాలి. దగలా గీగలా తీయించి యెండవేయిస్తాను.

(నిష్క్రమింతురు)

## ౨-వ స్థలము : లుబ్ధావధాన్లు యిల్లు.

లు—అవును. మీరు చెప్పిన బాగుంది దివ్యస్థలాల్లో ఏకరాత్రి వివాహాచారం వుంది.

కరట—పెద్దపెద్దఉద్యోగస్థులుకూడా యిప్పటిరోజులలో, వివాహాలు అలాగే చేస్తున్నారు. కోదండ రామస్వామివారు స్వయంవ్యక్తవూఁ. హనుమత్ప్రతిష్ఠా అయినప్పుడు, దివ్యస్థలం కాదని యెవడనగలడు ?

లు—ఆమాట సత్యవేఁ గాని, యిది దివ్యస్థలంగా ఆలోచించి ఇదివరకు యెవళ్ళూ యిక్కడ, ఏకరాత్రవివాహం చేసివుండలేదు మానఁగారూ. మనం చేస్తే యేవఁంటారో ?

కరట—దివ్యస్థలం అయినతరవాత యెవడేవఁంటే మనకేం పోయింది ?

లు—పంతులుతో చెబుదాం.

కరట — యేమిటి మీసత్యకాలం మూచఁగారూ! యీ పెళ్ళిలో యేదో వొక వొంటు బెట్టి నాలుగుడబ్బులు ఆర్జించుకుందామని చూస్తూవున్న పంతులూ పోలిశెట్టీ, ఏకరాత్రవివాహానికి ఆమోదిస్తారా? ప్రస్తక్తొచ్చాకా ఆమాట వాళ్ళతో చెప్పకండి.

లు — పంతులుతో చెప్పకపోతే యేం జట్టీ పెడతాడో?

కరట — యేమిటిభయం! అతగాడు మీకు యజమానా? జట్టీ, గిట్టీ పెడితే, పెణతూడ గొడతాను.

లు — మీరు కాదుగాని, సిద్ధాంతిగారి చేతిలో రెండు రూపాయలు పడేస్తే ఆపూచీ అంతా ఆయన నెత్తిమీద వేసుకుంటాడు. ఆయనయెదట పంతులు నోరు రొగియదు.

కరట — పావఁటిదానికి విసుగుడుంది. పంతులికుండదా?

(నిష్క్రమింతురు.)

## 3-వ స్థలము: లుబ్ధావధానులు యింటిపెరడు.

[కరటకశాస్త్రుల్లు, మీనాక్షి ప్రవేశింతురు.]

మీనాక్షి — మీపిల్లని నాకడుపులో పెట్టుకోనా తాతయ్యా!

కరట — కడుపుగదా అమ్మా! అంచేత పదేపదే చెబుతున్నాను. దానికి తల్లివైనా నువ్వే తండ్రివైనా నువ్వే. (దుఃఖమును అభినయించును.)

మీనా — విచారించకండి, తాతయ్యా, దానికి యేలోపం రానియ్యను.

కరట — అమ్మా నీకిమ్మని మాఅమ్మ చేతికి ఓపులిమొంగురు యిచ్చాను. పుచ్చుకో.

మీనా — యిస్తుంది. తొందరేమిటి, తాతయ్యా? నీదగ్గిరవుంటేఁ? నాదగ్గిరవుంటునేం?

[సిద్ధాంతి ప్రవేశించును.]

సిద్ధాంతి — యెంతసేపూ కూరలు తరగడం. భోజనాలసరంజాం జాగ్రత చెయ్యడం సందడేగాని, లగ్నానికి కావలసిన సరంజాం జాగ్రత చెయ్యడపు తొందరేమీ కానరాదు. నాశిష్యుడు మంగిపోతులాగ పడున్నాడు.

మీనా — నాలు గ్గడియల పొద్దులగ్గవైతే, యిప్పట్నుంచీ సరంజాం తొందరేమిటి అచ్చన్నమావాఁ!

సిద్ధాంతి — చదవేస్తే వున్నమతీపోయిందన్నాట్ట. నాలుగ్గడియల రాత్రుండవగా శుభముహూర్తం.

మీ — మానాన్న యెప్పుడూ యిదే మచ్చు. యేమాటా నిజం యింట్లో ముండలతో చెప్పకపోతే యెలా యేడుస్తారు? నాన్నా! నాన్నా!

[లుబ్ధావధాన్లు ప్రవేశించును]

లు—యెందుకా గావుకేకలు?

మీ—నాలుగ్ఘడియల రాత్రుండగానట ముహూర్తం అచ్చన్నమావఁ అంటున్నారు.

లు—యిదేవిఁటండోయి, నాలుగ్గడియల పొద్దు కనుక్కున్నానే ముహూర్తం?

సి—ముప్పైమూడు విఘడియలపొద్దు కనుక్కున్నారు కారా? మీ వెఱ్ఱులు చాలించి చప్పున కానియ్యండి మంగళస్నానాలు. ఊళ్లో బ్రాహ్మలినందర్నీ పిలిచేశాను.

లు—చంపారే! చలి!—అయితే రామప్పంతులు కూడా నాలుగ్ఘడియల పొద్దుకి రమ్మని పిలుస్తారేమో?

సి—శతాంధాః కూపం ప్రవిశంతి. అమ్మీ, పిల్లకి స్నానం చేయించూ.

మీ—యిదుగో, నిమిషంలో చేయిస్తాను.

సి—ఆడవాళ్ళు నయం. పెళ్ళిపందిట్లో సరంజాం చూసుకుంటారు.

లు—పంతులు లేకుండా లగ్నం అయితే.

సి—పంతులుకా, మీకా పెళ్ళి? జంకవోడః స్నానం కానీయండి.

(నిష్క్రమింతురు)

౭-వ స్థలము: లుబ్ధావధానులు యింటి అరుగుమీద పసుపు బట్టలు కట్టుకుని లుబ్ధావధాన్లు స్త్రీవేషముతో శిష్యుడు, కొందరు బ్రాహ్మలు కూర్చుని వుందురు.

రామప్పంతులు, తాషామర్ఫా, కావిళ్ళూ, చాకళ్ళతో ప్రవేశించి అరుగుమీద చతికలబడి.

రామ—అబ్బ! ఎంతశ్రమపడ్డానండి. (నౌఖర్లతో) తాషామర్ఫా వూరుకోమను బోయీలోవాళ్ళూ, బాజాలోవాళ్ళూ, వూరు చేరేటప్పటికి కోలాహలంలావు చేస్తారు. కాళ్ళు పీక్కువచ్చాయయ్యా, వెధవ పెద్దిపాలెం యెంతదూరవుఁందీ! (తిరిగిచూసి) యిదేవిఁటీ పసుబ్బట్టలూ, పెళ్ళికూతురుతో కలిసి కూచోడవూఁను? పెళ్ళికొడుకుసం చేయించుకున్నావటయ్యా? ముదిమికి ముచ్చట్లు లావు.

లు—లగ్నానికి మీరు లేకపోయినారుగదా! అని మహావిచారపడుతున్నాను.

రామ—(ఉలికిపడికి) యేవిఁటీ! లగ్గవేఁవిఁటి?

పూజారిగవరయ్య—లగ్నంవేళకి తమరు లేకపోయినారుగదా అని, మేం యావన్మందిమీఁ విచారించాం. తమరు యేదో వ్యవహారాటంకంచేత వేళకి రాజాలరనుకున్నాం. తాము లేకపోవడంచేత సభ సాగునే పోయింది.

"నియ్యోగిలేనిసావిడి - అయ్యయ్యో వట్టిరోత, అది యెట్లన్నన్ - వయ్యారి"—

రామ — అట్టె పేలక. ముహూర్తానికి ముందే పుస్తె యిలా ముడెట్టావయ్యా?

పూజా — సిద్ధాంతిగారు నక్షత్రాలు చూసి ఘడియలు గట్టి సరిగా ముహూర్తంవేళకి పుస్తె కట్టించారండి.

రామ — నాలుగ్ఘడియల ప్రొద్దు కాలేదే?

పూజారి — నాలుగు ఘడియల రాత్రుండగా నండీ, శుభముహూర్తం?

రామ — సిద్ధాంతి ముహూర్తం తెల్లవారి నాలుగు ఘడియలకని చెప్పేడే?

పూజారి — పంచాంగం చూడ్డానికి యెవడికి శక్యం బాబూ? తెల్లవారగట్ల నాలుగు ఘడియలకని, సిద్ధాంతిగారు మనవి చేసివుంటారు. తమరు పరాగ్గా వినివుందురు.

రామ — పంచాంగానికేం యీ వెధవపల్లెటూళ్లో? సిద్ధాంతి ఆడింది ఆటా, పాడింది పాట. యెంత ద్రోహం చేశాడయ్యా సిద్ధాంతి!

పూజారి — సిద్ధాంతి యెంతో నొచ్చుకున్నాడు, తమరు రాలేదని బాబూ. యేమి ఆటంకం చేత వుండిపోయినారో? అని అవుధాన్లుగారు తల్లడిల్లారు. తామామర్నాడు వచ్చారని విన్న తరవాతగదా, ఆయన మనస్సు స్వస్థపడ్డది.

లు — నిజం — మావఁగారు.

పూజారి — యిక మధురవాణో? అంటే, ఆ పందిట్లో నిశ్చేష్టురాలై పుత్తడిబొమ్మలాగ నిలుచుంది గాని బ్రాహ్మణ్యం యావన్మందీ గెడ్డం పట్టుకు యెంత బతిమాలుకున్నా, పాడిందిగాదు.

కొండిభొట్లు — అంతసేపూ హెడ్డు నిస్టీబుగారితో మాట్లాడుతూ నిల్చుంది గాని యేం? యింతమంది ప్రార్థించినప్పుడు, ఓకూనురాగం తియ్యకూడదో?

మరివక బ్రాహ్మడు — ఓకునుకాయా, పంతులుగారు సభలో లేందియలా పాడుతుందిరా?

పూ — హెడ్డుగారితో యేమిటి మాట్లాడుతూందనుకున్నావు? పంతులుగారు సరుకూ జప్పరా, పెట్టుకు వెళ్ళేరు. యేం ప్రమాదం వొచ్చిందో! ముహూర్తంవేళకి రాలేదు. రాలేదు. జవాన్లని పంపి వెతికించండి అని బతిమాలుకుంటూందిరా.

కొండిభట్లు — యీగవరయ్యగారు గోతాలు కోస్తాడ్రా. హెడ్డూ, అదీ, ఒహరి మీదొహరు విరగపడి నవ్వుతూంటే, పంతులుకోసం బెంగెట్టుకుందని కవిత్వం పన్నుతాడు.

రామ — వైదికం! వైదికం! మీ యేడుపులు మీరు యేడవక, లోకంలో భోగట్టా అంతా మీ కెందుకు?

పూ — పూరుకోరా కొండిభొట్లు! పెద్దా పిన్నా అక్కర్లేదూ?

రామ — నీ పెద్దతనం యెక్కడ యేడిసింది? నువ్వా ముందరే పెట్టావు.

పూ — నై, స, బు, పె, అని యెందుకన్నాడు బాబూ!

రామ—ఆతడేడీ, ఆలేడు? అతడికేఁ శేవిఁటీ?

పూ—యెవరండి?

రామ—ఆగుంటూరి శాస్తుల్లేడయ్యా?

పూ—యేగుంటూరి శాస్తుల్లండి?

లు—అయనా—రేవొచ్చి, ఆయనా—వూరికెళ్ళారు.

రామ—యేవిఁటి తెలివితక్కువమాట! కూతురికిపెళ్ళౌతూఁటే, వూరికలావెళ్ళాడు?

లు—పెళ్ళయిపోయింది గదా?

రామ—తెలివిహీనం! లగ్నపంటే నేను లేనుండా వెలిగించావుగానీ, పెళ్ళి ఐదు రోజులు తగలడుతుందిగదూ?—

పూ—ఏకరాత్ర వివాహం కదండీ? అంచేత ప్రధాన హోమం, శేషహోమంతో సమాప్తి అయిపోయింది.

రామ—(నిశ్చేష్టుడై లుబ్ధావధాన్లుతో) ఓరీ, స్వామిద్రోహపు వెధవా!

పూ—నోరు మూసి, బాబ్బాబూ శాంతించండి! శాంతించండి! (లుబ్ధావధాన్లుతో) పంతులుగారి కాళ్ళమీద పడవయ్యా (పంతులుతో) తమరు చేయించిన శుభం. అశుభంమాటలు శలవియ్యకండి. సిద్ధాంతిగారూ, వారిమావఁగారూ, శాస్త్రచర్చ చేసి, లగ్నం పదినిమిషాలుందనగా, ఏకరాత్ర వివాహం స్థిరపర్చారు.

రామ—యేంకుట్ర! వాడికి రూపాయ లివ్వలేదుగద?

లు—యెల్లుండి యేవేళకైనా రూపాయలు చెల్లించకపోతే దావా పడుతుందని తొందరపడి పట్టుకు వెళ్ళిపోయినారు. మళ్ళీ వారంనాటికి వొస్తావఁన్నారు.

రామ—నన్ను మధ్యవర్తినిచేసి, నేను లేనిదీవ్యవహారం యెలా ఫైసలుచేశావు? నేను యడ్వాన్సు వాడికి యిచ్చానో నీకు తెలుసునూ? అప్పుడే మావఁగారితో కలిసి పోయి నాకు టోపీ అల్లావూ?

లు—మీరు చేసిననిర్ణయప్రకారవేఁ, రూపాయలు చేతులో పడితేగాని, పుస్తె కట్ట నివ్వననాడు రేం జెయ్యను?

రామ—పుస్తెకట్టకపోతే నీపుట్టె మునిగిందిగాబోలు! నేవొచ్చేలోగా యేంవుప్పెన వొచ్చింది? వీడేదో పెద్దగా చేసి, నేనొస్తే, పట్టుగుంటానని రూపాయలు చేతులో పడేసుకుని వుడాయించాడు. వాడిపేరేవిఁటి?

పూ—ఆయనపేరు—మరేవచ్చి—అవుధాన్లుగారు శలవిస్తారు.

లు—నాకు తెలియదు.

రామ—అరొర్రే అభాజనుడా! యిహ, వాడు, పంచాళీమనిషి అనడానికి సందేహ మేఁవిఁటి?

లు—అతగాణ్ణి మీరే తీసుకొచ్చి వొద్దవాడని చెప్పారు? అంచేతనే అతణ్ణి నేను నమ్మాను.

రామ—నువ్వు నమ్మితే యెవడికి కావాలి? నమ్మకపోతే యెవడికి కావాలి? ఆతనికి నేను పెళ్ళిఖర్చులకోసం బదులిచ్చిన నూరు రూపాయలూ, అక్కడపెట్టు.

లు—యెవరికిచ్చారో అతణ్ణి అడగండి. నాతో చెప్పకండి.

రామ—సరే నీతో చెప్పను—నీతో యిక మాటాడను—మరినీయింట్లో వక్క నిమిషం ఉండను. (లేచి నిలుచుని) అంతా వినండయ్యా! యీ గుంటూరు శాస్తుల్లు పచ్చిదొంగ లేకపోతే ఈ తెలివిహీనుడు యిచ్చిన రూపాయలు సంధించుకుని, పేరైనా చెప్పకుండా పరారీ అవుతాడా? నాతాలూకు సొమ్ము కూడా పట్టుకు చపాయించాడు. వీడివైఖరీ చూస్తేగా, రెండో పెళ్లిపిల్లనో, నూద్రప్పిల్లనో యీ తెలివిహీనుడికి అమ్మి, యెగేసినట్టు కనపడుతుంది. గనక, ఒరే! బారిగీ ఒరే! మంగలీ, హెడ్డుగారి దగ్గిరకెళ్ళి, యిద్దరు జవాన్లను తీసుకురా. వాడివెంట వొడా యింపిస్తాను.

(పైమాటలు అంటూవుండగా, సిద్ధాంతి ప్రవేశించి రామప్పంతులు మాటలు ముగించి వెళ్ళిపోబోతూవుండగా రెక్కబట్టి నిలబెట్టును.)

సిద్ధాంతి—యెక్కడికి వెళ్తారు? కొంచం నిలబడండి.

రామ—యేమిటి నీ నిర్బంధం?

సి—గుంటూరి శాస్తుల్లుగారి పేరేమిటో మీకు కావాలా?

రామ—యేమిటా పేరు?

సి—పేరి రామశాస్తుల్లుగారు ఆయనపేరుతో మీకేం పనుంది?

రామ—వాడు నాకు బాకీ.

సి—మీకు ఒక దమ్మిడీ బాకీలేదు. ఆనిజం నాకు తెలుసును.

రామ—చెయ్యి నొక్కేస్తున్నావేమిటి?

సి—వైదీకపాళ్ళ చెయ్యి మృదువుగా యలా వుంటుంది? అవధాన్లుగారు యిచ్చిన సొమ్ము తాలూకు నిలవ యెంతుందో చెప్పండి.

రామ—నువ్వెవరివి అడగడానికి? అన్నా! చెయ్యి నొక్కుతున్నావు! తంతావా యేమిటి?

సి—శుభమల్లె, పెళ్లికూతుర్ని ముండా అంటేగా, అంచేయెనగయినా వ్రాసుకుంటారా?

రామ—ముండకాదు, పునిస్త్రీయే, అంటాను; చెయ్యి వొదిలెయ్యి.

[లుబ్ధావధానులు శిష్యుడికి కొంత యెడంగా జరుగును]

సి—కోపం వొచ్చినప్పుడు, లౌక్యం మరచిపోకూడదు. మీరు ప్రభువులూ, మేం ఆశ్రితులం, తమకి లాభించేమాట చెబుతాను. యిలా దయచెయ్యండి.

రామ—మర్యాదగా మాట్లాడితే, నాఅంత మంచివాడు లేడు.

సి—అవధాన్లుగారూ మీరుకూడా యిలారండీ.

[అవధాన్లు, సిద్ధాంతి, రామప్పంతులు రహస్యముగా మాట్లాడుదురు]

రామ—(ఉత్సాహముతో) సిద్ధాంతీ యేది పాడిపిసరు. నియ్యోగపాడన్నవాడు, సవబుకి కట్టుబడతాడు. యెవరయ్యా వంటబ్రాహ్మలు! మాయింటికి పలహారాలు వెళ్ళాయా? యేవోఁయి, కొండిభొట్లూ! మాట, యిలారా.

[కొండిభొట్లు వచ్చును]

కొండి—యేం శలవు?

రామ—మాయింటిదాకా నాతో రా.

కొండి—చిత్తం.

రామ—మాతోట్లో, మంచిపనసకాయ లున్నాయి. రెండు కాయలకి బరాతవిస్తాను. తెచ్చుకో మీఅయ్యకి పనసకాయకూరంటే మాయిష్టం.

కొండి—చిత్తం!

రామ—పెళ్ళిలో యేవిఁటోయి గమ్మత్తు.

కొండి—యేవీఁ గమ్మత్తు లేదండి.

రామ—మధురవాణి పాడిందికాదేం?

కొండి—పాడింది—

రామ—ఆఁ!

కొండి—కాదండి.

రామ—అలా చెప్పు. అంతసేపూ హెడ్‌కనిస్టీబుతో మాట్లాడుతూంది కాబోలు?

కొండి—లేదండి. ఒక్కమాటాళ్ళేదు.

రామ—మరెందుకన్నావూ, మాట్లాడిందని యింతాకానూ? విరగబడి నవ్విందన్నావేఁ?

కొండి—మరేవొచ్చు—లింగన్నగారి కాఁభొట్లు అలాఅనమన్నాడు.

రామ—వాడిపని పట్టిస్తాను. నాతో వెకాస్యాలా! నువ్వుమాత్రం వాడిజట్టుకూడకు. చిన్నప్పట్నుంచీ నిన్ను యెరుగుదును. నువ్వు నిజాయితీమనిషివి.

కొండి—అవునండి యెప్పుడూ నేను నిజవే చెబుతాను.

రామ—అప్పుడుగాని, హెడ్డు కనిస్టీబు మాటకు నిజం చెప్పావు కావు. పట్టాభిరామస్వామిమీద ప్రమాణంచేసి, చెప్పు. మధురవాణి యెవరెవరితో మాట్లాడింది?

కొండు—మరేవచ్చి—నిజం చెప్పమన్నారూ?

రామ—నిజాయితీమనిషివనేగదా నిన్ను అడుగుతున్నాను.

కొండు—అయితే—అందరితోటీ మాటలాడింది.

రామ—అందరితోటి అంటే యవరెవరితోటి?

కొండు—యవరెవరాఅండి? పెళ్ళివొదిలేసి, అంతా మధురవాణిచుట్టూ మూగాం. భుక్తగారితో మాట్లాడింది మరేవచ్చి.

రామ—యింకా యవరితో మాట్లాడింది?

కొండు—సిద్ధాంతి మంత్రం చెప్పడం మానేసి మధురవాణి చెవులో యేకాంతం మాట్లాడాడు.

రామ—మరింకా యవరితోటి?

కొండు—మరేవచ్చి—హెడ్డుకనిస్టీబుతోటి

రామ—ఓరీ ఛండాలుడా! హెడ్డుతో మాట్లాడలేదన్నావే?

కొండు—అవును మాట్లాళ్ళేదు.

రామ—పుండాకోర్! మాట్లాళ్ళేదు.

కొండు—చచ్చాన్రా దేవుడా!

రామ—అసత్యం అంటే, నాకు వెఱ్ఱికోపం. ప్రమాణపూర్తిగా నిజం చెప్పు. అబద్ధమాడితే తల వేలిపోతుంది. మాట్లాడిందా లేదా?

కొండు—లేదు.

రామ—ప్రమాణపూర్తిగా?

కొండు—ప్రమాణపూర్తిగానే.

రామ—ఇప్పుడు నిజం చెప్పేవు విన్నావా? నీకు చిన్నతనం; ఆడవాళ్ళమీద ఒహరు అనమన్నా, అన్యాయపుమాటలు ఆడకూడదు. తెలిసిందా.

కొండు—మధురవాణి చూదొడ్డమనిషి.

రామ—వూళ్ళో ఆలా అనుకుంటారేం?

కొండు—అంతా అనుకుంటారు,

[రామప్పంతులు యింటియెదుట]

రామ—నేను తలుపుకొడతాను నువ్వో చిన్నగమ్మత్తు చెయ్యి.

కొండు—చిత్తం.

రామ—యీావిచ్చబేడ మొలని పెట్టుకో. మా పెరటిగోడ అవతల, ఒక అరఘడియ నిలబడు. దడ్డీతోవంట కనిస్టేబుగాని, మరెవరుగాని పైకివొచ్చినట్టాయెనా రెక్కపట్టుకొని కేకెయ్యి నే వొస్తాను. లేకుంటే వుడాయించెయి. (కొండుభొట్లు నిష్క్రమించును.) తలుపు తలుపు (తనలో) ఒకంతట తలుపు తియ్యదు. అనుమా

నానికాకారణం. వీడు నిజంచెప్పేడా? అబద్ధం చెప్పేడా? బేనే పాలెం నించి వొచ్చి కబురు పంపించినతరవాత కాక, తుఱ్ఱుమని యెలా పరిగెత్తివెళ్ళిందీ పెళ్ళి లోకి? తలుపు తలుపు! యెప్పటికీ రాదేం!

(మధురవాణి తలుపు తీయును) యేంజేస్తున్నావు యింతసేపు?

మధు—ఉదయంనుంచి శాస్త్రిపాకూ చేసేపనులన్ని, రేపటినుంచి వ్రాసి ఉంచుతాను రండి.

(ఉభయులూ నిష్క్రమింతురు)

[కొండుభొట్లు ప్రవేశించి]

కొండు—పంతులుగారూ, పంతులుగారూ,

[రామప్పంతులు, మధురవాణి ప్రవేశింతురు]

రామ—(మధురవాణితో) నువ్వు లోపలికి వెళ్ళు (కొండుభొట్లుతో) యేవింటి?

కొండు—మరేవచ్చి—పట్టుకోలేదు.

రామ—(తీక్షణంగా) యెందుకు పట్టుకున్నావుకావు?

కొండు—చెప్పరానిదాన్ని యెలా పట్టుకోవడం?

మధు—చెప్పగానిదాన్ని యెందుకు పట్టుకోవడం?

కొండు—దిడ్డీతోవంట యెవరొచ్చినా పట్టుకుని కేకెయమని పంతులు చెప్పేరు.

మధు—యేవిఁ చిత్రం! యేం అప్రతిష్టా! బ్రాహ్మడికి వెఱ్ఱెత్తుతూంది కాబోలు!

రామ—(మధురవాణి వెనకనిలచి చేతితో వెళ్ళిపొమ్మని కొండుభొట్లుకు సౌజ్ఞచేసి) పేలుడుగాయ వైదీకప గుంటడి వెకాశ్యాలు నిజం అనుకుంటావేవింటి?

(లోపలికి వెళ్ళును)

[రామప్పంతులు యింటిలోనికి వెళ్ళగానే మధురవాణి సావిడివెనకతలుపుపై నుంచివేసి, కొండిభొట్లును లోపలికి రమ్మని సౌజ్ఞచేసి ముద్దెట్టుకొనును]

మధు—(నిమ్మళంగా) బాగా కాపాడావు!

కొండి—మధురవాణీ, యిదిగో పంతులిచ్చినబేడ, యిదిగో పెద్దుగారిచ్చినపావలా. యింద వెండితో—పొడికాయ (యిచ్చును)

మధు—(పుచ్చుకొని) నువ్వు మంచివాడివి. యీవేళనుంచి, నీకూ నాకూ నేస్తం తెలిసిందా? (మరివకసారి ముద్దుపెట్టుకొని) యిక వెళ్ళు.

(కొండిభొట్లు చెంగున వీధిలోకి యెగిరి వీధినడుమ గెంతులువేయును)

[కాంభొట్లు ప్రవేశించి]

కాంభొ—యెందుకురా యీగెంతులు?

కొండి—ముద్దెట్టుకుందిరా!

శాంభో—వెఱ్ఱి వెఱ్ఱి వేషాలు వెయ్యకు. యీకోతిమొహాన్నే ?
కొండి—పోన్సి వెఱ్ఱికట్టా! మేం జట్టుకట్టాం!

(నిష్క్రమింతురు)

అగ్నిహోత్రావధాన్లు యింటిపెరటిలో గిరీశం పనివాళ్ళచేత పందిరి వేయించుచుండును.

[వెంకటేశము ప్రవేశించును.]

గిరీశం—యేమివాయ్ బావా, యెడంజవస యెట్లుబారింది?
వెంకటేశం—నాన్న గూబగదలేశాడు.
గిరీ—యేంజేశావు ?
వెంక—సంధ్యవార్చలేదని.
గిరీ—ఆమాత్రం వార్చినట్టు వేషం వెయ్యలేకపోతివా ?
వెంక—చూడ్డనుకున్నాను.
గిరీ—అనుకోడాలు పనికిరావోయి, బావా, మనం యేదైనా వేషం వేశావంటే, ఒకడు చూస్తున్నాడనిఅనుకున్నప్పుడూ, ఒకడు చూస్తావుండలేదనుకున్నప్పుడూ కూడా, ఒక్కమోస్తరుగా వేషం నడిపిస్తే సేఫ్ సైడ్. చూస్తున్నావు కావా, రోజా నేను యెంతసేపు బకధ్యానం చేస్తానూ ?
వెంక—యేవఁని ధ్యానం చాస్తారు?
గిరీ—యేం ధ్యానవాఁ? యీచాదస్త బ్రాహ్మడు యెంతట్లో దేవతార్చన చాస్తాడు యంతట్లో విస్తట్లో మెతుకులు పడతాయి అని తదేకధ్యానం చేస్తాను.
వెంక—మంత్రాలు చదివి దేవుఁణ్ణి ధ్యానం చెయ్యాలిగాని అన్నంకోసం ధ్యానంచేస్తే పాపంకాదా ?
గిరీ—ఇగ్నొరెన్స్! మతసంబంధమైన సంగతులు నీకేమీ తెలియవు యీ పెళ్ళి అయిపోయినతరవాత నిన్ను మతంలో తరిఫీదు చెయ్యాలి. అన్నిమతాలూ పరిశీలించి వాటితాలూకు యసెన్స్, నిగ్గుతీసి ఓకొత్తమతం యేర్పర్చాను. అది అమెరికా వెళ్ళి ప్రజ్వాలింపచేస్తాను. ఇప్పుడుమట్టుకు నీసంశయం తీరుస్తాను. యేమన్నావ్? అన్నాన్నా ధ్యానించడం అని కదూ? యేవఁందోయి నీ ఉపనిషత్తు? "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అన్నవేఁ, బ్రహ్మ అని తెలుసుకోవోయి, వెధవాయా, అంది. తెల్లవాడు యేవఁని ధ్యానంచేస్తాడోయి రోజూనూ ? "ఫాదర్, గివ్, అవ్ అవర్, డెయిలీ, బ్రెడ్ ?" అనగా నన్ను కన్నతండ్రీ రోజూ ఒక రొట్టెముక్క ఇయ్యవోయి, అని"—ఇక, మనవేఁవఁనాలి? 'తండ్రీ రోజూ కందిపప్పు, ధప్పు

శం ఇయ్యవమ్మా' అని ధ్యానించాలి. నేను చమకంలో యేమన్నాడమో? "శ్యామాకాశ్చ మే" "చామల అన్నం మామజాగా వుంటుంది, నాక్కావాలి, ఓదేవుఁడా! అన్నాడు" ఆచమకంలో వాడికి యిష్టమైన వస్తువులు వాడు కలపవచ్చును— "కందిగుండా చ మే యింగువా చ మే" దీనినే రిలిజియస్ రిఫార్మ్ అంటారు.

వెంక— గేదె పెరుగూ చ మే, చేగోడీ చ మే.

గిరీ—శబాష్! ఆదే ఒరిజినాలిటీ, అడిగితేగాని అమ్మ అయినా పెట్టదు. దేవుడు మాత్రం ముద్దిస్తాడనుకున్నావా? యేవిటి? నీకు యెప్పుడు యేమికావలిస్తే అప్పుడు ఆవస్తువులు సంపుటీచేసి చమకపారాయణ చేస్తాను.

వెంక—అయితే రేపట్నుంచి రోజూ చమకపారాయణ చేస్తాను.

గిరీ—మనస్సులో చెయ్యి. పైకి పారాయణ చేశావంటే, నీతండ్రి ఎడ్యుకేషన్ లేక పోవడంచేత రీజన్ తెలియక యిదేమిటి చమకం పాడుచేస్తున్నాడని పెణతెక్క గొట్టి తొమ్మిక్కో అష్టం ఘనం పారాయణ చేస్తాడు.

వెంక— మొన్న బుగత గారి యింట్లోంచి మీరు పొగాకుకట్ట యెత్తుకొచ్చారుగదా. పాపం చేశారని దేవుఁడు కోప్పడ్డా?

గిరీ—చిన్నతనంలో మా పింతండ్రి (నీతండ్రిలాగే అగ్గిరావుఁడోయి) చెవినులిపినాచేత ఉపనిషత్తులు చదిపించాడు. శాంతస్నా గొయ్యాక్కి, పేరు మరిచిపోయినానుగాని, ఒక ఉపనిషత్తులోను, శిష్యుడు ప్రశ్న అడుగుతూ ఉంటే గురువు సమాధానం చెబుతూంటాడు. ఆఉపనిషత్తులో చెప్పిన శిష్యుళ్ళాంటి శిష్యుడివి నువ్వు; అలాంటి గురువుని నేను, మన ప్రశ్నోత్తరాలు యవడైనా తాటాకుమీద రాసి పారేశాడంటే, ఒక రెండువొందలేళ్ళు అయినతరవాత 'టొబాకోపనిషత్తు' అవు తుంది, పొగాకుకట్టకు పాపమేఁవిఁటోయి, కాల్చి పారేసేదానికి? అందులో పాడుంచేసే బుద్ధిహీనులదగ్గిర పొగాకు యెత్తుకురావడం లోకోపకారవఁని నమ్ము.

వెంక—యలాగండి లోకోపకారం?

గిరీ—యలాగా. యిదిగో, యిలా చుట్ట కాలిస్తే, స్టీము యింజనులాగ, భగ్ భగ్ మని పొగ ఆకాశానికి పరుగెత్తి మేఘమై వర్షం కురిపిస్తుంది. పాడుంగాని పీలుస్తే ఆఘాటుకి, ఆకాశం ఆర్చుకుపోతుంది. ముక్కంటమాత్రం చిరివర్షం కురిసి యిల్లూ వొళ్ళూకూడా దర్టీ అవుతుంది. గనక పాడుంచేసే మూర్ఖులయింట్లో వుండే పొగా కంతా దొంగిలించి చుట్టలుగట్టి తగలెట్టవలసినదే. ఒకవేళ గిరీశంగారూ తమరు దొంగతనం చేశారు, కొద్దిరోజులు నరకానికి విజయం చెయ్యండి, అని దేవుఁడు గానీ, అన్నట్టాయెనా, ఒక చిన్న లెక్చరుకొట్టి గభరాయింపజేస్తాను.

వెంక—యేవఁని లెక్చరు కొడతారు?

# చతుర్థాంకము

గిరీశం — యేవఁనా? ఓ దేవుఁడా! నామనస్సు యిండిపెండెంటుగా సృజించావా? లేక డిపెండెంటుగా సృజించావా? యిండిపెండెంటుగా అయితే, నాయిష్టవొచ్చినపనల్లా నేను చేశాను నువ్వెవరు, అడగడానికి? యిలాంటి చిక్కులు పెట్టావంటే హెవెన్‌లో చిన్న సోషల్ కాంగ్రెస్ వొకటి లేవదీస్తాను. లేక నన్ను డిపెండెంటుగా చేశావూ? అలాగయితే నువ్వే నాచేత పాపం చేయించావు గనక నీకే ఆశిక్ష కావలిసింది. దేర్ ఫోర్ చలో; నరకానికి చలో! అనుగ్రహించి నువ్వు తిరిగీ వొచ్చేలోగా, ఆరు ఘడియలు స్వర్గంలో సర్వాధికారం నాకిస్తివట్టాయనా, కొన్ని సృష్టిలో లోపాలు సవరణ చేస్తానంటాను.

వెంక — యేమిటండీ లోపాలు?

గిరీ — లోపాలన్న లోపాలా! నీచేత వొప్పిస్తాను. నెంబర్ వన్. నీమేష్టరులాంటి ఆభాజనుణ్ణి పుట్టించడం లోపం అంటావా?

వెంక — లోపమే.

గిరీ — నీసిస్టర్‌లాంటి బ్యూటిఫుల్ యంగ్ గరుని, విడోని చెయ్యడం తప్పంటావా, ఒప్పంటావా?

వెంక — తప్పే.

గిరీ — యిలాంటి లోపాలు కోటానుకోట్లు. ఇక రద్దు సృష్టి యెలాగుందనుకున్నావు? ఫరిన్‌స్టెన్స్, యెన్ని సముద్రాలు ఉన్నాయి?

వెంక — యేడు

గిరీ — యేడూ, యేడిసినట్టే ఉన్నాయి. పాలసముద్రం వుంటూవుండగా వాళ్ళీ పెరుగు సముద్రం, నేతిసముద్రం యెందుకోయి? ఇది ప్లినియోనిజమ్, పునరుక్తి — మరో తెలివితక్కువ చూశావా? యెందుకూ పనికిమాలిన ఉప్పుసముద్రం మననెత్తి కొట్టి, పెరుగు, పాలు, నెయ్యి, చెరుకుపానకం యీసముద్రాలన్నీ యెవడికీ అందుకు రాకుండా దూరంగా విసిరేశాడోయి. ఒక సంవత్సరం గాని, నాకు దేవుఁడు దివాన్గిరీయిస్తే, భీమునిపట్ణానికి పాలసముద్రం, విశాఖపట్ణానికి మంచినీళ్ళ సముద్రం, కళింగపట్ణానికి చెరుకుసముద్రం తెస్తాను. యీయీస్ట్రన్‌ఘాట్సు అంతా పొగాకు అరణ్యం చేస్తాను. ఈ లెక్చరు నేను కొట్టేసరికి, దేవుఁడు తెలిసిందా? వీడు అసాధ్యుఁళ్ళా ఉన్నాడు. వెనకటికి "పాత యముడివా కొత్త యముడివా" అని అడిగిన పెదమనిషికంటే ఒక ఆకు యెక్కువ చదువుకున్నట్టు కనపడతాడు. గనక వీడికో జోడుగుఱ్ఱాలబండి ఇచ్చి, స్వర్గంలో ఉన్న యీసత్తు మహలులు, బగీచాలూ చూపించి, యేంకావాలంటే అది యిచ్చేయండని దేవమాతలతో చెబుతాడు. నాశిష్యుఁడు, వెంకటేశాన్ని కూడా తీసుకొస్తేగాని, నాకేం తోచదని నే చెబుతాను. అప్పుడు నిన్ను విమానమ్మీద తీసుకొస్తారు. మన విద్దరం స్వర్గంలో మజా

పుణాయిద్దాం, యీవేళకి మఠంమీద యింతవరకు లెక్చరు చాలును. ఇక వెళ్ళి దేవాలయం తోటలో కోతిపిల్లినిపట్టి ఆడుకో. సాయంత్రానికి నీతండ్రి వొచ్చేసరికి మాత్రం దీపంయదట కూచుని పుస్తకం తిరగేస్తూ పులుసటుకులు ధ్యానం చెయ్యి. ఇంగువవేసి బలేసొగసుగా తయారుచేస్తాను! (వెంకటేశం వెళ్ళును.) రసెవే.

[బుచ్చమ్మ ప్రవేశించి]

బుచ్చమ్మ—యీరుబ్బురోలునిండా తాటాకుముక్కలు పడుతున్నాయి. యివతలికి లాగేసి పెడతారూ.

గిరీ—అదెంతపని?

[గిరీశం రుబ్బురోలు పందిరి అవతలకు లాగును. బుచ్చమ్మ రుబ్బురోలు కడిగి మినపపప్పు రుబ్బును.]

గిరీ—(పాడును.) "భజగోవిందం గోవిందం భజమూఢమతే"

బుచ్చ—యేవీఁ లేదు.

గిరీ—మీరు కంటనీరు పెడితే నామనసు కరిగిపోతూంది.

బుచ్చ—మీకేం—మహారాజులు—మాకష్టాలు మిమ్మల్ని బాధిస్తాయి.

గిరీ—ఏమి కనికరంలేని మాట అన్నారూ! మీరు అలా దుఃఖంలో మునిగి ఉంటే? యెందుకు నాకీ వెధవబతుకు? మీకోసం యేంచెయ్యమంటే అది చేస్తానే, ప్రాణమిఁచ్చెయ్యమంటే యిచ్చేస్తానే దాఖలా చూడండి. యిదుగో కత్తిపీట!

బుచ్చ—(కత్తిపీట దగ్గరకు తీసుకొని) చెల్లికి యీసమ్మంధం తప్పించారు కారుగదా?

గిరీ—అదొక్కటిమట్టుకు నాకు సాధ్యమైంది కాదు.

బుచ్చ—అయితే మీతో నాకేంపని? ఇంతసందడిగా పెళ్ళిపనులు చేయిస్తున్నారు. మానాన్నకి తోచకపోతే, మీకైనా తోచకూడదా, యీసమ్మంధం కూడదని? మీకుకూడా దానిమీద యింతకనికరం లేకపోవాలా? లుబ్ధావుధాన్లు మీకు అన్నగారని కాబోలు మీకు సంతోషం.

గిరీ—నాకా సంతోషం? యెంతక్రూరమైన మాటఅన్నారు. ఈసంబంధం ఔతుందని నామనస్సులో ఎంత ఖేదిస్తున్నానో ఆభగవంతుడికి తెలుసును. ఈసంబంధంతప్పించాలని చెడచీవాట్లు పెడుతూ మాఅన్నకేర రెండు టావులు ఉత్తరం రాశాను. చెవిని పెట్టేడు కాడు. నేను యేం చేతును? వాడిని స్మరిస్తేనే పాపంవొస్తుంది. ఊరికే కూర్చుంటే మీతండ్రి యేవఁనుకుంటాడో అని, మీ యింట అరవ చాకిరీ చేస్తూ నీకు యేనాటికైనా కనికరం వొస్తుందేమో అని ఒక్కమనిషిని నూరుమంది చేసేపని చేస్తున్నాను అంతేగాని, యీనమ్మిన నౌఖరుమీద నీమనసు భారంగా ఉంటే, యెవరికీ చెప్పకుండా యీరాత్రి లేచి మాదేశానికి వెళ్ళిపోతాను.

నేను ఏంటేనా చిన్ని! పాలిడి తాకి, [illegible] గా కాలుస్తాను. [illegible] బుచ్చి గారి కడిగితే నేగాని యీ చేతికి ఖర్మలా పోదు, నువ్వా రంభవి? నా బుచ్చమ్మ సొగసుకి నువ్వు వొడ్డికి పనికిరావు నోరుమూసే, డామ్, వర్తీ గూస్" అని అంటాను. ఆలాగే మేనకా, ఊర్వశీ, తిలోత్తమా మొదలైన యావన్మంది అప్సరస స్త్రీలని తన్ని తగిలేస్తాను. తిరిగివెళ్ళి కామాయనస్త్రాలు విరిచి కల్పవృక్షాన్నాయని "హా! బుచ్చమ్మా, బుచ్చమ్మా" అని నీ పేరు జపం చేస్తూ అనేక సంవత్సరాలు పద్మాసనం మీద వుండిపోతాను. అంతట కొన్నాళ్ళకి నా తపస్సు ఫలించి, నువ్వు నందనవనం లోకి చంద్రోదయంలాగ బయలుదేరి వస్తావు. నేను "ప్రియురాలా! యెన్నాళ్ళకి వొచ్చావు!" అని ఆనందంగా వెళ్ళి నిన్ను; నిన్ను కౌగిలించుకుంటాను. అప్పుడు నీ మొదటి మొగుడు ముసిలి వెధవ గావంచా గుడ్డ కట్టుకుని పొడుం ముక్కుతో "బుచ్చమ్మ నా పెళ్ళాం" అని అడ్డు రాబోతాడు. "వెధవాయీ నువ్వు బుచ్చమ్మకి తగవు. నీ రూపాయలు నువ్వు పట్టుకుపో" అని వొక్క తాపు తన్ని తగిలేస్తాను. మనం యిద్దరం సుఖంగా స్వర్గంలో శాశ్వతంగా వుండిపోతాం.

బుచ్చ — యేడుస్తూన్నదాన్ని నవ్విస్తారు.

గిరీ — నువ్వు నన్ను పెళ్ళాడితే, మనం బతికున్నన్నాళ్ళూ నవ్వుతూనుండూ, ఆనందిస్తూ, కాలం వెళ్ళబుచ్చుతాం. అప్పుడు నిన్ను యిలా వప్పు రుబ్బనిస్తానా? మనకి యెంతిమంది నౌఖర్లు ఉంటారు! యెంతమంది చాకర్లు ఉంటారు! తోటలు, దొడ్లు, గుఱ్ఱాలు, బళ్ళు! నిన్ను నడవనిస్తానా? పుష్పంలాగ నెత్తిమీద పెట్టుకుంటాను. అప్పుడు నీకు కలిగే ఆనందం ఆలోచించుకో.

బుచ్చ — నా జన్మానికి మరి ఆనంద మెక్కడిది?

గిరీ — నేను నీకు దాసుడనై "యిదుగో నన్ను స్వీకరించు. నన్ను పెళ్ళాడి, ఆజన్మం ఆనందం అనుభవించు. నన్ను ఆనందంలో నుంచు" అని బతిమాలుకుంటూంటే, నువ్వు అట్టి సులభసాధ్యమైన సుఖమును కాలున తన్నుకు వెళ్ళిపోయి, నా బతుకు కూడా బుగ్గిని కలిపితే, నేనేమి చెయ్యగలను?

బుచ్చ — మీబతుక్కి లోపమేవిఁ? మీరు మహారాజులు.

గిరీ — నువ్వు నన్ను పెళ్ళాడితే నేను మహారాజునే అవుతాను. నీనోటంట వచ్చిన మాట ఆమోఘం వొట్టినే పోకూడదుగనక నాతో వెళ్ళిపోయిరా.

బుచ్చ — అమ్మ నాయనా! నే మీతో రాను.

గిరీ — సరే. రాకపోతే నేనే గదా ప్రాణత్యాగం చేస్తాను? పీడా నాడా కూడా పాయె.

బుచ్చ — అలాంటి మాటలు అనకండి.

గిరీ—నేనేమాట చెబితే తప్పేమిటి? నేనన్నా తప్పే. సరే, నీచెల్లెలి మీదైనా నీకు కనికరం లేదా?

బుచ్చ—అదేం అలా అడుగుతున్నారు?

గిరీ—నిజంగా కనికరం ఉందా?

బుచ్చ—ఉండకుండా ఉంటుందా?

గిరీ—ఉంటే యీ పెళ్ళి తప్పించే సాధనం నీ చేతులోనే ఉంది.

బుచ్చ—నా చేతులోనా?

గిరీ—అవును రాలా,

బుచ్చ—యేమి చిత్రమైన మాటలు చెబుతారు!

గిరీ—యీభూప్రపంచంమీద వుండుచున్న యావన్మంది స్త్రీలలోనూ నిన్నొకర్తెనూ వలచి, నేను నిను నుకోలాయూ లొంగిపోబట్టేగదా, నాబతుకు యీసాస్యాలకింద ఐపోయింది.

బుచ్చ—మీతోడు—అలా అనకండి.

గిరీ—పోనియి. ఆమాత్రం భరవసా యిచ్చావు. ఒకమాట నాకు ప్రమాణపూర్తిగా చెప్పు. నీచెల్లెలిపెళ్ళి తప్పించడం, నీచేత అయితే చేస్తావా?

బుచ్చ—చెయ్యనా?

గిరీ—యేమో చేస్తావో చెయ్యవో! చేస్తానని ప్రమాణం చేస్తేనే ఆమాట నేను చెబుతాను.

బుచ్చ—యావంని ప్రమాణం చెయ్యమన్నారు?

గిరీ—నామీద ప్రమాణం చెయ్యి.

బుచ్చ—మీమీద ప్రమాణమే; చెప్పండి?

గిరీ—అయితే విను. వొంటరిగా చూసి, యీమాటే నీతో రహస్యంగా చెప్పుదామని కాచి, కాచివుండగా యీవేళ మీతండ్రి వూరికి వెళ్ళడం మీతల్లి వాకట వుండడంనుంచి, సమయం చిక్కింది. చెవివొగ్గి విను. నీచెల్లెలి పెళ్ళి తప్పడానికి ఒక్కటే సాధనం వుంది. అది యేమిటంటే, నువ్వు ముందూ వెనకా ఆలోచించక, నాతో లేచివచ్చి నన్ను పెళ్ళి చేసుకోవడమే—లేకుంటే నీచెల్లెలిపెళ్ళి తప్పదు.

బుచ్చ—(ముసిముసి నవ్వుతో) నేను మీతో లేచివస్తే మాచెల్లెలుపెళ్ళి ఆగిపోతుంది? యేమిం చిత్రాలు!

గిరీ—ఆమాట నీచేతనే వొప్పిస్తానుకదూ — విను — పెళ్ళికి తల్లి వెళ్ళుతూన్నప్పుడు రెండోనాడు రాత్రి బండివాడిచేతులో నాలుగురూపాయలు పెట్టి, నీబండీ తోవ తప్పించి అనకాపిల్లి రోడ్డులో పెట్టిస్తాను. అక్కడనుంచి రామవరందాకా మా స్నేహితులు అంచీబళ్ళు కట్టాయిస్తారు. ఆడుతూ, పాడుతూ మనం వొడాయించి రామవరంలో మనం పెళ్ళాడేసుకుని సుఖంగా ఉందాం. యిక మీవాళ్ళ సంగతి యేమౌతుంది? మనం వుడాయించిన మన్నాడు తెల్లవారగట్ల, నీబండి కనపడక,

కలకలపడి, మీవాళ్ళు కత్తికోకూ కట్టుకుంటారు. నీచెల్లెలి పెళ్ళి ఆగిపోతుంది. మరి రెండు రోజులకి మనం పెళ్ళాడామని తెలుస్తుంది. నిన్ను ముసలివాడికి కట్టిబెట్టినందువల్ల కలిగిన చిక్కులు చూస్తూ, నీతండ్రి నీచెల్లెలికి పెళ్ళి ముసలిసంబంధం చెయ్యడు. నీతండ్రి ఒకవేళ మూర్ఖించి పెళ్ళిచేస్తానన్నా; మన లేచిపోవడం విన్నతరవాత, నాఅన్న నీచెల్లెల్ని మరి పెళ్ళి చేసుకోడు. యిది సిద్ధాంతం. అవునా కాదా?

బుచ్చ—అవును కాబోలు.

గిరీ—అయితే మరి అందుకు సమ్మతేనా?

బుచ్చ—యెందుకు?

గిరీ—నాతో వెళ్ళిపోయి రావడానికి.

బుచ్చ—అమ్మ నాయనా, నా ప్రాణం పోతే నేను మీతో రాను.

గిరీ—రాకపోతే మీచెల్లెలికి యీపెళ్ళి తప్పదూ, నాకు చావూ తప్పదూ.

బుచ్చ—అలా అనకండి.

గిరీ—అనకపోతేమాత్రం, చావు తప్పేదుంది గనకనా? నిన్ను వొదిలి బతకలేను. అది వకచావు. నువ్వు నామీద వొట్టువేసుకుని ఆమాట తప్పిపోతే నన్ను దేవుడే చంపేస్తాడు. అది రెండోచావు. మరి నాకు చావు యెలా తప్పుతుంది?

బుచ్చ—నానుంచి మీరు చచ్చిపోతే, నేనూ చచ్చిపోతాను. చచ్చిపోకండి.

గిరీ—నావశవా? అడుగో నీతమ్ముడు వొస్తున్నాడు. మరి మనం యీ కష్టసుఖాలు మాట్లాడుకోడానికి వీలుచిక్కదు. ఒక్కమాట చెప్పు. బతకమన్నావా? చావమన్నావా?

బుచ్చ—వెయ్యేళ్ళు బతకండి.

గిరీ—అలాగైతే నాతో రావడం ఖాయమేనా?

బుచ్చ—యేంజెయ్యమంటే అది చేస్తాను.

[వెంకటేశం మిడతను బట్టుకు ప్రవేశించును.]

వెంక—యిదిగోనండోయి, గొల్లభామని పట్టుకున్నాను.

గిరీ—చూశావూ, వొదినా! నీతమ్ముడు చిన్నగుంటడయీ, అప్పుడే గొల్లభామల్ని పట్టుగుంటున్నాడు.

బుచ్చ—(ముసిముసి నవ్వు నవ్వుచు) మిడత!

గిరీ—(బుచ్చమ్మతో) యిన్నాళ్ళకి మిడతంభొట్లు చేతులో చిక్కాడు. (వెంకటేశంతో) యిలాతే మిడతల్ని పట్టుకోవడం మంచి ఎడ్యుకేషన్. యిదే నాచురల్ హిస్టరీ, ప్రకృతిశాస్త్రం అంటారు.

వెంక—అక్కయ్యా కొంచం ఊరుబిండి!

బుచ్చ—అమ్మ చూస్తే తంతుంది.

వెంక—అమ్మ చూడదులే. (ఊరుబిండి చేతులో వేసుకుని నాలుకతో నాకి రెంతును.)

(తెర దించవలెను)

---



# కన్యాశుల్కము — పంచమాంకము

## ౧-వ స్థలము : లుబ్ధావధాన్లు పడకగది.

లుబ్ధావధాన్లు మంచముమీద పరుండి వుండును. నిద్రలో అరచి కాళ్ళూ, చేతులూ కొట్టుకొని, లేచి కూచుని వణక నారంభించును.

లు—అసిరిగా! అసిరిగా! అమ్మో! చంపేశాడర్రోయి రామనామ తారకం — రామనామతారకం — రామనామతారకం — రామనామతారకం॥ యిది రెండో పెళ్ళి ముండే దీని మొగుడు పిశాచమైనాడు. నాపీక పిసికి చంపేస్తాడు. యేవిఁటి సాధనం? రామనామతారకం — రామనామతారకం॥

(తలుపుఅవతలనుంచి) అసిరిగాడు — యేటిబాబూ? యేటిబాబూ? (తలుపుతట్టును)

మీనా—యేవిఁటి నాన్నా, తలుపుతియ్యి.

లు—(తనలో) కాళ్ళు ఆడవు చేతులు వొణుకుతున్నాయి. తలుపుతీయును; (అసిరిగాడితో) వెధవా నువ్వు లోపలికి రాకు.

అసిరి—నాను పిలుస్తాన్నినాను. (నిష్క్రమించును.)

[మీనాక్షి — శిష్యుడు ప్రవేశింతురు]

లు—(మీనాక్షితో) ఆముండని అవతలుండమను.

మీ—నువ్వు మనగదిలోకి వెళ్లిపో అమ్మా (శిష్యుడు గదిఅవతలికి వెళ్ళును) యేవిఁటి నాన్నా!

లు—యిహ, నేబతకను.

మీ—యేవొచ్చింది నాన్నా, కడుపునొప్పా, కాలునొప్పా?

లు—కడుపునొప్పికాదు, కాలునొప్పికాదు. వెధవముండని పెళ్ళాడిన కుంకపీనుగ బతకడం యెలాగ?

మీ—యేవిఁటా వోగాయిత్యం మాటలు, నాన్నా మీకు యీతేనిపోని అనుమానం యెవరు పెట్టారు?

లు—అనుమానవేఁవిఁటి? నిజం, నిజం, నిజం — వూరంతా అదేమాట.

మీ—యీరావఁప్పంతులే యిలాంటి అపవాదులన్నీ వేస్తూవుంటాడు. కనపడ్డవాడితో అల్లా వూసుపెడితే, వూరంతా అనుకోదు? బంగారంలాంటిపిల్లని యిలాంటి మాటలని బెంబేలు పెట్టకండి. తండ్రి వెళ్ళిపోయినాడని అది రాత్రీ పొగలూ యేడుస్తూంది.

లు—వెధవతండ్రి, బోడితండ్రీను; గాడిదకొడుకు రెండోపెళ్లి ముండని నాపెళ్లికి మూడేసి అమాంతంగా నాకొంప ముంచేసు. యింగా బతకను. యింగా బతకను.

మీ—'రెండో పెళ్లి ముండ రెండో పెళ్లి ముండ' అని శుభవుళ్లే అనకండి. మీరే యిలా చాటుతూ ఉంటే ఊరంతా అనడం ఆశ్చర్యవాఁ? మాట్లాడక ఊరుకోండి.

లు—ఊరుకోవడవేఁలాగే? మనవూరా? మనదేశవాఁ? రెండో పెళ్లి ముండ కాకపోతే ఆతండ్రి వెధవ, పేరయినా? చెప్పకుండా పారిపోవడవేఁవిఁ?

మీ—సిద్ధాంతితో చెప్పాట్టే పేరు?

లు—వాడిశ్రాద్ధం చెప్పాడు. సిద్ధాంతి గడియకో పేరు చెబుతున్నాడు.

మీ—అత్తగాడికి మాత్రం కొత్తవాడి పేరు జ్ఞాపకవుంటుందా యేవిఁటి? మనపిల్ల మనయింట్లో ఉన్నతరవాత, అత్తగాడి పేరుతో మీకేంపని?

లు—ఈ పెళ్ళాంముండ నాయింట్లో ఉంటే నేను చచ్చిపోతాను. యిక బతకను.

మీ—వెఱ్ఱికేకలెయ్యక నోరు మూసుకుని వూరుకోండి. ఇరుగుపొరుగు వాళ్లు నవ్వగల్రు. మీనాన్నఁగారు యెంత పండితుడు, యెంత పెద్దమనిషి! లేనిపోని అనుమానాలు పెట్టుకోకండి. పసిపిల్ల బెంగెట్టుకోగల్దు.

లు—ఓసి భ్రష్టా! వాడు నీకేవఁయినా యిచ్చాడా యేవిఁటే వాణ్ణి వెనకేసుకు మాట్లాడుతున్నావు? నీకు నేను చచ్చిపోవాలని వుందికాబోలు!

మీ—యేవిఁటో మతిపోయినమాటలు! అత్తగాడు రేపో నేడో వొచ్చి, యిలాంటి మాట్లన్నందుకు మన్నోట్లో గడ్డిపెడతాడు.

లు—అత్తగాడెవడు. వాళ్ల కొట్లో రావఁనాథాయ? మరెక్కడో స్తానువాడు! యిహ నాకు నావృద్ధి.

మీ—మీకు చావేం వొచ్చిందని యిప్పుడు? ఒకవేళ రెండోపెళ్లిపిల్ల అయితేమాత్రం గుప్‌చుప్ అని వూరుకోవాలిగాని, అల్లరిచేసుకుంటారా? యీరోజుల్లో యెంతమంది రెండోపెళ్ళి చేసుకుని సుఖంగా ఉన్నారు కారు? పిల్ల బుద్ధిమంతురాలు, మీ అదృష్టంవల్ల దొరికింది మాట్లాడక ఊరుకోండి.

లు—నా అదృష్టం తగలబడ్డట్టే ఉంది. నీకేం పోయేకాలం వొచ్చిందే? నువ్వు కూడా యీకుట్రలో చేరి, నీతండ్రికి కళ్ళుకప్పి వెధవపెళ్ళి చేశావే. అయ్యో! వెధవని పెళ్ళి చేసుకున్న తురకవెధవా ఏబుద్ధెక్కడికి పోయిందిరా? నీచదువెక్కడికి పోయిందిరా? నీవేదం తగలబడనూ — యిహ బతకను!

(మీనాక్షి నవ్వును)

లు—నవ్వుతావేఁవేఁ భ్రష్టాకారముండా? నువ్వూ, నీపినతల్లీ నన్ను చంపేసి రాజమహేంద్రవరం పారిపోయి, వెధవపెళ్ళి చేసుకుంటారు. నాకు తెలుసును. గిరీశం

పెళ్లి, అని వెఱ్ఱులు వేశకండి. పూజారి గవరయ్యని పిలుస్తాను; ఆతగాడు యింత మంత్రించి వీభూది యిస్తాడు రాసుకు పడుకోండి.

లు—కొంపతీస్తావా యేమిటి? వాడొస్తే, వాడితో యేవఁని చెప్పడం? దాన్నే నిజం అడుగుదూ.

మీ—నేనడగను. నాన్నా నువ్వు అడ్డవైఁన మాటలూ అంటూంటే, నే నెందుకు అడుగుతానూ? నేను దాంతో యికమాట్లాణ్ణు.

లు—నాతల్లివి కాదూ, అడుగమ్మా.

[మీనాక్షి పైకి వెళ్ళెను.]

ఓపన్నం యాకర బెట్టేదా? గాయత్రీ స్మరణచేసేదా?

వేదాలూ, మహామంత్రాలూ, యీదెయ్యాలకి పేలపిండి వొడియాలు, శాబర మంత్రాలు ఉపదేశం అవుదావఁంటే, బెడిసి గొడతాయేమో అని భయం యేవిఁ సాధనం? “రామనామతారకం” స్మరణచేస్తాను. “రామనామ తారకం। భక్తి ముక్తిదాయకం। జానకీమనోహరం। సర్వలోకనాయకం। రామనామ తారకం। రామనామతారకం” యీముండ ఇంట్లో ఉంటే నే బతకను. “రామనామ తారకం। రామనామతారకం”॥ రుద్రాక్షమాల యేదీ? [మంచము అంచున కూచుని పరుపుకింద తడివిఁ, రుద్రాక్షతావళం తీయుచుండగా మీనాక్షి ప్రవేశించి.]

మీ—మీమాట నిజవేఁ నాన్నా.

లు—నిజవేఁ.

[మంచముమీదనుంచి క్రింద కూలబడును.]

మీ—[లేవదీసి] నాన్నా! నాన్నా! పడిపోయినావేవిఁ?

లు—యేవీఁలేదు నిజవేఁ నిజవేఁ!

మీ—నిజవేఁను. ఆ మొగుడు యిప్పుడే దానికూడా కనపడి, “ముండా, మళ్ళీ పెళ్ళాడావేఁ? నీకొత్త మొగుణ్ణి పీకపిసికేస్తాను చూడు” అన్నాట్ట.

లు—అయ్యో! అయ్యో! రామప్పంతులు యిల్లు వొల్లకాడు కానూ! యెక్కడ కల్పించాడే యీమాయపెళ్ళి నాకోసం! వీడి పిండం పిల్లులికి పెట్టా! అయ్యో! అయ్యో! ఆ మొగుడు వెధవ యెలా వున్నాడందే?

మ—వాడు రోజూ దానికి కనపడతాట్ట నాన్నా. వాడికి మీసాలూ, గిరజాలూ వున్నాయట, చావం చాయంట.

లు—వాడే నే! యేవిఁటే సాధనం? యిహ నేం దక్కను.

మీ—పూజారి గవరయ్యకి కబురు పెడతాను.

లు—వొద్దు, వొద్దు, నామాట విను. వాడొచ్చాడంటే యిల్లు తినేస్తాడు.

మీ—తిండితింటాడు. ప్రాణంకంటేనా యేవిఁటి?

లు—నాకొద్దంటూంటే వినవుగదా. నువ్వు నామంచండగ్గిర పక్కేసుకుపడుకో; నువ్వు చదువుకునే భాగవతం పుస్తకం పట్రా; తలకింద పెట్టుకు పడుకుంటాను.

[మీనాక్షి వెళ్ళును.]

యీముండ నాయింట్లోంచి విరగడై పోతేనే గాని, యీపిశాచం వొదిలిపోదు. వేదం చదువుకున్న ముండాకొడుకుని, నామీదే పడ్డతరవాత, వీడు బ్రహ్మరాక్షసి గాని, వొట్టిదెయ్యం కాడు. పోనీ అతడినేప్రార్థనచేస్తాను— "నాపెళ్ళాం మొదటి మొగుడా!" ఆఁ! నాపెళ్ళాం కాదు లెంపలు వాయించుకుంటాను. "యీపిల్ల మొగుడా! నువ్వే నిజవైఁన మొగుడివి—నేనుకాను దాన్ని ముట్టను—తాకను—దాంచేత చాకిరీఅయినా చేయించను నన్ను రక్షించి, పీఁపిసికెయ్యకు; యేం పాపం చెయ్యకట్లో దెయ్యానివైనావు నన్ను చంపావంటే బ్రహ్మహత్య చుట్టుకుంటుంది. మరిజన్మం ఉండదు బాబూ! నాయనా! తండ్రీ! నాజోలికి రాకు నీమావఁగారిపీక నులికెయ్యి! ఆరావఁప్పంతులుగాడి పీకనులివెయ్యి, (కేకలు, యేడ్పు వినబడును) ఓరి దేవుఁడా, వచ్చీ వొచ్చాడు కాబోలు [శిష్యుడు ఏడుస్తూ పరిగెత్తివచ్చి లుబ్ధావధాన్లును గట్టిగా కౌగిలించుకొనును. మీనాక్షి శిష్యుణ్ణి చీపురుకట్టతో కొట్టబోవును. శిష్యుడు తప్పించుకోగా దెబ్బలు లుబ్ధావధాన్లకు తగులును.]

మీ—ముండా! నామోహరు అక్కడ పడేస్తావా పడెయ్యవా! నాతాళం యేదే లంజా?

లు—నన్ను కొట్టేశావేవిఁటే? [శిష్యుడితో] వొదులు, నన్ను ముట్టుకోకే తల్లీ [మీనాక్షితో] దీని అపవిత్రపువొళ్ళు తగిల్తే చచ్చిపోతాను నన్ను వొదలిపించెయ్యి.

[మీనాక్షి శిష్యుడి రెక్కలుపట్టి లాగి, బుగ్గగిల్లును. శిష్యుడు మీనాక్షి చెయ్యికరిచి పారిపోవును.]

మీ—దానమ్మ కడుపుకాలా, చెయ్యి కరిచేసింది నాన్నా రక్తం బొటబొట కారుతూంది—దీన్ని హతవాఁరుస్తాను.

లు—యంతదారుణప్పని చేసిందీ, ముండ! యేదమ్మా చెయ్యి [గుడ్డపీలికతో రక్తం తుడిచి, మొహారుగడిగావుగదా యక్కడదేవిఁటీ?

మీ—ఆతండ్రి వెధవ నాకిచ్చాని యీముండచేతికి యిచ్చాడు. దీనినక్క వినయాలు చూసి నాపెట్టాబాడా దానికే వప్పజెప్పి, ఆమోహురుదాన్నే దాచమన్నాను. అనుమానవేఁసి యిప్పుడు నామోహరు తెమ్మంటే, "బట్టలపెట్లో పెట్టాను తాళం పోయింది" అంది. తాళం లేకపోతే రోకలితో బుఱ్ఱచితక బాదుస్తాను.

లు — చెయిజేసుకోకు. నీది వెఱ్ఱికోపం. చావగొట్టగలవు జాగ్రత!

మీ — చస్తే యీడిచిపారేస్తాను. ముండ యలా కరిచిందో చూడండీ. ఇంకా రక్తం కారుతూవుంది. మనిషి కాటుకి మందు లేదన్నాడు.

లు — కుంకం — పెట్టమ్మా.

మీ — దానిబుఱ్ఱ చితక బాదిచి మరీ పెడతాను. [మీనాక్షి వెళ్ళును.]

లు — కుండు గొమ్ముల అనుమానం తీరిపోయింది — యిక నిలిచి వాడైన చంపేస్తాడు, కరిచి అదైనా చంపేస్తుంది. వీడిచేతో, దానిచేతో, చావుతప్పదు. ఎంత తప్పు చేసుకున్నానూ! యీచావుపెళ్ళి! అయ్యో! దీన్ని పైకి సాగనంపేస్తే వాడుకూడా నిరగడై పోతాడు. అదే సాధనం — యెక్కడికి తోలెయ్యను? బండీమీద యెక్కించి పట్నం తోలేస్తాను. — అక్కడ గానీ తండ్రి వెధవ కనపడకపోతే మళ్ళీ దెయ్యాల్ని నెత్తిని పెట్టుకుని ప్రత్యక్షం అవుతుందే! బండి అద్దెయిచ్చుకోవడమే మిగుల్తుంది. యేమి సాధనం? — యేమి సాధనం? — రామప్పంతుల్ని సలహా అడుగుదునా? ఆఁ! మంచి ఆలోచన తోచింది — రామప్పంతులు నాకు కట్టిపెట్టిన యీముండని వాడిదగ్గిరకే పంపించేస్తాను — సాని దాంతోపాటు దీన్నికూడా వుంచుకుంటాడు. కావలిస్తే పది రూపాయలు దక్షిణతో కూడా యిచ్చేస్తాను.

[మీనాక్షి ప్రవేశించి]

మీ — యెక్కడా కనబడదు నాన్నా కుంట.

లు — నూతులో పళ్ళేదుగద?

మీ — యేమో!

లు — పరిగెత్తి గవరైని పిలవమను, దాన్ని నువ్వు చావగొట్టలేదుగద?

మీ — కనపడితేనా?

లు — యేవిఁటినాయనా, యీకొత్త ఉపద్రం!

[నిష్క్రమింతురు.]

## ౨-వ స్థలము : రామప్పంతులు యింట్లో కొట్టుగది.

భుక్త, పోలిశెట్టి, సిద్ధాంతి, మధురవాణి పేకాడుచుందురు. పూజారి గవరయ్యా ఆట చూచుచుండును.

పోలిశెట్టి — యేంభష్టాకారి ముక్కలు యేశావయ్యా యెప్పుడూ నువ్వింతేను.

భుక్త — చూసివేశానా యేవిఁటి? నీదరిద్రదేవతని తిట్టు.

పోలి — గవరయ్యా, నీముణుకు నాదగ్గిర యిలా యెట్టకు. లేచిపో, నీపుణ్యవుంటుంది.

గిర—నేను నా మధురవాణిదగ్గిర కూచుంటాను.

భు—చూడూ, ముక్క తప్పు పడ్డట్టుంది.

పోలి—ఆఁ! బాపనయ్యా పంచాలని తప్పు పంచుతున్నావు. తప్పు పంచితే బేస్తు మీద కుదేలెట్టిస్తాను.

భు—ముక్కలు బాగా పడలేదన్నావే?

పో—రెండో యేత నాలుగాసులడకూడదా?

భు—పోలిశెట్టికి ముక్కలువేస్తూ యిదుగో నాలుగాసులేస్తున్నాను జుట్టు.

పో—నీయిషపచేత్తో యేస్తే, పాల్లుముక్కలే పడతాయి; మంచిముక్కలడతాయా?

భు—తథాస్తు!

పోలి—అలా అనకు. యెంత శెడ్డా బాపనాడి శాపనాకారం మాశెడ్డది. [చూచుకొని] శీ! భష్టాకారిముక్కలు!

సి—ఒకటీ, రెండు.

పో—అదుగో, అలా శెప్పితేనే వొప్పను, ఒక్కొకటి శెప్పాలి.

సి—అయితే వకటి.

పో—ఒకటీ,

మధురవాణి—ఒక్కటీ.

భు—వకటి.

[సిద్ధాంతి ఆలోచించును.]

పో—యే టాలోసిస్తావు చేతరస! యెత్తవయ్యా.

సి—నీదేంపోయింది! రెండు.

పో—లాంతరేశావు; యేటెత్తను? రొండు.

మధు—రెండు.

భు—రోఁడు.

[సిద్ధాంతి ఆలోచించును.]

పో—యే టాలోసిస్తావు? చేతరస: యెత్తి బేస్తు గెలుసుకో.

సి—నువు చెప్పావుగనక యెత్తుతాను.

పోలి—ఆఁ! డబ్బుకట్టి మరీయెత్తు. మూడో యెత్తడవుబేస్తు; గాపక వుందా? బేస్తుమీదకుదేలెట్టిఁ బాకీ శెట్టి యెగెయ్యడానికా?

సి—(తనముక్కలు యెత్తు ముక్కలమీద వేసి] కోపఁటాడి పిలకనిగుడుతూంది.

పో—తంతావాయేటి?

సి—తన్నడవంటే, ఒహాలాగనా?

పో—నాఆట శెడగొట్టేశినావు, బాపనయ్యా!

భు—ముక్కాలు పడలేదని యేడుస్తూ, మళ్ళీ యేవిఁటి, ఆట చెడగొట్టాడని యేడుస్తావు?

పో—యీఆట జేస్తుచేయించకపోతే నా పేరు—

సి—కోవఁటాడా, నోరుమూసుకుంటావా మూసుకోవా?

పో—తెల్లాడిబావుటా యెగురుతుండగా, నీజులు వేఁటి? ముక్కాల్తీయడం యింతే న్నైపై తే, మరా లేటి?

సి—నువ్వుగాని మళ్ళీ మాట్లాడావంటే, ముక్కాలు కలిపేస్తాను.

[పోలిశెట్టి "నేను మాటాడను; నువ్వు ఆడు" అని సౌజ్ఞ చేయును. సిద్ధాంతి ఆడును)

పో—మూడే తురుపులు పడ్డాయి బాపనాడా: "తమాషాకేఖో, లంకకేరాజా,"

సి—ఆటపారెయనా?

పోలి—బుద్ధొచ్చింది; బుద్ధొచ్చింది. లెంపలోయించుకుంటాను. మరిమాటాడితే ఒట్టు!

పూజారి—మామధురవాణిమీద ఆశుకవిత్వం చెబుతాను.

రాణా, డైమను రాణీ? ।
రాణా, యిస్పేటురాణి? రాణీకళావ ।
రాణా, ఆఠీనారాణీ? ।
రాణి యీనమ్మధురవాణె, రాజులరాణీ ।

సి—గవరయ్యా! యేంవిలవైన పద్యం చెప్పావోయి! నీమీద నేను పద్యం చెబుతాను–విను.

"గవరయ్యా! నీసరి మరి ।
యెవరయ్యా?"

పూజారి—యెవరులేరు, యిచ్చోనయ్యా!

సి—యిదుగో రాజు,

పోలి—యిదుగోపాల్తు.

[మధురవాణి తురుపు రాణీ వేయును.]

పోలి—అదుగో, అదుగో, యీ బాపనాడు కపీశం శెప్పి మధురవాణిదగ్గిర రాణీ వుందని శెప్పేశాడు. గోరం, గోరం, గవరయగానీ మాటాడితే నే ఆటాణ్ణు.

పూజారి—పోలిశెట్టిమీద కవిత్వం చెప్పి చాలా రోజులైంది. [పాడుం పీల్చి.]

"పోలిశెట్టి ముఖము—పోలిరొట్టెకుబోలు! పోలిశెట్టిముక్కు— పొడుము డొక్కు॥"

పోలి—వొద్దు! వొద్దు! వొద్దు! నాహూటేను. శాపంపెట్టి పంపేస్తావాయేటీ! ఊరుకుంటే వొట్టాయనా, యిన్నావా? యీ ఆట సిద్ధాంతి జేస్తెట్టి, నేను గెలిస్తే, నీకాళ్ళండచ్చిస్తాను మరూరుకో.

సి—నీసాయ తగలడా - తురుపు మిగిలిపోయింది; జేస్తు. (ముక్కలు చూపించి పారవేయును.)

పోలి—ఆఁ! మూడో, యెత్తడబ్బేస్తు. గావకాయించుకోండయ్యా, చేతిదొరకు, మంచిముక్కలెయి, బావనాడా అంతసేపు కలవడవా? గోరం, గోరం

సి—బులబులాగ్గాకలిపి, జేస్తు నీకిస్తాననుకున్నావా?

పోలి—తోలుసేత్తో ముక్కలేసినావు! “నరసింవ్వ, నీదివ్వె నామంతరము శాత!
నరసింవ్వనీదివ్వె—”

సి—దివ్వేలేదు, దీపంలేదు ముక్కల్తియ్యి.

పోలి—గవరయ్య ముక్కలమీద కన్నేసి సిల్లంగెట్టేస్తున్నాడు. నరిశింవ్వ నీదివ్వె— (ముక్కలు యెత్తిచూసి) నీ భష్టాకారి ముక్కలేశావు.

సి—[పంపకంముగించి తనముక్కలు తీసి చూచుకొని] మృత్తికాచవే!

పూజారి—పోలిశెట్టికి అంత అలకైతే, నేనింటికిపోయి పరుంటాను.

[గవరయ్య నిష్క్రమించును. మధురవాణి వెంటవెళ్ళి తిరిగి వచ్చును.]

పోలి—శని విరగడైపోయిందిరా, దేవుఁడా!—ఒట్టిభష్టాకారిముక్కలు. ఒహాటీ.

మధు—ఒకటి.

భుక్త—ఒహాటీ.

సి—ఒహాటీ.

పోలి—రెండు.

మధు—రెండు.

భుక్త—రెండు.

[సిద్ధాంతి ఆలోచించును.]

పోలి—యెందుకాయెత్తాలోశన? నామాటినుం. మూడో జేస్తెట్టను.

[వీధితలుపు తట్టబడును.]

మాధు—పంతులు!

పోలి—యీవాళ రాడని సెప్పితివే?

మధు—రారనుకున్నాను వొచ్చారు. యేంచేదాం?

సి—ఆట తీసెయ్యండి. [ముక్కలు పడవేయును.]

పోలి—జేస్తెగెయ్యడానికా? నేనొవ్వను. మధురోణీ! ఆటాడి మరీ తలుపుతియ్యి.

మధు—ముక్కలు కిందబెట్టి, లేచి [సన్ననిగొంతుకతో] గోడగెంతి పారిపోండి.

పోలి—దొడ్డితోవంట వెళ్ళిపోతాం.

భుక్త—నేను పట్టనే? యేటిసాధనం?

భు—మేం దిడ్డీతోవంట పోతాం. నువ్వు ఆట కెక్కు.

పో—నన్నెక్కించి మరీ యెళ్ళండి, కాలుజారితే యేటిసాధనం?

సి—నీకొడుకుది, అదృష్టం.

[పెరటిలోకి వెళ్ళును.]

పో—గోరం! గోరం! గోరం! యవడిముక్కాలు ఆడిదగ్గిరే! ఆట కలపకండి.

[తలుపు తిఁగి తట్టబడును.)

పో—నరిశింవ్వ, నీదివ్వా—

[మధురవాణి ఊరుకొమ్మని కోపరసంగా సౌజ్ఞ చేయును.]

(సిద్ధాంతి ప్రవేశించును.)

సి—దిడ్డీతలుపు కప్పతాళం వేశుంది. మన్ని పట్టుగుందావఁనే, పంతులు దిడ్డీతలుపు తాళఁవేశాడు.

పోలి—నరశింవ్వ, నీజివ్వా—

మధు—[పోలిశెట్టి ఉద్దేశించి] చప్! [సన్నని గొంతుకతో] ఊలక్కుండా యీ గదిలో కూచోండి ఆయనవరున్నతరవాత వచ్చి తలుపుతీసి వొదిలేస్తాను.

(మధురవాణి దీపములు ఆర్పి, పైకివెళ్ళి, గదితలుపువేసి గొళ్ళెము బిగించును.)

[తలుపు తిరిగి తట్టబడును.)

మధు—యేవీఁ గవరయ్యా చాదస్తం! అదే తట్టడవాఁ? [వీధి తలుపుదగ్గిరకు వెళ్ళి) యెవ్వరు?

తలుపవతల మనిషి—యింతసేపేం?

మధు—నిద్దరబోతున్నాను.

మనిషి—పేక! పేక! పేక! నిన్నొదిలేస్తాను. నీసంగతి వాకు తెలిసింది.

మధు—మరి, మీ మానాన్న మీరు పోయి, నిశిరాత్రివేళ నొక్కర్తెనీ నన్ను వొదిలేస్తే యీఅడివిపుల్లో నాకు భయంకాదా? అంచేత పల్లిగ్గా నలుగుర్ని పిలిచి పేకాడుతున్నాను. తప్పేవుఁది? మంచుపడుతూంది లోపలికి రండి. [తలుపు గడియతీసి] రండి. నాఆట మీరాడండి, నేను వరుంటాను.

మనిషి—సాందాన్ని యవడు నమ్మమన్నాడు? నీకిద్దావఁని సంతోషంతో వకసరుకు తెచ్చాను నీచర్య చూసేటప్పటికి నామనస్సు చివుక్కుమనిపోయింది.

మధు—యెంత న్యాయంగా సంచరించినా, మీహృదయంలో కాసింత కనికరంలేదు గదా? యీనాటినుంచి మీరు యెక్కడికి కదూను వెళుతూ ఉంటే, అక్కడ కల్లా నేనుకూడా మీతో వొస్తూవుంటాను.

మనిషి—మెడపైకి ఉంచు (మధురవాణి అటులచేయును ఆమనిషి మధురవాణి మెడలో కంటె ఉంచును.]

మధు—ఔరా! యింద్రజాలి! పంతులు గొంతుక యెలాపట్టావు? నన్నే మోసపుచ్చితివే? [రెక్కపట్టుకొని] గదులోకిరా. [గదులోనికి తీసుకువెళ్ళును] యీచిల్లంగి కళ్ళు నీకే దేవుఁడిచ్చాడు? [ముద్దెట్టుకొనును] వాళ్ళింట యేవేఁవిఁ చిత్రాలు చేశావో చెప్పు.

శిష్యు—ముద్దెట్టుకోనంటే, చెబుతాను?

మధు—నీకు తగనో?

శిష్యు—ముద్దెట్టుకుంటే యెంగిలౌతుంది.

మధు—నిజం నీకున్న బుద్ధి నీ పెద్దలికి లేదు. నన్ను నిష్కారణంగా భయపెట్టావు అందుకు నీ కేవిఁటి సిక్ష? బుగ్గకొరికేతునా?

శిష్యు—పాలూ పంచదారా ఉంటే ఇయ్యి.

మధు—తరవాత మేపుతాను, ముందు నీకు దాసరివేషం వేస్తాను. కొత్త అగ్రహారం పోయి నీగురువును చేరకుందు గాని, [తెర దించవలెను.]

(చీకటిగదిలో పోలిశెట్టి, భుక్తం, సిద్ధాంతి ఉందురు అవతలనుంచి రామప్పంతులు గొంతుకతో, శిష్యుడు "యీగదులో యవణ్ణో దాచావు]"

మధు—రామ! రామ! యవ్వడూ లేడు.

[పోలిశెట్టి నిచ్చెనయెక్కును భుక్తంకూడా యెక్కబోవును నాలుగు మెట్లెక్కి యిద్దరూకింద బడుదురు.]

పోలి—సంపేశినావు, బాపనాడా!

భుక్త—నామీద నువ్వుపడి, నేను ఉక్కిరిబిక్కిరి ఔతుంటే, నువ్వు సచ్చానంటావేవిఁటి? లేస్తావా కరిచేదా?

శిష్యు—[రామప్పంతులుగొంతుకతో] అదుగో లోపల యెవళ్ళో మాట్లాడుతున్నారు లంజా! అది కోవఁటాడిగొంతుకలావుతుంది. కప్పతాళంవేసిఊరందరినీ లేవదీసుకొస్తాను

మధు—కప్పతాళ వెందుకు? లోపల యెవళ్ళూలేరు దెయ్యాలకొంప—దెయ్యాలు దెబ్బలాడుతున్నాయి.

[మధురవాణి తలుపుతీసిగదిలో ప్రవేశించి అగ్గిపుల్ల వెలిగించును. శిష్యుడు పక్కకి తొలగిపోవును ]

మధు—పోలిశెట్టియేమి, పడుకునిలేవడు—మేలుకొలుపులు పాడనా.

భు—రామప్పంతులేడీ?

మధు—రామప్పంతులూ లేరు. గీమప్పంతులూ లేరు. యింట్లో పనిచేసేవాడు తలుపు కొట్టాడు. బెంగెట్టుకోకండి.

భుక్త—అతగాడి మాటలు వింటేను?

మధు—నేనే ఆయన గొంతుక పెట్టి మాట్లాడాను. యేమి ధైర్యం! యేమి మగతనం!

పోలి—నరిశింవ్వ, నీదివ్వో" (లేచి) నామమంతరము నేతో"—యవడి ముక్కలాడి దగ్గిరున్నాయా?

[అంతా మళ్ళీ ఆటకు కూర్చుందురు]

సి—ఆట కలిపేశాను.

పో—గోరం గోరం! నాకు యిస్పేటు ఆసు డాడవ వొచ్చిందిగదా, బేస్తులు గెలుసుకపోదునే! గోరం! గోరం! మధురోణి వొట్టినే బెంబేరు పెట్టేసింది. ఆటక మీంచి పడి నడుం విరిగిపోయిందిరా దేవుడా.

భు—నీకింద పడి నేను నలిగిపోయినాను. నీకేం తీపు దిగదీసింది?

పో—కలిపి యెయ్యి - ముక్కలు.

సి—నేను కలపను నావొంతు అయిపోయింది - నువ్వు కలుపు.

పో—యేమైపోయింది?

[రామప్పంతులు వీధితలుపులు తట్టును.]

రామ—లక్ష్మీ, లక్ష్మీ, తలుపు.

మధు—యీమాటు పంతులే.

పోలి—యేటి సాధనం?

మధు—గోడగెంతి వెళ్ళిపోండి.

పోలి—నేను గెంతలేనే?

మధు—నిన్ను యీగదిలో పెట్టి తాళం వేస్తాను.

పోలి—దీపం—ఆరిపెయ్యకు. నాకు బయవేస్తుంది.

సి—గాజుపెంకులు గుచ్చుకుంటాయి; గోడదాటడం యెలాగ?

భుక్త—నాకు కాళ్ళు మేహవాతం నొప్పులు. నేను గెంతలేనే?

మధురవాణి (దీపమార్పి) యిలాగే వుండండి.

పోలి—నరశింవ్వ—

మధు—చప్.

పోలి—సచ్చాను.

మధురవాణి—(గదిగొళ్ళెంవేసి, వీధితలుపు గడియతీసి తలుపు ఓరగావుంచి) మాయ గుంటని యెక్కడ దాచారు?

రామ—మాయగుంట యేమిటి?

మధు—యేం నంగనాచే? లుబ్ధావధాన్లు మాయపెళ్లాన్ని వాళ్ళయింట్లోంచి లేవదీసుకుపోయి యెక్కడ పెట్టారు? యిదేదా, రాత్రల్లా మీరు చేస్తూవున్న లౌక్య వ్యవహారం?

రామ—నీమాట నాకేవీఁ అర్థంకాకుండా వుంది. యింట్లోంచి లేవదీసుకు పోవడవేఁవిఁటి? నేను దాచడవేఁవిఁటి?

మధు—దాస్తే దాచారు. దాచకపోతే మానారు. నాకంటె యేదీ?

రామ—నీకెంటూ? మరచిపోయినానుమునీ.

మధు—యేమిచిత్రం! నన్ను మరిచారు—నా వస్తువ అని, మరిచారు. ఎరిచి, అగుంట, కిచ్చారు. దాన్ని లేవదీసుకుపోయి యెక్కడో దాచి, నిశిరాత్రివేళ పెద్దమనిషిలా యింటికి వొచ్చారు.

రామ—ఆగుంట కనపడదా యేవిఁటి?

మధు—యేవిఁ నాటకం? మీకు కనపడకేం? మీరు పెట్టినచోటే వుంది.

రామ—మీనాక్షి తన్ను తగిలేశిందాయేవిఁటి? కంటెతో తగిలేస్తే చచ్చానే?

మధు—యేవిఁ నాటకం! చావండి; బతకండి; ఆకంటె తాండీ, గడపలో కాలు పెట్టనివ్వను.

(తలుపు వేయును)

రామ—నాలుగుకోసులు గుఱ్ఱపుసవారీ అయి, యీదురోసుని యిల్లు చేరుకుని, గుమ్మంలో అడుగుపెట్టేసరికి, మబ్బులేని పిడుగుపడ్డది మీనాక్షి ఆగుంటని మన్ననిస్తుందని, నేను యెన్నడైనా అనుకున్నానా యేవిఁటి? ఆగుంట పోతే పోయింది, ఉంటేవుంది, నాకంటె పోకుండా వుంటే అదృష్టవంతుణ్ణి. కంటె అడగడానికి వెళ్తే, 'నువ్వే యీ పెళ్ళి కుదిర్చావు' అని కఱ్ఱుచ్చుకుంటాడేమో!

(నిష్క్రమించును)

## 3-వ స్థలము: లుబ్ధావధాన్లు యింటివాకిలి.

[లుబ్ధావధాన్లు పచారుచేస్తూ]

కనపడకపోతే యేమైనట్టు? నూతులోగాని పడిందా? పోలీసువాళ్ళు యిల్లు దోచేస్తారు. నూతిలో పడలేదా? పడకపోతే యేమైనట్టు?—రామప్పంతులు యింటికి పోయుంటుంది. అంతేకావాలి—యెంత అందమైన పిల్లా! నాదిగాక దురదృష్టం! యెంతట్లో వెన్నెలచీకటైంది! రేపోయెల్లుండో యెదిగొచ్చేపిల్లగదా అని సంబరపడ్డాను—ఒహవేళ అప్పుడే, పెద్దమనిషైందేమో?—అందుకు సందేహ వేఁలా? లేకుంటే యింతయేపైన పిల్ల పెద్దపడుచు కాకుండా వుంటుందా? యిలాం

టివి యెన్నిపెళ్ళిళ్ళు చేసుకుని యెందరు మొగుళ్ళని కడతేర్చిందో? ఓరి కుంక పీనుగా, నీకళ్ళు యేమైపోయినాయిరా? రజస్వలాముండని చూస్తూ చూస్తూ యెలా పెళ్ళాడావురా? ఇక నీకు గతులు లేవు. రాజమహేంద్రవరంలో వెధవ ముండల్ని పెళ్ళాడినవాళ్ళ సామాజికంలో చేరేవురా? అయ్యో! అయ్యో! దీనికిమరి ప్రాయశ్చిత్తం ఎక్కడిది? ఒహవేళ చేయించుకుందావంటే, శంకరాచార్యులు పాదకట్టం పెట్టమంటాడు. బ్రాహ్మలు యిల్లుతినేస్తారు. అంతకంటె పోలీసువాళ్ళు నయం. అల్లరికాకుండా హెడ్డుచేతిలో పాతిక రూపాయిలు పెట్టి రేపు రాత్రి బయలేరి కాశీపోయి, గంగలో మునిగానంటే అన్ని పాపాలూ పోతాయి. కాశీవాసవేఁ చేసుకుంటాను. భగవంతుడు బుద్ధొచ్చేటట్టు చేశాడు. లేకుంటే ముసలివెధవకి పెళ్ళిచేసుకోవడవు పోయీకాలవేఁవిఁ? అన్నివిధాలా యీ రామప్పంతులు నాకొంప తీశాడు.

[రామప్పంతులు ప్రవేశించి]

రామ—యేవిఁటీ మావాఁ రావఁప్పంతులంటున్నారూ?

లు—యేవీఁ లేదు.

రామ—యింతరాత్రివేళ పచార్లుచేస్తున్నారేవిఁ?

లు—యేమీలేదు—నిద్దరపట్టక.

రామ—మావఁగారూ, ఆకంటె యిప్పుడు తెమ్మని మధురవాణిశిష్యురాలు కూచుంది? శ్రమ అని ఆలోచించక యిప్పించాలి.

లు—కంటేవిఁటి?

రామ—మీభార్యకి పెట్టిన కంటండీ!

లు—నాభార్యకి నేను పెట్టలేదు.

రామ—మీరు పెట్టకుంటే యెరువు తెచ్చాననుకోనా?

లు—నేను పెట్టమన్లేదు.

రామ—అయితే దొబ్బేసారా యేవిఁటి? మీభార్యమెళ్ళో యిప్పుడాకంటె లేదూ?

లు—నాభార్య యెవరు? నాభార్య నాడే చచ్చింది.

రామ—మొన్న మీరు పెళ్ళిచేసుకున్నపిల్ల మీభార్య కాదటయ్యా?

లు—రెండోపెళ్ళిముండ నాకు భార్యే యేవిఁటి?

రామ—రెండోపెళ్ళి ముండేవిఁటి?

లు—రెండోపెళ్ళిముండ అని నువ్వే అన్నావు.

రామ—మాటమీద మాటొచ్చి, వొట్టిసే అంటే, అదో దెప్పా?

లు—వొట్టినే అనలేదు. అట్టే అన్నావు. యిదంతా, ఆగుంటూరుశాస్త్రుల్లూ నువ్వూ చేసినకుట్ర; నాకు నిజం తెలిసిపోయింది. ఆముండ నీయింటికే వెళ్ళింది. మధుర

వాణిని వుంచుకున్నట్టు దాన్నికూడా నువ్వే వుంచుకో. నాజోలికి రాకు నీకు పది వేల నమస్కారాలు.

రామ—నాకంటె నాకియ్యమంటే, యీవెఱ్ఱివెఱ్ఱిమాట లేమిటయ్యా?

లు—నీమాయ యెఱుగుంటా. నీకంటే నీయింట్లోనే ఉన్నాయి.

రామ—యీవేషాలు నాకు పనికిరావు. నిలబెట్టి నాకంటె పుచ్చుకుంటాను.

(తడిసిన భాగవతపుస్తకం పట్టుకుని మీనాక్షి చేతులోకఱ్ఱా నెత్తిమీద పసుపు రాసినకుండా, అందుమీద అఖండంతో అసిరిగాడూ, చేతిలో సీసాపట్టుకుని, తడిబట్టలతో పూజారి గవరయ్యా ప్రవేశింతురు.)

పూజారి—హ్రాం! హ్రీం! హ్రూం! ఓంకారభైరవీ!

[రామప్పంతులు భయమును కనపర్చును.]

మీనాక్షి—యెక్కడా కనబళ్ళేదు నాన్నా, యీపుస్తకం నూతులో పడేశింది.

[లుబ్ధావధాన్లు భయమును కనపర్చును.]

రామ—కనపడక పోవడం యెవరు?

మీనా—నానవితల్లి—గవరయ్యాబాబు నూతులో దిగి అంతటా గాలించాడు. నూతులో మరేవీఁ కనపడలేదు.

[లుబ్ధావధాన్లు భయం తగ్గును.]

బ్రహ్మరాక్షసిని గవరయబాబు యీసీసాలో బిగించాడు నాన్నా.

(రామప్పంతులు సీసాకి యెడంగా నిలబడును.)

రామ—బ్రహ్మరాక్షసియేవిఁటి?

లు—వేరే ఓబ్రహ్మరాక్షసి వొచ్చి—మీఅమ్మని భయపెట్టింది.

మీనా—నన్నుకాదు-మానాన్న పీకపిసికేసింది.

రామ—గవరయగారూ, పిల్ల యేవైనట్టు?

గవర—దానిమొగుడు యెగరేసుకుపోయినాడు.

మీనా—యెక్కడికి యెగరేసుకు పోయినాడు? వాడు యీసీసాలోనే ఉన్నాడన్నారే?

గవ—(కొంచం ఆలోచించి-చిరునవ్వు నవ్వి) అదీ యీసీసాలోనే ఉంది.

మీనా—మనిషి సీసాలోకి యెలా వొచ్చింది?

గవర—అరొర్యా సత్యకాలవాఁ! అది మనిషా అనుకొన్నావు? అది కామినీపిశాచం అంచేతనే నేను మీయింటికొచ్చి నప్పుడల్లా దూరంగా వెళ్ళిపోయేది, యేమి చెప్తాం, అనుకునేవాణ్ణి.

మీనా—యిద్దర్నీ ఓసీసాలో పెడితే దెయ్యప్పిల్లల్ని పెడతాయేమో?

గవర—పంతులుగారూ చిత్తగించండీ, రెండుమనుషులబసువుందో లేదో చూడండీ.

రామ—మెుర్రో! నాదగ్గిరకి తేకయ్యో.

గవర—ఆసిరిగా నువ్వు పట్టుకో.

ఆసిరి—నాకు బయవేటి? పైడితల్లి చల్లగుండాలి – (సీసా పట్టుకుని) ఓలమ్మ! ఎంతి బలువుందోస్సి!

గవర—సీసా, అఖండం, తులసికోటదగ్గిర దించు.

లు—బాబ్బాబు సీసా నాయింట్లో పెట్టకు. మీయింట్లో పెట్టించండి.

గవర—మాపిల్లలు తేనెసీసా అని బిరడా తీసినట్టాయనా, రెండు దెయ్యాలూ వొచ్చి మళ్ళీ మీయింట్లోనే ఉంటాయి.

లు—అయితే సీసా భూస్థాపితం చెయ్యండి.

గవ—భూస్థాపనం మజాకా అనుకున్నారా యేమిటీ? భూస్థాపితం చెయ్యడానికి యెంత తంతుంది! పునశ్చరణ చెయ్యాలి.

లు—నాయిల్లు గుల్ల చెయ్యాలి!

గవ—మీకలా తోస్తే నాకేం పోయింది? యీమూత తీసేసి, నామానాన్న నేను వెళ్ళిపోతాను.

లు—మూతెందుకు తీసెయ్యడం. నాకు కలిగినది తృణమో కణమో యిస్తాను. ఆమూత తియ్యకుండా ఆసీసా అలావుంచి వెళ్ళండి.

పూజారి—యేవీఁ అవధాన్లుగారి గడుస్తనం! నేపోగానే పాతిపెట్టడానికా యెత్తు? ఆసీసాః తగిన శాంతి చెయ్యండీ భూస్థాపితం చేశారంటే, నేను రౌరవాది నరకాలకి పోనా? యిప్పుడే బిరడా తీసేస్తాను.

లు—తియ్యకు, తియ్యకు. నేపు ఆశాంతేదో తగలేతుగాని.

గవ—ఆల్లాగైతే యీరాత్రల్లా యీసీసా దగ్గరపెట్టుకు పెరట్లో పడుకుంటాను. మీరు వెళ్ళి నిర్భయంగా పడుకుని నిద్రపోండి.

(నిష్క్రమించును)

రామ—మావాఁ! ఓమాట.

[రామప్పంతులూ, లుబ్ధావధాన్లూ పక్కకి వెళ్లి మాట్లాడుదురు.]

లు—నాకంటె మాటేవిఁటి, మావాఁ?

లు—మీకంటె మీయింట్లోనే ఉంది.

రామ—మీ పెళ్ళాం మాయింటికి వెళ్లిందని మీరంటున్నారుగాని, అక్కడికి ఆపిల్ల రాలేదు. కంటే తాలేదు.

లు—అయితే యేవైఁందో నాకేం తెలుసును?

రా—వొద్దువుమండీ—నాకంటె నాకిచ్చెయ్యండి—నేను మాకానివాణ్ణి.

లు—కంటె, గింటె నాకు తెలియదు.

రా—నీకు తెలియకపోతే మరెవడికి తెలుసును? గవరయ్య, నీపెళ్ళాం దెయ్యవైఁ దన్నాడుగదా? నువ్వూ నీకూతురూ కలిసి దాన్ని చంపేశారుకాబోలు.

లు—ఓరి! గాడిదకొడుకా (కఱ్ఱతో కొట్టబోవును)

రా—నాకంటె అపహరించావుగదా? నీపని పట్టిస్తానుఉండు. (నిష్క్రమించును)

లు—(తనలో) కంటె యేమైనట్టు చెప్మా? (పైకి) అమ్మీ!

మీ—యేం నాన్నా?

లు—కంటె యేంజేసిందే?

మీ—యేంజేసిందో? పెట్లో దాచిందేమో? దానివొంటినే ఉఁదిగాబోలు నాన్నా?

లు—వొంటినుండే దెయ్యానికి కంటెందుకూ?

మీ—యేం? తీపు దిగదీసిందా యేవిఁటి? పెట్టుగుంటుంది.

లు—నూతులో దిగి గవరయ్య నుయ్యంతా గాలించాడూ?

మీ—గడియసేపు గాలించాడు.

లు—నువు చూశావా?

మీ—చూశాను.

లు—అది రావఁప్పంతులు యింటికే వెళ్ళిందేమోనే?

మీ—గవరయబాబు, సీసాలో బిగించాడుగదా యెలా వెళుతుంది?

లు—యేమో నాకేం పాలుపోకుండా ఉంది. రా పరుండాం - మన ప్రారబ్ధం యిలా వుంది. (నిష్క్రమింతురు)

## ౨-వ స్థలము: రామచంద్రపురం అగ్రహారంలో సారాయి దుకాణం వెనకతోట.

[ఆతోటలో కాళీమందిరం యెదటిమంటపం. మంటపంలో కాళీవిగ్రహానికి యెదురుగుండా ఒకపెద్దపీటమీద మూడుసీసాలతో సారాయి, చుట్టూ గళాసులు, పీటనిండా పువ్వులదండలు, మంటపంలో వకవైపు పులిచర్మంమీద యోగదండమును ఆనుకుని సమాధిలో ఉన్న వొక బైరాగి; యోగినియొకతె సారాయి అందరికీ అందిచ్చును. గ్రామమునసబు సోమినాయుడు చిలుం పీల్చుచుండును. సాతాని

మనవాళ్ళయ్యా, జంగం వీరేశ, దుకాణదారు రామందాసు చెదిరి చెదిరి కూర్చుందురు]

మునసబు—ఆకాశం ముందు పుట్టిందా? బూమి ముందు పుట్టిందా?

మనవాళ్ళయ్యా—మృత్తి ముందా! కారు ముందా?

మునస—పంగనామాలు మూంపా పట్టెవోర్దనాలు ముందా? నామాలోడా నాసవాలేటి? నీజవాబేటి? ఆకాశానికి సుట్టాబూమి? బూమికి కప్పా ఆకాశం? సదువుకునోన్ని డెవడో సెప్పండొస్సి—

మనవాళ్ళయ్యా—ఆకాశంబు సూన్యంబు అనగా యేమీ లేదన్నమాట.

మునస—యేటీలేదా? గుడ్డోళ్ళకి యేటీలేదు. తెల్లోడు యెర్రోడా? పట్టంలో గొట్టా లెట్టి అదే సూస్తాడే ఆకాశంకేసి?

మనవాళ్ళయ్యా—శాస్త్రంబులలోని రహస్యంబు మ్లేచ్ఛుల కెట్లు తెలియును?

మునస—అల్లాండం, బెల్లాండం. శక్కరపొంగలితినడమనుకున్నావా, నామాలోడా? తెల్లోడిమహిమ నీకేటి తెలుసును! తెల్లోడి సారాయికి, తెనుగోడి సారాయికి యెంత బేధం వుందో, తెల్లోడికి నీకూ అంత బేధం వుంది.

మనవాళ్ళయ్యా—గణితశాస్త్రంబునందాకాశంబనునన్న-నున్న యనసూన్యంబు-యేమీ లేదన్నమాట.

వీరేశ—చాత్రంలో మన్ను,మిన్ను,అని అన్నాడుకాడా? మన్ను లేదా? మన్నుంటే మిన్నుండదా?

మునస—యీరేచ మామేలయిన పలుకు పలికినాడు.

వీరేశ—"ఆకాశం బొక్కడ్డది!" అంటురుగదా, ఆకాశంలేకపోతేబొక్కడ్డవెలాగ?

మునస—శబాసు యీరేచ! నామాలోడు పలకడేం నోరు కట్టడ్డది.

వీరే—(శంఖం పూరించును)

హెడ్డు—(దుకాణదారునితో) ఏమిటే అల్లరిభాయి?

మునస—యీరేచం గెల్చుకున్నాడుగదా, చంకం వోగించడా?

దుకాణదారు—గురోజీగారి సభాదికి బంగంవొస్తే శపించిపోతారే?

బైరాగి—(కళ్ళు తెరిచి) శివబ్రహ్మ! శివబ్రహ్మం! శివబ్రహ్మం! శివోహం!

వీరేశ—చూశావు సేస్తం, చినబ్రెమ్మం అన్నారు.

బైరాగి—రామబ్రహ్మం! రామబ్రహ్మం! రామోహం!

మున—మొదటిమాటను రెండవమాట రద్దుచేయును. రామానుజ! రామానుజ!

వీరేశ—చివచివా! భివచివా!

దుకాణదారు — యెందుకు కాట్లాడతారు. నీశివుఁడూ నిజవేఁ అడుగో ఆసీసాలో యెలుగుతున్నాడు, నీరాముఁడూ నిజవేఁ. అడుగో ఆసీసాలో యెలుగుతున్నాడు. వినలేదా తత్త్వం?

గాజుకుప్పెలోను గడగుచు దీపంబు
యెట్టులుండు జ్ఞానమట్టులుండు
తెలిసినట్టివారి దేహంబులందును
యిశ్వదాభిరామ యినరవేమా.

బైరాగి — సత్యం, సత్యం.

దుకాణదారు — గురోజీ! తమకి అంతా యెరికవేఁ! దేహము గాజుకుప్పె, దేహంలో ఉండేది అన్నసారం. యీ అన్నసారం దేహంలో పడితే గాని పరమాత్మ పెజ్జిలించదు. యేం శలవు?

బైరాగి — యీపరమరహస్యం నీకు యెలా తెలిసింది తమ్ముఁడా?

దుకా — తమవంటివారి దయవల్ల గురూ! (నలుగురివైపూ చూసి) చూశారా బాయీ నేను యెప్పుడూ యీమాటేగదా చెపుతూ ఉంటాను? అఖాడాకి వొస్తేగాని పరబ్రెమ్మం పట్టుపడ్డం యేలాగు?

బైరాగి — అమృతమనేది యేమిటి? సారాయే! నాడు యిదేగదా తాగడానికి దేవానురులు తన్నుకు చచ్చారు?

వీరేశ — చివచివా! చివచివా!

మనవాళ్ళు — రామానుజ - రామానుజ!

మునస — కాట్లాటమాని ఘానం వినండొస్సి, యెఱ్ఱిగొల్లోళ్ళు.

హెడ్డు — గురూ! మరివొక రసలింగం చేయించి, శిష్యుడికి దయచెయ్యాలి.

బైరా — అలాగే.

మునస — గురూ! బంగారం నేస్తారుగదా, అదెట్టి హరిద్దోరంలో మటం కట్టించక మాలాటోళ్ళని డబ్బెందుకడుగుతారు?

బైరా — మేం చేశే స్వర్ణం మేవేఁ వాడుకచేస్తే తలపగిలిపోతుంది.

హెడ్ — అవి వేరే రహస్యాలు ఊరుకోండి సూవాఁ! గురోజీ! హరిద్వారంలో చలి లావు గాబోలు?

బైరాగి — నరులకద్దు — మాబోటి సిద్ధులకు చలీ, వేడీ, సుఖం, దుఃఖం యెక్కడివి?

హెడ్ — ఆహాఁ! అదృష్టవంటే సిద్ధులే అదృష్టం.

మునస — గురు, హరిద్దోరంనించి యెప్పుడు బైలెల్లోరు?

బైరాగి — రెండురోజులయింది. మొన్న ఉదయం ప్రయాగ, నిన్న ఉదయం జగన్నాథం శేవించాం. ఖేచరీగమనమ్మీద ఆకాశమార్గాన్న పోతూవుండగా మీవూరి అమ్మవారి వనంబగ్గిర గమనం నిలిచిపోయింది. యేమి చెప్మా? అని యోగదృష్టిని

చూచేసరికి అమ్మవారి విగ్రహముకింద ఆరునెలవులలోతున, మహాయంత్రం వొకటి స్థాపితమై కనబడ్డది. అంతట భూమికి దిగి, అమ్మవారిని సేవించుకొని ప్రచ్ఛన్నం గా పోదామంటూ వుంటే యీ భక్తుడు మంత్రశక్తి పోల్చి నిలిపేశాడు.

గుకా—చూడగానే, నేను సిద్ధుల్ని పోలుస్తాను గురూ—

మునస—సుక్కే. నేనోళ్ళని నా బాగా పోలుస్తావు. మావూరి మ్మోరు జగజ్జననీ! మా చల్లనితల్లి.

బైరాగి—బ్రహ్మోస్మ్యహం! బ్రహ్మోస్మ్యహం!

హెడ్—ఆహా! యోగమహత్యం! స్నానాల్చేసి, ముక్కుబిగించే బ్రాహ్మలికి లేవు గదా యీ సిద్ధులూ?

బైరా—వేషానికీ—జ్ఞానానికీ, దూరం కాదా తమ్ముడా? మా తాతగారు చెప్పలేదా? 'ఆత్మశుద్ధిలేని యాచార మదియేల?' అని?

హెడ్—వేమన్న—తమతాతా, గురూ?

బైరా—అవును—వారు పరమపదించి ఆరువొందల సంవత్సరాలు కావొచ్చింది.

హెడ్—తమవయస్సెంత, గురూ?

బైరా—ఆది అంతూలేనివానికి లెఖ్ఖేటి తమ్ముడా? పరమాత్మకెన్నేళ్ళో అన్నేళ్ళు

మునస—యేం యిలవైన మాటలంటున్నాం.

[పీకేశ శంఖం పూరించును]

హెడ్—(శంఖం లాక్కొని పక్కను వుంచి) అట్టె పట్టెయ్యకండి భాయి.

దుకా—అట్టే యెక్కడా భాయీ? పగవకవైందాకా తాక్కుంటే తాగడమేంటి? వేమన్న చెప్పలేదా?

"తాగి, తాగి; తాగి ధరణిపై బడుదాక
తాగునేని తన్ను తాను తెలియు
తాగలేనివాడె, తాగుబోతరయంగ
యిశ్వదాభిరామ యినరవేమ...

బైరాగి—కాశీలో రెండువందల యాభై సంవత్సరముల క్రిందట అలంగీర్ పాదుషావారి హయాంలో, ఒక శేటు మాబోటి సిద్ధుల నందరిని కూటానికి పిలిచాడు. గంగనడి వీని పడవమీద సీసాలలో సారాయి భరాయించి, బంగారపు గిన్నెతో అందిచ్చాడు. రెండుఝాముల రాత్రి అయేసరికి సీసాలు ఖాళీఅయిపోయినాయి. అంతా పడిపోయినారు.

హెడ్—యేమి ఆశ్చర్యం!

బైరా — మేమూ ఒక్క సేపాళ్ళు బ్రాహ్మడూ మిగిలాం. "తే! తే!" అన్నాడు ఆ బ్రాహ్మడు "తెస్తావా శపించేదా" అన్నాడు. శెట్టి యెక్కడ తెస్తాడూ? వాడు మా కాళ్ళు పట్టుకునేటప్పటికి పర్వాలేదు నిలవమని చెప్పి, మేమూ ఒక పుడిక మంత్రించి, గంగ భరాయించినకొద్దీ ఆ గంగ సారా అయిపోయింది. ఆ బ్రాహ్మడు సహస్రపుడికలు తాగి జిబ్బున తేన్చాడు. బ్రాహ్మల్లో కూడా మహాత్ములుంటారు. కనుక్కోగలిగిన జ్ఞానికి గంగానది అంతా సారాయి కాదా?

మునస — రామానందాసోహాడు. గంగ భరాయించడానికి గురువు; ఒకదరావుకి పద్దరావులు సేరుస్తాడు.

[హవల్దారు అచ్చన్న ప్రవేశించును]

దుకా — శెరూ! వీరు హవల్దార్ అచ్చన్నగారు. మంచి గ్యాని. మునసబుగారికి మేనల్లుడు.

హవ — రామ్! రామ్!

బైరాగి — రామ్! రామ్!

హవ — (యోగినితో) పిల్లా హుక్కాలావ్. (హెడ్‌తో) భాయీ గుంటూరు శాస్త్రుల్లుగారి పతాయేమైనా తెలిసిందా?

హెడ్ — లేదు భాయి.

దుకా — రావఁప్పంతులంటాడు... పెళ్ళికూతురు రెండో పెళ్ళిపిల్ల — దాన్ని అమ్మి డబ్బు చెయ్యి చిక్కించుకుని...

హెడ్ — ఆమాటలు మనకెందుకు భాయి?

మునస — పోలీసువాళ్ళకి అక్కర్లేక, బాపనోళ్ళకీ అక్కర్లేక యెదవముండని బాపనాడు పెళ్ళి చేసుకుంటె లోకం అంతా వూరుకోవడవేఁనా?

హెడ్ — డబ్బు యిచ్చినవాడికీ, పెళ్ళి ఆడినవాడికి లేనిచింత మనకేం మావాఁ? కాక యీరోజులలో బ్రాహ్మణ్యం యెక్కడుంది. యెక్కడ చూచినా పిల్లల్ని ముసలాళ్ళకి అమ్మకోడాలు రండాగర్భాలే కదా?

హవ — కలికాలంగదా భాయీ? యెంత చెడ్డా బ్రాహ్మలు మనకి పూజ్యులు.

హెడ్ — అన్నా, యవరింతవాడు వారు జ్ఞానం, నీతిప్రధానం గాని, జాతిలో యేవుంది? వేమన్న యేవఁన్నాడు?

మునస — యేవఁన్నాడా నీతికి పోలీసోణ్ణి ఘనానికి సాతానోణ్ణి అడగమన్నాడు.

హెడ్ — మామాఁ! వెక్కిరించండి గాని, నేను యెన్ని తాలూకాల్లో నౌఖరీ చేశానో అన్ని తాలూకాల్లోనూ రండాగర్భాలు యెన్నని చెప్పను? నన్నడిగితే వెధవలు

పెళ్ళిచేసికోవడవేఁ ఉత్తమం అంటాను. మాసాంప రెంటు పిల్లలతో వున్న రెండో పెళ్ళి దొరసాన్ని పెళ్ళాడి సుఖంగా వుండలేదా?

మునస — మావఁగారి అభిప్రాయం, పెద్యతోటొచ్చిన అవుమేలు కాదా అని? అందుకనే; ముసలిబాపనోడు యెధవనుంటని పెళ్ళాడితే, మీ నేస్తం కరణపోణ్ణి ఆముసలాడి యెధవకుంతున్న పెళ్ళాపమని బోదసెయ్యరాదా?

హవ — మనకేల మావాఁ? గవునర్మెంటూ, దేవుళ్ళూ, బ్రాహ్మలూ వారి నేరాలు వారివి. వాటితో మనకి పనిలేదు. మనభక్తి మనకుండాలి. (హెడ్తో) భాయీ! తెల్లానల్లా వొకటా? — తెల్లవాడికి క్రీస్తు వొక పద్ధతి పెట్టాడు. ముసల్మాన్‌కి పైగంబరు వొకపద్ధతి పెట్టాడు. నల్లవాడికి రాముడు వొకపద్ధతి పెట్టాడు. భగవంతుడు తెల్లవాడితో యేవన్నాడూ? వెధవని పెళ్ళాడు అన్నాడు. రాముడు తెనుగువాడితో యేవన్నాడూ? వెధవని పెళ్ళాడొద్దన్నాడు. చెప్పన్న దేశాలూ చూశాను భాయీ పరిపరివిధాలు ఆచారాలు, వ్యవహారాలు వున్నాయి గాని నీతి వకటే, భగవంతుడొకడూ, అంతటా వొక్కడే.

మునస — రాముడు యెదవముండల్ని కానిపనులు సేయమన్నాడూ? మన్లో మారు మనువులుండేవి కావా?

హవ — పిల్లా చిలుం భరాయింది, తే.

మునస — సామాలోడు మూలకి తీసికెళ్ళి పిల్లని ముద్దెట్టుకుంటున్నాడు.

యోగిని — (చెయ్యివిడిపించుకొని సిగ్గుతో) ఏకాంత ఉపదేశం చేస్తున్నాడు.

మునస — యేటో అవుప్పదేశం? ఆ సేంట వాయురే గంగారమ్మనా?

దుకా — యేమిటి భాయీ, అనరాని మాట్లు అంటున్నారు. మీమన యోగిని పరమ భక్తురాలు.

మునస — లెంపలోయించుకుంటాను. పిల్లా! ఆ సామోలోడు సెప్పిన ఉప్పదేశవేటో, నాచెవులో కొంచెం సెప్పరాదా?

[యోగిని సారాగళాసు హవల్దార్ యెదట వుంచును]

మునస — సామాలోడి వుప్పదేశంతో పిల్లకి మతోయింది.

బైరాగి — హవల్దారుగారు అమృతం సేవించరా?

హవ — (చిరునవ్వు నవ్వి) తాక్క సోజరువాడు చెడ్డాడు, తాగి సిపాయివాడు చెడ్డాడు, జ్ఞానికి జ్ఞానవృత్తి, తాగుబోతుకు సారాయి.

మునస — పించను పుచ్చుకుంటివిగదా, యింకా సిపాయానా సెయ్యాల్సుందా అల్లు

హవ — కుంపినీ నవ్మక్ తిన్నతరవాత, ప్రాణం వున్నంతకాలం కుంపినీ బావుటాకి కొలువుచెయ్యాలి. రేపు రుషియాతోటి యుద్ధం వొస్తే పింఛను ఫిరకా యావత్తూ బుజాన్ని తుపాకీ వెయ్యమా?

మునస — రుస్సానోడికోడ నీట్లో మునిగి నడుస్తాడిగదా, నువ్వు తుపాకుతో యవణ్ణి కొడతావు?

హవ — మొన్నగాక మొన్న యింగిరీజ్ రుషియాదేశానికి దండెత్తిపోయి, రుషియాని తన్ని తగలలేదా? అప్పుడేవైందో, యిప్పుడూ అదే అవుతుంది. మారాణీ చల్లగా వుండాలి.

దుకా — సీవఁరాణి ఆకాళీమాయి అవుతారం కాదా?

హవ — కాళీ, గీళీ జాంతేనై ఆరాముడి అవతారం.

దుకా — గురూ — హవల్దారుగారు తత్తకీర్తనలు మాయింపుగా పాడతారు. (యోగినితో) తల్లీ, నాతంబూరా తెచ్చి భాయిగాడికి ఇయ్యి.

మునస. — యీతూరి యీరేచ వుప్పాదేశం చేస్తున్నాడు.

దుకా — గొప్పవాళ్లున్నప్పుడు ఆస్యాలేటి భాయీ?

మునస — వున్నమాటాడితే ఆస్సాలా? నాకెవడూ సెయడేం వుప్పాదేశం? యీరేచ వుప్పాదేశం గట్టిగా వికసించి, మరిసెయ్యొద్దు —

[యోగిని కష్టంమీద చెయ్యి వొదిలించుకొని తంబురా తెచ్చి యిచ్చును]

దుకా — అవన్నీ గ్యానవిహాస్యాలు బ్రహ్మానందవఁటే యేటి? కడుపునిండా సారా; ముక్కునిండా పొగ; పక్కని పడుచుపిల్లాకదా?

మునస — ఘానం యినండొస్సి —

హవ — పామరం! పామరం! రాముడు పరం కాళీనెత్తిమీద పెట్టకపోతే కుంపినీ సిపాయన్నవాడు యిక్కడికి వొచ్చునా?

హెడ్ — భాయి! నీకీర్తన శలవియ్యండి.

[హవల్దారు పాడును]

పింజర్మెరహకర్ ఛుప్నైహా
క్యారేబుల్బుల్ కహఁసులిక్కనుదా ॥క్యారె॥
యెక్కడికి వెళతావు! యేమి చెప్పవు. బోలోపింజర్మె!

[వీరేశ శంఖం మనవాళ్ళయ్య తీసి పూరించును]

హవ — (పాటమాని తంబురా క్రిందబెట్టి) గద్దా!

హెడ్ — (శంఖం లాక్కొని) అగ్గిలో పడేస్తాను. యెందుకు తానిస్తావు భాయి.

దుకా — వొద్దంటే వినడు,

హెడ్ — వినకపోతే దుకాణానికి రానియ్యకండి. అల్లరైతే మాకు మాటరాదా?

దుకా — పది శంకాలు దాచేశాను; మళ్ళీ మళ్ళీ తెస్తాడు. యేంజెయ్యను. బేరంగదా భాయీ?

మునస — దిట్టంగా పట్టెయి. తత్ఘ్నానం తల కెక్కాలి!

దుకా — (తంబురా తీసిపాడును)

నాగాదిగురా - నాకేంద్రశి దిగరా
దిగుదిగు నాగన్న - దివ్యసుందరనాగ
మూదముతో రేపల్లె - ముద్దులనాగ
ఊరికి ఉత్తరాన - ఊడలమఱ్ఱికింద
కోమపుట్టలోని కోడినాగన్నా-

[పాడుచుండగా రామప్పంతులు ప్రవేశించి యెడంగా నిలిచి యోగినికి సౌజ్ఞ చేయును. యోగిని రామప్పంతులితో మాటలాడి వచ్చి హెడ్ చెవిలో రహస్యం చెప్పును]

మునస — పిల్ల, హెడ్డుగారికి వుపదేశం సేస్తూంది. ముసలోణ్ణనా—

యోగిని — (మునసబు చెవిదగ్గిర నోరుపెట్టి చెవి గిల్లును)

మున — పిల్లా! సాత్రోజులైంది మునిసిబునాయుడికి యీపాటి వుపదేశం తగిలి—
(హెడ్డుకానిస్టీబు రామప్పంతులుదగ్గిరకు వెళ్ళి యెడంగా యిద్దరూ మాటలాడుదురు)

హెడ్ — కొత్తవారు యెవరూ లేరే! బాబాజీగారు వుంటే మీకు భయవేఁవిఁటీ?

రామ — కొత్తా, పాతా, ఆలోచించుకోలేదు కొంపమునిగింది మీసాయం కావాలి.

హెడ్ — డబ్బేమైనా పేల్తుందా?

రామ — మీచాతైతే, పేల్తుంది.

హెడ్ — యేమిటొచ్చిందో చెప్పు.

రామ — లుబ్ధావుధాన్లు పెళ్ళాడినగుంట మధురవాణి తాలూకుకంటె తీసుకుని యెక్కడికో పారిపోయింది.

హెడ్ — యెందుకు పారిపోయిందో?

రామ — మీనాక్షి చావగొడితే పారిపోయింది. యెక్కడ వెదికినా కనపడలేదు. ముందు మీజవాన్లని తోడాయించండి.

హెడ్ — యీరాత్రివేళ మాజవాన్లుమాత్రం పట్టుకోగల్రా? పోలీసుజవానంటే పది కళ్ళూ, పదికాళ్ళూ వుంటాయనుకున్నావా యేవిఁటి?

రామ — దాని సిగ్గోసిరి; దాన్ని పట్టుకోవడం నాకెందుకు, నాకంటె నాకిప్పించెయ్యండి!

హెడ్ — యేమిటి యీమాటలూ, ఆకంటె పట్టుకు ఆపిల్ల పరారీ అయిందని చెపితివి, నేను కంటె యెలా యిప్పిస్తాను?

రామ — ముసలాణ్ణి అడిగితే, అది పట్టుకుపోయిందంటాడు; గాని నిజంగా వాడు పెట్టెలో దాచేసి యివ్వకుండా వున్నాడు.

హెడ్ — నన్నేం చెయ్యమంటావు?

రామ — మీరు గానక ముసలాణ్ణి బెదిరిస్తే, నాకంటె నాకిచ్చేస్తాడు; మీ చెయ్యికూడా తడౌతుంది.

హెడ్ — అలాగనా — గాని నువ్వన్నట్టు ఆపిల్ల గానీ, కంటె పట్టుకుపరారి అయిపోయి వుంటే —

రామ — పోనీండి — దానిఖరీదు యిప్పించెయ్యండి.

హెడ్ — వాడిస్తాడా?

రామ — మరి మీసాయం యెందుకు కోరాను?

హెడ్ — ఇస్తాడని నాకు నమ్మకంలేదు. ఐనా చూస్తాను, కేసరియెత్తు యెత్తడానికి యిద్దరుముగ్గురు సాక్షులుండాలి?

రామ — మందిరంలో ఉన్నవాళ్ళో?

హెడ్ — వీరేశం మనవాళ్ళయ్యా, మూడో కాలంలో వున్నారు. హవల్దారు అబద్ధం ఆడమంటే తంతాడు. మునసబునాయుడు యింతరాత్రివేళ అంతదూరం నడిచి రాలేడు, యీ ఆడనూ పాడనూ రామిందాసు వొక్కడేగదా?

రామ — ఆ బైరాగాడు సాక్ష్యం పలకడేం?

హెడ్ — వేషం వేసుకు ముష్టెత్తుకునే బైరాగాడనుకున్నావా యేమిటి? ఆయన గొప్ప సిద్ధుడు, నిలువెత్తు ధనంపోస్తే అబద్ధమాడడు.

రామ — సాక్ష్యం పలకావొద్దు. యేమీ వొద్దు. దగ్గిర నిలబడితే చాలును పిలిపించండి.

[కనిస్టీబు వెళ్ళి దుకాణదారునూ బైరాగినీ తీసుకువచ్చును.]

బైరాగి — సాక్ష్యం అంటే మావంటివాళ్ళే చెప్పాలి. యోగదృష్టివల్ల చూశామంటే, యెక్కడ జరిగినదీ యెప్పుడు జరిగినదీ కళ్ళకి కట్టినట్టు అప్పుడు కనపడుతుంది, గనక మేంకూడావస్తాం. యేమైనా దొరికితే హరిద్వారంలో మఠానికి పనికొస్తుంది.

రామ — జరిగినదాని ముండామోపిరి కొంచెం కల్పనుంటేగాని కథ నడవదు. అంచేత హెడ్డుగారు ముసలాడితో చెప్పేమాటలు నిజంఅని మీరు తెలపివ్వాలి.

బైరాగి — వెర్రి! వెర్రి! నిజవేఁవిటి, అబద్ధవేఁవిటి మేం సిద్ధులం అబద్ధంనిజం చేస్తాం. నిజం అబద్ధం చేస్తాం — లోకవేఁ పెద్దఅబద్ధం. పదండి — (నిష్క్రమించును)

## ౫-వ స్థలము : దేవాలయం గుమ్మం దగ్గర.

[హెడ్డుకనిస్టేబు, రామప్పంతులూ మాట్లాడుతున్నారు]

(మరివక కనిస్టేబు, బైరాగి, దుకాణదారు కొంచె దూరముగా నిలుచున్నారు.)

హెడ్డు—నానౌఖరి పోగొట్టుకుంటానా భాయీ?

రామ—కొంచం బెదిరిస్తే నౌఖరీపోతుందా అన్నా? పోలీసుదూట అంటే బెదిరించే గదా? మీరు అలా తప్పించుకుంటే నేనేం అనుకోను?

హెడ్డు—(చేతిలో నలుపుతూన్న కాగితపుముక్క విసిరేసి) భాయీ, లుబ్ధావధాన్లు చంటిపిల్లడా? దుక్కి—ముచ్చు బెదిరించడానికి _ కూనీకేసని నాకేమైనా ఆశవుంటే, పోలీసువాణ్ణి. నేను వూరుకుంటానా? పట్టుకుంటే నాకు యెంతకారట్టు కాదు? ఈజవాన్ని యీచీకటి రాత్రిలో నూతిలో దింపానుకానా? కూనీ గీనీ అంటే యెవరైనా నవ్వుతారు. మీనాక్షి చేతికి వెరచి, ఆపిల్ల యిరుగింట్లోనో పొరుగింట్లోనో పడుంది. మీయింట్లో నేఉండేమో ముసలాడు అన్నట్లు?

రామ—దేవుఁడు తోడు మాయింటికి రాలేదు. యిరుగింటో, పొరుగింటో అని మీరు వూరుకుంటే యలాగ మీధైర్యమేఁవిటో నాకు బోధపడదు. వెతికించవయ్యా అంటే వెతికించారుకారు, ఆయిరుగింటివాళ్ళూ, పొరుగింటివాళ్ళూ, పిల్ల నిద్దర పోతూవుండగా కంటె చెపాయిస్తే నాగతేవిఁటి? కంటె యింటికి పట్టుకు వెళ్ళక పోతే మధురవాణి గుమ్మంలోంచి గెంటుతుంది—అనగా, గెంటుతుందని కాదు_ యేడుస్తుంది, ప్రాణం తినేస్తుంది విన్నారా?

హెడ్డు—నాలనపో విన్నారా?

రామ—యేదో చెప్పండి మరి.

హెడ్డు—ఆకంటె యిచ్చిందాకా, కదలకుండా లుబ్ధావధాన్లుఇంటిమీద కూర్చోండి.

రామ—యిదా సలహా? పీకమీదకూచున్నదాకా నాకేం పట్టింది? యింటికెళ్ళి సుఖంగా పడుకుంటాను.

హెడ్డు—మధురవాణి బాధపెడుతుందని కదూ?

రామ—అని మీకు కనికారం కాబోలు? రఘుగాని వాడు కంటె యివ్వకపోతే, అవుధాన్లుమీద సివిల్ దావా పడేస్తాను. మీదగ్గిర కంటెమాట వొప్పుకున్నాడు గదా మిమ్మల్ని సాక్ష్యంవేస్తాను.

హెడ్డు — ఓహో యిదా వేషం? పోలీసు ఆఫీసర్ని నేను సాక్ష్యాలకీ సంపన్నాలకీ తిరిగితే నానౌకిరీ నిలుస్తుందా? కావలిస్తే లుబ్ధావధాన్లు కంటె అపహరించాడని నాదగ్గిర ఫిరియాద్ చెయ్యండి. కేసుచేసి నాతమాషా చూపిస్తాను.

రామ — కంటెమాట మీదగ్గిర అతడు వొప్పుకున్నతరవాత, మీరు బోనెక్కి యలా అబద్ధం ఆడగల్రో చూస్తానుగదా.

హెడ్డు — పంతులూ, అక్కరమాలినలౌక్యాలు చెయ్యకు. వాడు కంటెమాట తనకేవీఁ తెలియదన్నాడు. కావలిస్తే ఆమాట సాక్ష్యం పలుకుతాను.

రామ — యిదా మీరు చేసిన సాయం?

హెడ్డు — యెందుకు అక్కరమాలినఆందోళన పడతావయ్యా - రేపు నీకంటె నీఇంట్లో వుండకపోతే నన్ను అను.

రామ — మధురవాణితో యిప్పుడు యేం జెప్పను?

హెడ్డు — నన్నేం జేయమంటారు?

రామ — మళ్ళీ లుబ్ధావధాన్లు యింటికి రండి. యీమాటు మనమిద్దరం వెళ్ళి పీడిద్దాం.

హెడ్డు — రెడ్డొచ్చాడు, మొదలాడు అన్నాట్ట. నిరర్థకంగా రాత్రల్లా నిద్దర్లేకుండా చంపావు-మరి నేను రాజాలను. నువ్వెళ్ళి వాడియింటిమీద కూచోనయ్యా, అని చెప్పానుకానా? నామాట విని అలాచెయ్యండి. అదేసలహా. పీసిరిగొట్టుముండా కొడుకు మానలుగురికీ నాలుగుమూళ్ళు పన్నెండు రాళ్ళు పారేశాడు. యివి పెగిలేటప్పటికి నాతలప్రాణం తోకకి వొచ్చింది. నావొంతు మూడూ మీకిచ్చేస్తాను.

రామ — కంటెపోయి యేడుస్తూవుంటే, యీవెధవ మూడు రూపాయలూ నాకెందుకూ?

హెడ్డు — మీకు అక్కర్లేకపోతే పోనియ్యండి. గురోజీగారికి యిద్దాం.

రామ — కొంచం చిల్లరఖర్చుంది. యేం చెయ్యను, యిలా పారెయ్యండి. (పుచ్చుకొనును)

హెడ్డు — గురోజీ తమకో తులసీదళం.

బైరాగి — తృణం కణం యేవొచ్చినా మఠానికే అర్పణం.

హెడ్డు — దుకాణదారుతోనూ, కనిస్టేబుతోనూ) మీకో మూడు, నీకో మూడూ (చేతులు దులిపి) సాఫ్‌సూఢా-నాకు తిప్పలే మిగిలింది.

దుకా — (బైరాగిని పక్కకి పిలిచి) యీవేళ చెన్నపట్టంనించి ఫస్టురకం బ్రాందీ వొచ్చింది. చిత్తగించి మరీ కాశీ వెళుదురుగాని.

హెడ్డు—గుర్‌జీ రాం! రాం! పంతులూ, ముసలాణ్ణి వెళ్లి పట్టుకోండి. భాయీ, స్టేషనుకు పోవాలి. (జవానుతో) రావోయి కాకయ్యా. (హెడ్డూ, జవానూ, ఒకవైపున్నూ, దుకాణదారూ, బైరాగీ మరివక వైపున్నూ వెళ్ళుదురు)

రామ—కంటె పోయిందంటే మూడువందల రూపాయిలు చేతులో పడతాడు! (విరసంగా నవ్వును.) వీడి తాళం పడతాను. (హెడ్ పారేసిన కాగితపు ముక్కలు యేరి) యినస్పెక్టరుకి వొకటి, తాసిల్దారుకి వొకటి, ఆకాశరామన్న అర్జీలు పంపుతాను. వెధవ మధురవాణిదగ్గిరికి వెళతాడేమో? నేను యింటికిపోతే అరుగుమీద పడుకోవాలిగాని అతిక్కలంజ తలుపుతియ్యదు. లుబ్ధావధాన్లు యింటికి వెళ్ళితే వాడు కఱ్ఱుచ్చుకుంటాడు. యీ దేవాలయంలో పడుందునా?—పురుగూ బుట్రా కరిస్తే—కరిస్తే—ఛీ! యీ సానిముండని వొదలేస్తాను—ఆగుంట యేవైనట్టు? నా అదృష్టంవల్ల యెవళ్ళింట్లోనైనా దాగి రేపుగాని కనబడితే, కంటె పోకూ ఒకవేళ చస్తే?—చచ్చేందుకు—నూతులో పడలేదు గదయ్యా, కావయ్యా కూడా గాలించారు—ఒకవేళ అది రెండో పెళ్ళిపిల్ల అయి, దాని అత్తండ్రి తానికిగా వొచ్చి బండీ యెక్కించుకు వొడాయించాడేమో? అలా ఐతే కంటె కూడా వుడాయించడా?—మీనాక్షిని పట్టుకుంటే కొంత ఆచోకీ తెలుస్తుంది—అది కనపడ్డ వేలాగ?—తలుపుతట్టితే ముసలాడే వొస్తాడేమో?—(రోడ్డుదాటి లుబ్ధావధాన్లు యింటిగుమ్మంయెదట నిలుచుని) అకలేవహించేస్తూంది—మీనాక్షి దొరికితే యేవైనా ఫలహారం యిచ్చును—యెవడు చెప్మా! దాని చెట్టుకింద చుట్ట కాలుస్తున్నాడూ? (నాలుగు అడుగులు ముందుకు వెళ్ళి) ఆసిరీ, నువ్వా?

అసిరిగాడు—నాను బాబు (చుట్ట పారవైచును)

రామ—నిమ్మళంగా వున్నావురా?

అసిరి—యేటి నిమ్మళం బాబూ సానమ్మొచ్చింది—ఈయమ్మ కాసి సూడ్డం మానేసినారు. డబ్బిచ్చే దాతేడి బాబూ?

రామ—అసిరి అడక్కపోతే, అమ్మైనా పెడుతుందిరా?

అసిరి—ఆసానమ్మ మా పెద్దమనిషి బాబూ.

రామ—యేవిటీ? యేవిటీ? చెప్పారే. చాలా రోజులైంది నీకు డబ్బిచ్చి—యింద యీ రూపాయి పుచ్చుకో.

అసిరి—నూరు దండాలు బాబూ?

రామ—మధురవాణి మాట యేవిట్రా చెప్పబోయినావు?

అసిరి—మా పెద్దమనిషి, బాబూ.

రామ—యవడెళ్ళాడ్రా దాంసగ్గిరికి? అసిరి—యవ డెళ్ళాడా?

అసిరి—యవడెళ్ళాడు. యీపు పెట్లగొడతాది బాబూ.

రామ—చెడ్డమనిషన్నావు?

అసిరి—కాదా? మొన్న సోడ్డుగారెత్తే యేసికూన్ని ఉసుగలిపింది కాదా?

రామ—నిజం చెప్పావు. సమీపాన యెవ్వరైనా కోప్పడ్డట్రా?

అసిరి—మాలాటోళ్ళమీద యెందుకు కోప్పడతాదీ? బాపనోళ్ళొస్తే తిడతాది.

రామ—నువ్వు యెప్పుడూ నిజవేఁ చెబుతావురా అసిరిగా.

అసిరి—సీ! అబద్ధవాడితే బగమంతుడు ఒల్లకుంటాడా బాబూ?

రామ—మీ బంగత రేఁజేస్తున్నాడ్రా?

అసిరి—తొంగున్నాడు బాబూ.

రామ—నీకు మరో రూపాయి యిస్తాను—మీనాక్షిని సావిట్లోకి పిలుస్తావురా?

అసిరి—నాశక్కవాఁ, బాబూ? ఆయమ్మ అయ్యగదులో పక్కేసుకు తొంగున్నారు

రామ—నువ్వు చిటికేస్తే యక్కడున్నా లేచొస్తుంది. నే నెరగనట్రా.

అసిరి—తెండి బాబూ చూస్తాను. (రామప్పంతులు రూపాయి యిచ్చును. (ఉభయులూ యింట్లో ప్రవేశింతురు.

౩-వ స్థలము: లుబ్ధావధానులు యింటినడవ.

[తలుపు జారవేసి యుండును.]

[మీనాక్షి ప్రమిదతో దీపం తెచ్చి గూటిలో వుంచును]

(రామప్పంతులు వొత్తి తగ్గించి, మీనాక్షిని ముద్దుబెట్టుకొనును.

మీనాక్షి—తోవ తప్పొచ్చారే?

రామ—బుద్ధితక్కువ చేత, గడ్డితిని యిన్నాళ్ళూ తోవమరచాను.

మీనా—మధురవాణి యలా రానిచ్చింది?

రామ—మధురవాణి శిగ్గోశిరి, దాన్ని వొదిలేస్తాను. ఆకలి దహించుకు పోతూంది ఫలారం యేమైనా వుందీ?

మీనా—యేవుంది?—వొడపప్పూ, కొబ్బరిముక్కా కావాలా?

రామ—యేదోవొహటి తెస్తూ. (మీనాక్షి మూకుడుతో వడపప్పూ కొబ్బరిముక్కలు తెచ్చును. రామప్పంతులు తినుచుండును.)

మీనా—మధురవాణిని వొదిలేస్తారా?

రామ—[illegible] పోయింది.

మీ—కనిస్టీబుమాట తెలిసిందా ?
రామ— తెలిసింది.
మీ—యవరు చెప్పారు ?
రామ—అసిరి గాడు.
మీ—మా అసిరిగాడా ?
రామ—మీ అసిరిగాడే.

[అసిరిగాడు పీధితలుపు కొంచం తీసి తొంగిచూసి]

అసిరి—దెయ్యానికెట్టింది. తింతున్నావయ్యా ?
రామ—దెయ్యానికా పెట్టారు ?
మీ—(అసిరిగాడితో) వూరుకో వెధవా ?
రామ—నీకు న్యాయవేంనా, దిగదుడుపుకూడు పెట్టడం ?

(వీధులోకి వెళ్ళి వమనము చేసుకొనుటకు ప్రయత్నము చేసి తిరిగి ప్రవేశించి)

వమనమైందికాదు. యేం సాధనం ?
మీ—దిగదుడుపుకాదంటే నమ్మరుకదా?
రామ—మూకుళ్ళో తగలేశావు ?
మీ—దెయ్యం తిని సచ్చిందా, యేవిటి?
రామ—ఆడవాళ్ళు దారుణం మనుషులు !
మీ—అసిరిగాడేం చెప్పాడు మధురవాణిమాట ?
అసిరిగాడు—(తిరిగి తొంగిచూచి) ఆపారేసింపట్టుకుపోమనా బాబు ?
రామ—పట్టుకుపో.

[అసిరిగాడు పట్టుకుపోవును]

మీ—వాడికి మీకంటె ధైర్యవుంది.
రామ—అపవిత్రం ముండాకొడుకు యేమైనా తింటాడు. బ్రాహ్మలం పవిత్రమైన వాళ్ళంగదా?
మీ—పవిత్రం అంటే, మీదీ నాదే !
రామ—ఆదేం అలా అంటున్నావు ?
మీ—నేను వెధవముండనీ, మీరు సరసులున్నూ, మనకంటే మరీ పవిత్రం అయిన వారు యవరుంటారు?
రామ—ఆకళంకం తీసెయ్యడానికే యీవేళొచ్చాను.
మీ—యలా తీసేస్తారు ?
రామ—మనయిద్దరం పెళ్ళాడితే మరి అపవిత్రత యెక్కడుంటుంది ?

మీ—యేమిటీ!
రామ—మనం పెళ్ళాడదాం?
మీ—నిజంగాను?
రామ—యేంవొట్టు వేసుకోమ్మన్నావు?
మీ—ఆదీపం ఆర్పెయ్యండీ.
రామ—యీకాగితం ముక్కలు చదివి మరీ ఆర్పేస్తాను. (కాగితం ముక్కలు జేబులోంచి తీసి చదివి) గాడిదకొడుకు తనబాకీ తాలూకు నోటి లాగి, నన్ను దగా చేశాడు; వీడితాళ్ళం పడతాను.
మీ—యవడు?
రామ—అది వేరేకథ.
మీ—అసిరిగాడు కనిస్టీబుమాట యేం జెప్పాడు?
రామ—మధురవాణి హొద్దుమీద కుక్కని వుసిగలిపిందని చెప్పాడు.
మీ—యెందుకూ?
రామ—నేను లేనప్పుడు వాడు యింట్లో చొరబడబోతేను.
మీ—అయ్యో తెలివా! అసిరిగా!
రామ—(ప్రవేశించి) యేటమ్మ?
మీ—వెధవా, నిజం చెప్పూ, పంతులుయింట్లో లేనప్పుడల్లా కనిస్టీబు మధురవాణిలో ఉంటాడని నువ్వు నాతో చెప్పలేదూ?
అసిరి—(బుఱ్ఱగోకుకుంటూ) సెప్పినాను.
రామ—దొంగవెధవా! కుక్కని వుసిగలిపిందన్నావు?
అసిరి—బాబు _ నాకరోడు నోరుమూసుకోవద్దా బాబు? సానమ్మడిగితే, మీమాట సెప్పుతాన బాబు?
మీ—వెధవా, నువు చెబితే నాకు భయమనుకున్నానా యేమిటి?
రామ—ఓరి అబద్ధపువెధవా యెవరితోనూ యీమాట మాత్రం చెప్పకు. రూపాయి యిచ్చాను కానూ?
మీ—యెందుకిచ్చారూ, రూపాయి?
అసిరి—పిల్లలోణ్ణిగదా? (పైకి వెళ్ళును.)
రామ—దొంగముండ ద్రోహం చేస్తూందేం?
మీ—తెలుసునన్నారు?
రామ—యింతని యెరగను.

మీ—ఆడది నీతితప్పినతరవాత అంతేవిఁటి? యింతేవిఁటి? తెగించినదానికి సముద్రం మోకాలుబంటి. అందులో సొంది ఖాయిదాగా వుండాలనుకోవడం మీదీ బుద్ధి తక్కువ.

రామ—బుద్ధితక్కువంటె బుద్ధితక్కువా! ముండని బుఱ్ఱ చితక్కొడి చెయ్యాలని వుంది. దీనికింద యెంతసొమ్ము తగలెట్టానూ!

మీ—యెప్పుడు తోలేస్తారు?

రామ—యెప్పుడోనా? రేపే. లంజ యెంతపతివ్రతవేషం వేసింది!

మీ—మనవెప్పుడు వెళ్లిపోవడం?

రామ—యెక్కడికి!

మీ—మరిపోతుందా యేవిఁటి? రాజమేంద్రం?

రామ—అవును. రేపు తోలేస్తానా? యెల్లుండి మనం వుడాయిద్దాం గాని నీసరుకులు తెచ్చుకుంటావా, ముసలాడికి వొదిలేస్తావా?

మీ—నాకున్నదల్లా నాసరుకులే. వాలా లొదిలేస్తాను? నాసరుకులపెట్టె తాళం మా నాన్నదగ్గిరుందిగదా యేవిఁగతి.

రామ—నాప్రయోజకత్వం నీకేం తెలుసును? యిదుగో యీకొంగున ఉన్న యినప ములికీతో నీచిత్తవొచ్చిన పెట్టెతాళం తీసేస్తాను. గాని నాకంటె యెక్కడుంది?

మీ—గుంటకి పెట్టిందా? రాత్రివేళ, నాబట్టలపెట్లో పెట్టేది.

రామ—నీపుణ్యా వుంటుంది. ఆబట్టలపెట్టె ఓమాటు తీసిచూతూ. రేపు గానికంటె మధురవాణికిచ్చి ముండని, తోలేస్తాను.

మీ—అగుంట బట్టలపెట్టె తాళం పారేశింది?

రామ—ములికీతో తీసేస్తాను.

మీ—నాసరుకులపెట్టె తాళంకూడా తీసేసిపెడతారూ?

రామ—అద్దే!

మీ—నన్ను పెళ్లాడతానని ప్రమాణం చేశారుకారే?

రామ—దీపం ఆర్పేస్తే పెట్టెతియ్యడం యలాగ?

మీ—అగ్గిపుల్ల వుంది.

రామ—అయితే యిదిగో, నిన్ను తప్పకుండా పెళ్లాడతానని యీదీపం ఆర్పేస్తున్నాను.

[రామప్పంతులు దీపం ఆర్పి మీనాక్షిని కౌగిలించుకొని యెత్తును]

రామ—యిలా యెత్తుకు తీసుకుపోతాను రాజమహేంద్రవరం.

[లుబ్ధావధాన్లు చీకటిలో వచ్చి కఱ్ఱతో రామప్పంతులు కాళ్ళమీదకొట్టును. మీనాక్షి కింద పడును.]

లు—బందిపోటు గాడిదుకొడకా!

రామ—చచ్చాన్రా (వీధిలోకి కుంటుకుంటూ పోవును.)

లు—పో. ముండా నువ్వుకూడా నాయింట్లోంచి. (మీనాక్షిని పైకి తోసి తలుపు గడియ వేయును.)

రామ—అసిరిగా చంపేశాడ్రా—కాలెముక విరిగిపోయిందిరా.

అసి—(నిమ్మళంగా) మియ్యానికెట్టింది తింతే యేటౌతదిబాబూ? (గట్టిగా) కానేల యిల్లు జొరబడితే, బుగత తన్నాడా?

రామ—మీనాక్షితో నువ్వు యింట్లోకి వెళ్ళిపో.

మీ—మరి యింట్లో అడుగుపెట్టను. నాసరుకులు లేకపోతే పాయెను రండి రాజమేంద్రం పోదాం.

రామ—తలచినప్పుడేనా తాతకి పెళ్ళి?

మీ—మీయిష్టవొచ్చినప్పుడు పెళ్ళాడుదురుగాని, యింట్లోంచి లేవదీసుకొచ్చాడు గదా? యిహ నేను మీతో ఉండవలసినదాన్నే; పదండి.

రామ—వెఱ్ఱి కుదిరింది రోకలి తలకి చుట్టుకోమన్నాట్ట! బతిమాలుకుంటాను యిప్పటికి యింట్లోకి వెళ్ళిపో.

మీ—మరి యీజన్మంలో యీయింట్లో అడుగుపెట్టను.

రామ—అసిరిగా, మీనాక్షి వొక్కర్తా వుంటుంది. కాపాడి, బుగత తలుపు తియ్యగానే లోపలికి తీసికెళ్ళు. (పరిగెత్తును. మీనాక్షి వెంటబడును.)

[రామప్పంతులు యింటియెదట]

రామ—(తలుపుతట్టి) వేగిరం; వేగిరం తియ్యి.

మధురవాణి—(తలుపు అవతలనుంచి) యేవిఁటా తొందర?

రామ—ఆపుచిట్టెడ వెంట తరుముతూంది.

మధు—చిట్టెడ కనపడగానే తలుపుతీస్తాను.

రామ—తలుపేసుకు, కూచుంటే నీక్కనపడ్డం యలాగ? నువ్వు తలుపు తీసేలోగా నన్ను కాలేస్తుంది.

మధు—నాకంటేదీ?

రామ—కంటె, కంటె, అని తపిస్తున్నావేవిఁటి? నిలబడ్డపాటున నూరు కంటెలు కరిపిస్తాను.

మధు—మీనాక్షిని యెలా మీకు వప్పచెప్పాను, నావొక్క మాటకే నాకిచ్చి మరీ ఇంట్లో అడుగు పెట్టండి.

రామ—రేపు పొగలుగాని కంటె యివ్వనన్నాడు లుబ్ధావధాన్లు?

మధు—రేపే యింట్లోకొత్తురుగాని, మించిపోయిందేమీ లేదు.

రామ—యింతట్లో చిట్టెష మీదపడితే.

మధు—సకేశా? ఆకేశా?

రామ—పిల్లికి చెలగాటం. యెలక్కి ప్రాణపోకటా!

[మీనాక్షి ప్రవేశించి, రామప్పంతులు రెక్క పట్టుకొనును]

మీనా—దీపం ఆర్పి ప్రమాణంచేశావు_తప్పితే తల పగిలిపోతుంది.

రామ—పో ముండా!

మీ—మీ కాగల పెళ్లాన్నిగదా యెక్కడికి పోతాను?

మధు—కాగల పెళ్ళా వేఁటి?

మీ—నిన్ను వొదిలేసి, రాజమహేంద్రం తీసుకుపోయి పెళ్ళాడతా నన్నాడు దీప మార్పి ప్రమాణం చేశాడు _ మరెలా తప్పుతాడు?

మధు—యీవిడేనా ఆపుచిట్టెడ?

రామ—ముండా, నాచెయ్యోదిలె. య్యేనిన్ను నే పెళ్ళాడతానన్నానే? కలగన్నావా యేవిఁటి? (మీనాక్షిని విడిపించుకొనగా మీనాక్షి కిందపడును.)

మధు—ఆడదానిమీదా చెయిజేసుకుంటారు? యేమి పౌరుషం! ఆబద్ధవాఁడకు అన్న మాట నిలబెట్టుకోండి. కులం తక్కువా? రూపం తక్కువా? ఆమె బ్రతుకు భ్రష్టు చెయ్యనే చేశారు, పెళ్లాడి తప్పు దిద్దుకోండి. ఆవిణ్ణి పెళ్ళాడి వొస్తేనే నేను తలుపు తీస్తాను;

మీ—పంతులు నన్ను కాగలించుకుని యెత్తుకుంటే మానాన్న చూసి, తన్ని, యిద్దర్నీ యింట్లోంచి తగిలేశాడు. నువ్వు హెడ్ కనిస్టీబుతో పోతున్నావు. నిన్నొదిలేసి నన్ను పెళ్ళాడతానని వొట్టేసుకున్నాడు. నన్ను లేవదీసుకొచ్చి, నన్ను పెళ్ళాడక తప్పుతుందా యేమిటి?

మధు—అవశ్యం పెళ్ళాడవలసిందే_పెళ్ళాడకపోతే నువ్వుమాత్రం వూరుకుంటావూ? దావా తెస్తావు _ పంతులుగారికి దావాలంటే సరదానే.

రామ—మధురవాణీ _ నీకు మతిపోతూంది _ నాయింటికి నువ్వా యజమానివి? తలుపు తియ్యి.

మధు—నిలవండి కర్పూరం వెలిగించి మంగళహారతి పళ్ళెం తెస్తాను. (తలుపుదగ్గిర నుంచి లోనికి వెళ్ళును)

రామ—(తలుపుసందులోనుంచి చూసి, తరవాత మీనాక్షిని ముద్దెట్టుకుని) యెంతపని చేశావూ! దాంతో చెప్పేశావు! రహస్యంగా లేచిపోయి పెళ్ళిచేసుకోవాలి గాని అల్లరిచేసుకుంటే యలాగ?

మీ—యెప్పుడైనా అందరికీ తెలిసేగదా?

రామ—నామాట విని యిప్పుడు యింటికి వెళ్ళిపో.

మీ—యిహ మాయింటికి వెళ్ళను. యిదే మాయిల్లు; మధురవాణి తలుపు తీస్తుంది; లోపలికి వెళదాం.

రామ—అయితే యిక్కడ వుండు యిప్పుడే వొస్తాను. (కొన్ని అడుగులు వీధంట నడచి, నిలచి, నిజంగా మంగళహార్తి తెస్తుంది కాబోలు పెంకెలంజ? అది తలుపు తియ్యకపోయినా, మీనాక్షి నన్ను వెతకడానికి బయల్దేరుతుంది.) తెల్లవార వచ్చింది – చెరువుకుపోయి కాలకృత్యాలు తీర్చుకుని ఆపైచర్య ఆలోచిద్దాం. రెండ్రోజులు పైకి వుడాయించానంటే, మళ్ళీ వొచ్చేసరికి కొంతఅల్లరి సద్దుకుంటుంది. తలుపుతీసినట్టు కానరాదు యవడిల్లు? యవర్తె యిది నన్ను అడ్డడానికి? ఆశ్చర్యం! (కొంతదూరంగా వీధిలో నిలబడి, దాసరివేషంతో శిష్యుడు చితార మీటి పాడును.)

చరణం. "యిల్లు యిల్లనియేవు। యిల్లు నాదనియేవు।
నీయిల్లు యెక్కడే చిలుకా?

రామ—యిది నాయిల్లు కాదా?"

శిష్యుడు—"ఊరికి ఉత్తరాన। సమాధిపురములో। కట్టెయిల్లున్నదే చిలుకా॥"

రామ—వొల్లకాట్లోనా?

శిష్యుడు—పల్లవి. యెన్నాళ్ళు బ్రతికినా। యేమి సామ్రాజ్యమే।
కొన్నాళ్ళకో రామచిలుకా?"

అనుపల్లవి. "మణ్ణాళ్ళ బతుకునకు। మురిసేవు త్రుళ్ళేవు!
ముందుగతి కానవే చిలుకా?"

రామ—యేవిఁటీ అపశకునం పాటా!

శిష్యుడు—"కట్టితే చుట్టాలు। కట్టైతే బంధువులు।
కన్నతల్లెవ్వరే చిలుకా?"

రామ—చుట్టాలా? వొక్క అప్పవుతుంది, అది యెప్పుడూ నాగుమ్మంలో అడుగు పెట్టలేదు. యిప్పుడు యింటికి యజమానియెవరూ? తలుపవతల సానిలంజా! తలు

పినతల సంసారి వెతపలంజాను; యిద్దరూ కలిసి యిల్లు చేరకుండా నన్ను తగులుతున్నారు.

శిష్యుడు—"నిన్ను మోసేసి నలుగురు ! వెంబడిని పడిఉంది!"

రామ—వెఱ్ఱిముండా పాటా ! పోదాం, (గబగబ రెండడుగులు నడచి, నిలుచుని) యీతోవనే వొస్తున్నాడు కాబోలు– ఆయనగో పాట వినబడుతూంది?

పాట "నువ్వు కాలిపోయెదాక !
కావలుందురు గాని !
కడకు తోలగొట్టురు !
వెంట నెవరూ రారు చిలుకా ॥

రామ—వెఱ్ఱిముండాపాటా !

శిష్యుడు—పంతులు గారూ ! యెక్కడున్నారు?

రామ—ఆరుగుము లేకపోతే పట్టుకుంటుంది. (పరుగెత్తును.)

---

# కన్యాశుల్కము — షష్ఠాంకము

## ౧-వ స్థలము : రామచంద్రపురం అగ్రహారం.

[చెరువుగట్టున వున్న తోటలోనికి పెళ్ళివారి బళ్ళువచ్చును. గట్టుమీద ఒక వైపు అగ్నిహోత్రావధాన్లు, రెండవవైపు పళ్ళు తోమికొనుచు రామప్పంతులును.]

అగ్ని — బళ్ళు దింపండి. బళ్ళు దింపండి. సాయేబూ యేనుక్కి కావలసినంత రొడ్డ. చెరువు స్నానానికి బహు బాగావుంది. యెవరయా చెరువుగట్టుమీద?

రామప్పంతులు... (తనలో) అరే! పరిచితుని. యీవేళకదా పెళ్ళివాడు రావలసిన రోజు? (పైకి) నా పేరు రామప్పంతులంటారు.

అగ్ని — లుబ్ధావధాన్లుగారు మిమ్మల్ని పంపించారా యేమిషి?

రామ — యెందుకండి?

అగ్ని — మేం వొస్తున్నాం గనక యెదురుగా యెవర్నీ పంపలేదా? నా పేరు అగ్నిహోత్రావధాన్లు అంటారు.

రామ — మీరేనా అగ్నిహోత్రావధాన్లుగారు యేం వచ్చారేవిఁటి?

అగ్ని — పెళ్ళిమాట మీకు తెలియదా యేమిషి?

రామ — పెళ్ళేవరికండి?

అగ్ని — మీదీవూరు కాదా? యేమిషండి? మాపిల్లని లుబ్ధావధాన్లుగారి కిస్తాం.

రామ — లుబ్ధావధాన్లుగారికి పెళ్ళైపోయిందే?

అగ్ని — తమరు హాస్యాలాడుతున్నారు - హాస్యాలకేం గాని, ప్రయత్నాలు యలా జరుగుతున్నాయి యేమిషండి?

రామ — మీరే హాస్యాలాడుతున్నట్టుంది. పెళ్ళిఅయి పదిరోజులైంది. లుబ్ధావధాన్లుగారి సంబంధం అక్కర్లేదని మీరు రాశారట. అందుపైని యవడో గుంటూరు నుంచి వొచ్చిన శాస్తుల్లు కొమార్తెని పన్నెండు వొందలిచ్చి పెళ్ళాడాడు.

అగ్ని — అన్నగారూ - హాస్యం ఆడుతున్నారు. న్యాయం కాదు, మనకి బావగారి వరసా యేమిషండి?

రామ — యేమిటి మీమాటలూ? నేను యెన్నడూ అబద్ధవాఁడి యెరగను. నామాట నమ్మక పోవడం ధర్మవేనా?

అగ్ని — ప్రమాణం చెయ్యండి.

రామ — గాయత్రీ సాక్షి.

అగ్ని—అయ్యో! అయ్యో! యేమిదురంతం! రండీ, వెళ్ళి గాడిదకొడుకు యెముకలు విరగ్గొడతాను.

రామ—నేను రానండి. ఆగుంటూరు సంబంధం చెయ్యొద్దన్నానని నాతో మాట్లాడడం మానేశాడు. మీరు వెళ్ళండి.—మీరు తిరిగి వొచ్చేదాకా యిక్కడే కూచుంటాను.

అగ్ని—ఆ గాడిదకొడుకు యింటికి నాకు తోవ తెలియదే?

శిష్యుడు—(చెరువుగట్టు యెక్కుతూ పాడును)

"తా నెవ్వరో తనవా రెవ్వరో?—మాయజీవికి తనువుకు తగులాయ గాకా!"

[రామప్పంతులు నిలబడి శవమును కనుచుండును.]

అగ్ని—యేమిఁ అలా చూస్తున్నారు?

రామ—శవాన్ని మోసుకుపోయేపాట!

శిష్యుడు—"దినమూ, మరణమని తెలియుడీ"

రామ—(శిష్యునితో) వూరుకో (అగ్నిహోత్రావధాన్లుతో) అన్నా ఓ కాని వుందా?

శిష్యుడు—మిమ్మల్ని తీసుకురమ్మంది.

రామ—వచ్చానే.—వొస్తుందా యేమిఁటి?

శిష్యు—కంటె పోతే పోయింది, రమ్మంది.

రామ—బతికాను.

అగ్ని—చావడం యెందుకు; బతకడం యెందుకు?

రామ—అది వేరేకథ.

శిష్యుడు—చిట్టిపులి పిల్లని తండ్రొచ్చి వంటకి తీసుకుపోయినాడట.

అగ్ని—యీవూళ్ళోకి పుల్లొస్తాయా యేమిషీ?

రామ—విరగడైపోయింది (శిష్యునితో) యిందు రూపాయి (శిష్యుడు తీసుకుని) దాసుణ్ణి బాబూ!

(పాడును) "చిత్తాస్వాతివాన, జోడించి కురియగ"

అగ్ని—యేమిఁటీ వెధవపాట? వూరుకుంటావా వూరుకోవా? నీకు రూపాయి చాల దురా గుంటకక్కాగట్టా?

శిష్యుడు—తమరు దయచెయ్యరా బాబూ?

అగ్ని—నేనివ్వను-అన్నా, తోవ యెవరు చూపిస్తారు.

రామ—(శిష్యుడితో) నీకు లుబ్ధావధాన్లు యిల్లు తెలుసునూ.

శిష్యుడు—తెలుసును—తండ్రీ.

రామ—అవుధాన్లుగారు ఓ కానిడబ్బిస్తారు. ఇల్లు చూపించు.

శిష్యుడు — ముందెస్తే గాని చూపించను.

అగ్ని — యింద - యేడు.

[శిష్యుడు ముందూ, అగ్నిహోత్రావధాన్లు వెనక ...., ....లు వెళ్లిన తరవాత శిష్యుడు పాడును]

శిష్యుడు — "పిల్లాలకా యేల నీ ....కా?"

అగ్ని — ....కేటి నీ శ్రాద్ధం?

శిష్యు — యలక్కాయ పిల్లి

(పాడును) "పిల్లన్న లెయి ....శంగనా । ....కేసాగట్టి నున్నంగనూ"

అగ్ని — యేమిటీ?

శిష్యు — "మేకపిల్ల రెండు మేళాంగట్టుకుని । మేరంగితీర్థాని కెళ్ళంగనూ॥"

అగ్ని — యేమిటీ నీ శ్రాద్ధంపాట !

శిష్యు — కొండాయ సేస్తూను, దానిగ్గబట్టుకుని । తోటమల్లీ పువ్వు లేరంగనూ!!

అగ్ని — పాడావంటే తంతాను.

శిష్యు — అయితే నీకు మరి యిల్లు చూపించను.

అగ్ని — పాడగట్టా - (కొట్టబోవును)

శిష్యు — (తప్పించుకు పారిపోతూ) "గట్టుకిందా నున్న । పంబాయ సేస్తూడు - మరి గబుకూ । మరిగబుకూ॥"

(నిష్క్రమించును.)

అగ్ని — వీడిశ్రాద్ధం చెట్టుకింద బెట్టా । తోవ యిటా? అటా?

(తెర దించవలెను)

## ౨-వ స్థలము : చెఱువుగట్టు తోట.

[అగ్నిహోత్రావధాన్లు, రామప్పంతులు, వెంకమ్మ, యితరులూ]

అగ్ని — గాడిదెకొడుకుని మాచెడ్డదెబ్బలు కొట్టేశాను. ఏనుగులూ, గుఱ్ఱాలూ, వీడిశ్రాద్ధంమీదికి! తోవఖర్చయినా వొక గమ్మిడీ ఇయ్యడప.

వెంకమ్మ — మనప్రారబ్ధం చేసొచ్చిన నోవులు ఇలాఉండగా, మరోలా యలా అవుతుంది? యీసమ్మంధం వొద్దని పోరితే విన్నారూ? నేను భయపడుతూనే ఉన్నాను. బయలుదేరేటప్పుడు పిల్లి యెదురుగుండా వొచ్చింది.

అగ్ని — పింజారీ! వూరుకో - ఆడముండలకేం తెలుసును? అన్నగారూ, క్రిమినల్ కేసు తనడానికి అవకాశం ఉంటుందా? మాదగ్గిర అయ్యవారుఒకాయనఉన్నారు. ఆయనకి లాబోగట్టా మాబాగా తెలుసును. ఆయన్నికూడా సలహాచేదాం.

రామ—కోర్టువ్యవహారాల్లో ఆరితేరిన మీకు వొకడు సలహా యివ్వాలండీ? స్వతః జ్ఞాని గనక సాక్ష్యం గిక్ష్యం తేవడానికి నేను సాయంచేస్తున్నానుగానీ, అయ్యవార్లూ గియ్యవార్లూ మీకూ నాకూ సలహాచెప్పేపాటివాళ్ళా? గుంటకక్కకట్లు రెండు ఇంగిలీషుముక్కలు చదువుకున్నారు గనక ముక్కస్య ముక్కార్థః అని తర్జుమాలు మట్టుకు చేస్తారు; గాని యేదయినా యెత్తు యెత్తావంటే, తమలాంటియోధులు యెత్తాలి. నాలాంటి నియ్యోగపాడు నడిపించాలి. క్రిమినలుకి అవకాశం ఉందా అని అడుగుతా రేవిఁటి? మీకు తెలియదా యేవిఁటి! ఒట్టుపైని సులభసాధ్యంగా మూడునాలుగువేలు డామేజీకూడా సివిల్లో లాగేస్తాను.

అగ్ని—అదే, నా ఆలోచన.

రామ—తీరిపోయె; మళ్ళీ సలహా యేవుంది. వెంటనే వెళ్ళి నుక్కు తగిలించేదాం. ఖర్చులికి సొమ్ముపట్టుకుని బయలుదేరండి.

అగ్ని—నాదగ్గిర దమ్మిడీలేదు; యేమిసాధనం? యీ గాడిదకొడుకు రూపాయలిస్తాడని నమ్మి, నే నేమీ తేలేదు.

రామ—ఇంటికి వెళ్ళి లెక్కపట్టుకు వొచ్చేటప్పటికి పుణ్యకాలం మించిపోతుంది. "శుభస్య శీఘ్రం" అన్నాడు. మీ ఆలోచనేవిఁటి?

అగ్ని—ఇదేదో అయితే నేగాని ఇంటిమొహం చూసేదిలేదు. మా అమ్మి సరుకేదైనా యీవూళ్ళో తాకట్టు పెడదాం.

రామ—అయితే పట్టుకురండి, పోలిశెట్టిదగ్గిర తాకట్టు పెడదాం; పోలిశెట్టినిమనం కొంచం మంచిచేసుకోవటం అవశ్యకం. మీరు బుచ్చావధాన్ని కొట్టినప్పుడు పోలిశెట్టి ఉన్నాడుగనక, బుచ్చావధాన్లు మీమీద ఛార్జీచేసినప్పుడు, పోలిశెట్టిని తప్పకుండా సాక్ష్యం వేస్తాడు. శెట్టిని మనం విడతియ్యడం జరూరు. యేవంటారు?

అగ్ని—మీసలహా మంచిగా ఉంది. నాకూ అదే భయవేస్తూంది.

రామ—చూశారా, ప్రతివాడికీ సలహా చెప్పడం చాతౌతుందండీ? అందులో యీ యింగిలీషు చదువుకున్న అయ్యవార్లని సలహా అడిగితే, కేసులే తేవొద్దంటారు. దొంగసాక్ష్యాలు తేవొద్దంటారు. వాళ్ళసొమ్మేంపోయింది? యేమాలకూడదూ లేకపోతే కేసులు గెలవడం యలా?

అగ్ని—మా అయ్యవారుమట్టుకు మంచిబుద్ధిమంతుడూ తెలివైనవాడూ నండి. కోర్టు వ్యవహారాలలో అతనికి తెలియనిసంగతి లేదండి. అంత బుద్ధిమంతుణ్ణి నేను యెక్కడా చూడలేదు. ఆయన్ని చూస్తే మీరలాగే అంటారు.

రామ—యెంతబుద్ధిమంతుడైనా మీకొకడు సలహా చెప్పేవాడున్నాడండీ? చెవులో

మరోమాట—మీఅయ్యవారు గిరీశంగారు కాదండీ? వారు లుబ్ధావధాన్లు పింతల్లి కొడుకుగదా? మీకావాడు, యీకేసుల్లో సరైన సలహా చెబుతాడు?

అగ్ని — అవునండోయి!

రామ — వెయ్యాగపాణి—నామాట కొంచం ఖాతరీ చెయ్యండి. గనక, ఆఅయ్యవార్ని తోడిచ్చి పిల్లన్ని యింటికి పంపించెయ్యండి. యెకాయెకిని మనం తక్షణం వెళ్ళిపోయి లుబ్ధావధాన్లుకన్న ముందు కుక్క తగిలించెయ్యాలి, యేదో ఒకబురు వేగిరం పట్టుకొండి.

అగ్ని — యేదీ, అమ్మిని యిలా పిలవు.

వెంకమ్మ — అమ్మేం చెప్తాం? బద్ధకించి బండిలో పడుకుందికాబోలు. పిలువమ్మా.

అగ్ని — మనకి డామేజీ దిట్టంగా వొస్తుందా?

రామ — వొస్తుందంటే అలాగ యిలాగానా?

ఒకడు — అమ్మన్నగారిబండీ యెక్కడా కనపడదు; బండీ వెనక పడిపోయిందికాబోలు

వెంకమ్మ — అదుగో అబ్బివున్నాడే? వీడెలా వొచ్చాడు? అబ్బీ నువ్వు అక్కయ్య బండిలో కూచోలేదురా?

వెంకటేశం — లేదు. నేను యేనుగెక్కేను.

అగ్ని — దొంగగాడిదకొడకా అయ్యవారేరా?

వెంకటేశం — యెక్కడా కనపడ్డు—

అగ్ని — గుఱ్ఱంవొచ్చిందా? గుఱ్ఱపాడేడీ?

వెంకటేశం — గుఱ్ఱపాడు చెప్పాడు—

అగ్ని — యేమిట్రా, వెధవా, చెప్పాడూ?

వెంకటేశం — మష్టరూ — రాత్రి —

అగ్ని — నోటంట మాట పెగల్దేం?

వెంకటేశం — గుఱ్ఱం దిగి — బండీయెక్కేట్ట.

వెంకమ్మ — అయ్యొయ్యో దాన్ని లేవదీసుకు పోలేదుగద?

దగ్గిరున్నవారు — ఆఁ! ఆఁ!

వెంకమ్మ — కొంప మునిగిపోయింది. మరేవిఁటి!

[చతికిల బడును]

అగ్ని — (కోపముచేత వణకుచు) అయ్యవారు పకీరయుండని లేవతీసుకు పోయాడూ? నగలపెట్టె? నాకోర్టుకాగితాలో!

వెంకటేశం — అక్కయ్యపెట్లో నాపుస్తకాలు కూడా పెట్టాను.

అగ్ని — దొంగగాడిదకొడకా! నువ్వే వాణ్ణి యింట్లో పెట్టావు. రవంత ఆచోకీ తెలిసిందికాదు దొంగవెధవని చంపేసిపోదును. గాడిదకొడుకును అమాంతంగా పాతిపెట్టేదును.

రామ — (దగ్గిరకు వచ్చి) అయ్యవారు మహాదొడ్డవాడని చెప్పారే? యేమీ యెత్తుకుపోయినాడేమిటండి?

అగ్ని — యేమీ యెత్తుకుపోయినాడా? నీశ్రాద్ధం యెత్తుకుపోయినాడు. పకీరుమూండని యెత్తుకుపోయినాడు, యీ గాడిదకొడుకు యింగిలీషు చదువు కొంప ముంచింది.

(వెంకటేశం జుత్తుపట్టుకుని కొట్టబోవుచుండగా తెర దించవలెను)

## 3-వ స్థలము : విశాఖపట్టణములో మధురవాణి బస యెదటివీధి.

[రామప్పంతులు, అగ్నిహోత్రావధాన్లు ప్రవేశింతురు]

అగ్ని — మనం పోలిశెట్టిదగ్గిర బదులుతెచ్చిన రూపాయలన్నీ అయిపోయినాయి. రొప్పటికీ ఖర్చులు ఖర్చులే అంటారు; నాదగ్గిర ఒకదమ్మిడీలేదు.

రామ — ఖర్చుకాంది కార్యాలవుతాయటయ్యా? మీకడియం యెక్కడైనా తాకట్టు పెట్టండి.

అగ్ని — యీవూళ్లో మనం యెరిగినవాళ్లెవరున్నారు?

రామ — రండి మధురవాణిదగ్గిర తాకట్టు పెడదాం.

అగ్ని — చేసేవి ఘోషస్నానాలూ, దూరేవి దొమ్మరికొంపలూ అని, జటాంతస్వాధ్యాయిని నన్ను ముండలిళ్ళకి తీసుకువెళ్తావటయ్యా?

రామ — మరి యేకొంపలూ తొక్కపోతే కేసులు గెలవడం యెలాగ? అది అంపరు ముండల్లాంటిది అనుకున్నారా యేమిటి? సంసారివంటిది. ఐనా మీకు రావడం ఇష్టం లేకపోతే నాచేతి కివ్వండి. నేనే తాకట్టుపెట్టి సొమ్ము తీసుకొస్తాను.

అగ్ని — అలాకాదు; నేను కూడా వస్తాను.

రామ — యేదీ కడియం ఇలాగివ్వండి.

అగ్ని — యిది మాతాతగార్నాటిది. ఇది యివ్వడమంటే నాకేమీ యిష్టం లేకుండా వుంది. డబ్బు వూరికే ఖర్చుపెట్టించేస్తున్నావ్; మీరు కుదిర్చిన వకీలు తగినవాడు కాడట; యింగ్లీషూ రాదు ఏమీ రాదూ.

రామ — ఆయన్లాంటిచెయ్యి యీజిల్లాలో లేదు. ఆయన్ని చూస్తే డిప్టీకలెక్టరుగారికి ప్రాణం. ఇంతకీ మీరేదో పట్టుదల మనుష్యులనుకున్నాను గాని; మొదటున్న వుత్సాహం మీకు యిప్పుడు లేదు. మీకు డబ్బు ఖర్చుపెట్టడం యిష్టం లేకపోతే మానేసేపారెయును. "యావత్తైలం, తావద్వ్యాఖ్యానం" అన్నాడు. మరి నాకు శెల విప్పించెయ్యండి.

అగ్ని — (ఆలోచించి) అయితే తాకట్టుపెట్టండి. (అని నిమ్మళముగా కడియము తీసి యిచ్చును.)

రామ — (తనచేత నెక్కించుచు) యీకేసుల్లో యిలాగా శ్రమపడుచున్నానుకదా? నాకొక దమ్మిడీ అయినా యిచ్చారుకారుగదా?

అగ్ని — అయితే నాకడియం వుడాయిస్తావా యేమిటి?

రామ — నేను మీకు యెలాంటి వకీల్ని కుదిర్చాను! ఆయన మీవిషయమై యెంత శ్రమపడుతున్నాడు! ఇదుగో ఆయన వస్తున్నాడు.

[నాయడు ప్రవేశించును]

రామ — (తనలో) యేమిటి చెప్మా వీడు మధురవాణిబస పెరటిదొడ్డివేపునుంచి వస్తున్నాడు? వీడుకూడా మధురవాణిని మరిగాడా యేమిటి? వీణ్ణి యీ కేసులోనుంచి తప్పించెయ్యాలి.

నాయుడు — యేమండి రామప్పంతులున్నా మీరు తాఖీజా యిప్పించారు కారుగదా?

అగ్ని — మీరు రాసిన డిఫెన్సు బాగుండలేదని భుక్తగారన్నారట.

నాయుడు — ఎవడా అన్నవాడు? గుండుపిండిచేస్తాను. రామప్పంతులన్నగారూ చూశారండీ డిఫెన్సు యెంత జాగ్రతగా తయార్ చేశాను. నాదగ్గిర హైకోర్టుకూడా క్లయింట్లు రాసుకువెళ్ళిపోతారు. యీకేసు కేసనగా యేపాటిది? నే చెప్పినట్లల్లా పార్టీ నడిస్తే నేపట్టినకేసు పోవడమన్నమాట యెన్నడూ లేదు. యీడిఫెన్సు చిత్తగించండి. (చంకలోని హమాల్‌పెట్టె తీసి విప్పి అందులో ఒక కాగితము తీసి చదువును.)

"ఫిర్యాదీ చెప్పిన సంగతులు యావత్తూ అబద్ధంకాని యెంతమాత్రం నిజంకావు" చూశారా ఆవక్కమాటతోటె ఫిర్యాదీవాదం అంతా పడిపోతుంది. "ఫిర్యాదీ నామీద గిట్టక దురుద్దేశంతో కూహకంచేసి కేసు తెచ్చినాడు కాని యిందులో యెంతమాత్రం నిజంలేదు."

రామ — డిఫెన్సునాటకేమండిగాని అవధాన్లుగారు పైసా లేదంటున్నారు.

నాయు — పైసా లేకపోతే పని ఎలా జరుగుతుంది?

రామ — ఒకసంగతి మనవిచేస్తాను యిలారండి. (రామప్పంతులు, నాయుడు వేరుగా మాటలాడుదురు.)

రామ — నాయుడుగారూ మీపక్తీ యీయన కేమీ సమాధానం లేదు. నేనెంత చెప్పినా వినక భీమారావుపంతులుగారికి వకాల్తీ యిచ్చాడు. మీకు యింగ్లీష్ రాదనీ, లా రాదనీ, యెవడో దుర్బోధ చేశాడు.

నాయుడు — స్కార్లెట్ దొరగార్ని మెప్పించిన ముండాకొడుకుని నాకు లా రాకపోతే యీగుంటవెధవలకుటోయ్ లావస్తుంది, పాస్ పేసని రెండు యింగ్లీషు ముక్కలు మాట్లాడడంతోటే సరా? ఏమిటి? అందులో ప్రస్తుత కలక్టరుగారికి ఇంగిలీషు వకీలంటే కోపం. అందులో బ్రాహ్మడంటే మరీని. ఆమాట అందరికీ బోధపర్చండి.

రామ — మరి కార్యం లేదండి. నేయింతో దూరం చెప్పాను; తిక్కముండాకొడుకు విన్నాడు కాదు.

నాయుడు — అయితే నన్నిలాగు అమర్యాద చేస్తారూ? యీ బ్రాహ్మడి యోగ్యత యిప్పుడే కలక్టరుగారిబసకు వెళ్ళి మనవిచేస్తాను.

(తెర దించవలెను)

## ౨-వ స్థలము : లుబ్ధావధాన్లు బస.

లుబ్ధావధాన్లు — (ప్రవేశించి) ఏమి గుంటక్క వచ్చింది! నాఅంత దురదృష్టవంతుడు లోకంలో యెవడూ లేడు. పిల్లాడికని కాగానే కాశీకి బయల్దేరపోవలిసింది. బుద్ధితక్కువపనిచేశాను. ఇలా రాసివుండగా యెలా తప్పుతుంది. సౌజన్యారావు పంతులు దేవుఁడు. ఆయనలాంటివాళ్ళు ఉండబట్టే వర్షాలు కురుస్తున్నాయి. ఆయన శెలవిచ్చినట్టు తప్పంతా నాయందు ఉంచుకుని విధిని నిందించడ వెందుకు? ఇంత డబ్బుండీన్నీ, డబ్బుకి లోభపడి ఒక్కగా నొక్క కూతుర్ని ముసలివాడికి అమ్మాను. నాజీవానికి ఉసురుమంటూ అది కాని తిరుగుటు తిరిగింపంటే దాని తప్పా? బుద్ధితక్కువ వెధవని, ముసలితనంలో నాకు పెళ్ళేం? దొంగముండా కొడుకని తెలిసిన్నీ ఆరామప్పంతుల్ని నేన్నమ్మడవేవిఁ? ఆమాయగుంట పారిపోవడవేంవి? కంటెకి, ఆఅల్లరేమి? అయినిసిపికటరు కూనీ చేశావని మమ్మల్ని సల పెట్టవేఁటి? అంతా ఘోరకలి; కలి నిండిపోతూంది. ఒక్క సౌజన్యారావుపంతులు సత్యసంధుడు నాకు కనపడుతున్నాడు. కడవంతా వకీళ్ళూ, పోలీసులూ, పచ్చిదొంగలు — ఆయనచక్రం అడ్డువేసి మమ్మల్ని యీఆపదలోంచి తప్పించారంటే కాశీవాసం పోతాం — ఏమిచిత్రాలు వెధవలకి మఠంకట్టారట! యన్నడూ వినలేదు. అమ్మిని వెళ్ళి ఆమఠం చూడమంటాను. దానికి ఇష్టం కలిగిందా, దానికి కావలసిన డబ్బుయిస్తాను. ఆమఠంలో ఉంటుంది లేకుంటే, నాతోపాటు కాశీవాసం.

[రామప్పంతులు ప్రవేశించును]

బై—కంటె పెగింటే అని ప్రశంసించి కార్యంలేదు.

రామ—ఆకంటె మాట ప్రశంసించడానికి రాలేదు. మావాళ్ళ. ఆకంటె మధురవాణిది. మీకెరుకగదా? అదీ మీరూ యేంజేసుకుంటారో నాకేం కావాలి? కంటె సిగ కోసిరిగాని, మీకు ఓగొప్ప సాయం చెయ్యడానికి వొచ్చాను. మీఅవస్థ చూస్తే నాగుండె నీరైపోతూంది.

లు—మహాప్రభో! నీకు పదివేల నమస్కారాలు. యిక యీ పకీరువెధవని వదిలెయ్యి.

"రామనామ తారకం।

భక్తిముక్తిదాయకం। జానకీమనో"—

రామ—రామ! రామ! యంతమాట అంటివయ్యా! మీరు ఆపదలో నుండి విరక్తిచేత యేమిమాటలన్నా అవి వడి, పనిచెయ్యడం నాకు విధి. చెప్పేమాట చెవినిబెట్టండి. ముందూ వెనకా చూడడానికి యిహ టైములేదు. వ్యవహారం అంతా సూక్ష్మంగా పోక్తుపరుచుకు వొచ్చాను. రెండు సంచులతో, కూనీకేసంతా మంచు విడిపోయినట్టు విడిపోతుంది. ఒక్క యినస్పెక్టరుతో కుదరలేదు. డిప్టీకలక్టరికి కూడా చెయ్యి తడిచెయ్యాలి. మీదగ్గిర యిప్పుడు సొమ్ము లేదంటిరా, ఒకచోట వ్యవహారం కూడా పోక్తుపర్చాను. ప్రాంసరీనోటుమీద యెన్ని రూపాయలు కావలిస్తే అన్ని రూపాయలిస్తాను.

లు—నేను వకదమ్మిడీ యివ్వను. 'రామనామతారకం భక్తిముక్తి దాయకం। జానకీ మనోహరం। సర్వలోకనాయకం॥'

రామ—నామాట విను. యెంతో ప్రయాసంమీద యీఘట్టం కుదిర్చాను. తాసీల్దారు మీదగ్గిర లంచం పుచ్చుకుని కూనీకేసు కామాపుచేశాడని, యినస్పెకటరు, డిప్టీకలక్టరికి గట్టిగా బోధపర్చాడు. కలక్టరు సలహామీద యినస్పెక్టరు చాలా పట్టుదలగా పనిచేసి, సాక్ష్యం అంతా రెడీచేశాడు. కేసు రుజువైనట్టాయనా యేమౌతుందో ఆలోచించుకోండి.

బై—నీకెందుకు నాయేడుపు?

రామ—డిప్టీకలక్టరు బ్రహ్మద్వేషి—తాసిల్దారు తాడు కూడా తెగుతుంది. తరవాత మిమ్మల్నీ, మీనాక్షినీ కమ్మెంటు కట్టేస్తాడు—వురి సిద్ధం. నాకూ యినస్పెక్టరికీ వుండేస్నేహంచేత యీఘట్టానికి వొప్పించాను. గనక నామాటకి చెవొగ్గి యీ ఆపద తప్పించుకోండి.

బై—నన్ను బాధపెట్టక నీదారిని నువ్వు పోదూ. "రామనామ తారకం। భక్తి ముక్తిదాయకం।"

రామ — నీ అంత కర్కోటకుణ్ణి యెక్కడా నేను చూడలేదు. నీవాట కేం పెద్దవాడివి—పసిపిల్ల, కనుపూసకన్న మీనాక్షికి పురిసిద్ధం అయితే, ముండా పెళ్ళికి ముందు నేనకా చూస్తావు! తలుచుకుంటే నాహృదయం కరిగిపోతూంది.

[సౌజన్యారావు పంతులు ప్రవేశించును]

రామ — తమరుధర్మస్వరూపులు లుబ్ధావధాన్లుగారియందు అకారణమైన దయచేత యీ కేసులో పనిచేస్తున్నారు. కేసంతా పట్టి అన్యాయమయినది. పిసరైనా నిజం లేదు. కలవైతే గట్టి డిఫెన్సు సాక్ష్యం—

సౌజ — నీసంగతి నాకు తెలుసును అవతలకి నడువు.

రామ — తమరు యోగ్యులూ గొప్పవారూ అయినా, పేచపనప్రయోగ...

సౌజ — నడువు.

[రామప్పంతులు నిష్క్రమించును]

సౌజ — ఈడౌల్బాజీని తిరిగి యెందుకు రానిచ్చారూ?

లుబ్ధా — పొమ్మంటే పోడు బాబూ!

సౌజ — యేవొచ్చాడు?

లు — యినస్పెక్టరీ డిప్టీకలకటరికి లంచం యిమ్మంటాడు.

సౌజ — డిప్టీకలక్టరుగారు లంచం పుచ్చుకోరు. ఆయన నాకు స్నేహితులు; నాకుతెలుసును. లంచాలూ పంచాలూ మీరు యిచ్చినట్టయితే, మీకేసులో నేను పని చెయ్యను.

లు — తమశలవు తప్పి నడిస్తే చెప్పుచ్చుకు కొట్టండి. నాకు భగవంతుడిలాగ తమరు దొరికారు. "పాలను ముంచినా మీరే నీళ్ళను ముంచినా మీరే" అని మిమ్మల్నే నమ్ముకున్నాను.

సౌజ — మీరు నేరం చెయ్యలేదని నాకు పూర్తిఅయిన నమ్మకంవుంది. నిజంకనుక్కోడానికి చాలా ప్రయత్నం చేస్తున్నాను గాని ఆగుంటూరిశాస్తుల్లు యెవడో భేదించ లేకుండావున్నాను. మీరు జ్ఞాపకం మీద చెప్పిన వహారా గుంటూరు వ్రాసి పంపించాను. అక్కడ అలాంటి మనిషి యెవడూ లేడని జవాబు వొచ్చింది.

లు — ఆదేవమాయో బాబూ! మీసాయంవల్ల యీగండం గడిచి, నాపిల్లా నేనూ యీ ఆపదలోంచి తేలితే, నాడబ్బంతా, మీపాదాలదగ్గిర దాఖలుచేసి కాశీ పోతాను.

సౌజ — మీడబ్బు నాకక్కరలేదని మీతో మొదటే చెప్పాను నేచెప్పిన మాటలు మీకు నచ్చి ముసలివాళ్ళు పెళ్ళాడకూడదనీ, కన్యాశుల్కం తప్పనీ, యిప్పటికైనా మీకు నమ్మకం కలిగితే, యిలాంటి దురాచారాలు మార్పడానికి రాజకు

సింహాచలం దగ్గిరలో వక మఠం వుంది. ఆ మఠానికి కొంచవో గొప్పో మీకు తోచిన డబ్బు యివ్వండి. ఏతంతువున్నా మఠానికి మిమ్మల్ని పంపడం నా సలహా.

లు—తమచిత్తం, తమబవు, చేసినతప్పాలు తప్పాలని శల్యాల్ని పట్టిపోయింది. బుద్ధి వొచ్చింది బాబూ.

సౌజ—ఆగుంటూరుశాస్త్రుల్లుకి సరవంటజేశేవు యోసవుండేదా? బాగాజ్ఞాపకం చేసుకు చెప్పండి.

లు—(ఆలోచించి) లేదండి.

సౌజ—బాగా జ్ఞాపకం తెచ్చుకోండి.

లు—లేదండి,

(తెర దించవలెను.)

## ౫-వ స్థలము: విశాఖపట్టణములో

[మధురవాణి యింటి యెదటి వీధికొసను కరటకశాస్త్రి, శిష్యుడూ ప్రవేశింతురు]

కరట—నువ్వు ఆకంటె నెత్తిని కొట్టకుంటా లేచి రావడంనుంచి, యీ ముప్పంతా వొచ్చినట్టు కనబడుతుంది.

శిష్యుడు—మధురవాణికంటె మధురవాణికి ఇవ్వడం తప్పాఅండి?

కరట—తప్పుకాదా? నువ్వుయిచ్చావని, మరి అది వొప్పుకుందా? తే, ధగిడీకే కంటె తెస్తావా చస్తావా?" అని రావప్పంతుల్ని పీక పిండెట్టింది. దానిబాధ పడలేక, ఆరావప్పంతులు కూనీకేసని యెత్తుకెత్తాడు. ఆముసలాడికి శిక్ష అయిపోయిందంటే, బ్రహ్మహత్య నామెడకి చుట్టుకుంటుంది. నువ్వు అంటూ ఆకంటె వాళ్ళ యింట వొదిలేస్తే, నాకు యీ చిక్కు లేకపోవునుగదా?

శిష్యుడు—వెధవముండని గూబగపలేస్తుంటే కంటెగింటె జ్ఞాపకం వొస్తుందండి? చెయికరచిపెట్టైతీసి, మొహురు అంకించుకుని, చెంగున గోడగెంతాను. పజ్యెండు వొందలు మీరు పట్రాగా, నాకు పెళ్ళిలో పెట్టినకంటే నేను తెచ్చానవా, తప్పు పట్టుతున్నారు? ఆకంటెఅయినా దక్కిందా? చూస్తూనే మధురవాణి లాక్కుంది.

కరట—నేను హాస్యగాణ్ణే గాని, యీకూనీ గడబిడతో నాహాస్యమంతా అణగిపోయింది. గనక యిక హాస్యం మాను—నేను తీసుకున్న రూపాయలు లుబ్ధావధాన్లుకి యెప్పటికైనా పంపించడానికే తలచాను। అంతేగాని అపహరిద్దామని అనుకోలేదు. మధురవాణిని యెలాగైనా లయలేసి, కంటె యెరువు పుచ్చుకుని, ఆకంటె

యీ రూపాయలూ, బంగక్షీ వృఘాన్ను పంపించేస్తే, చూసి నిజంకాదని పోల్చుకుంటారు. నాకీ యీ బ్రహ్మహత్య తప్పిపోతుంది.

శిష్యుడు—మీ నేస్తులు సౌజన్యారావుపంతులు గారితో నిజం చెప్పెయ్యరాదాఅండీ.

కరట—వెఱ్ఱి కుదిరింది. రోకలి తలకి చుట్టమన్నాట్ట! నెక్కట్టికి సొంతగా పోలీసుతల్లి కూరగాయలు పుచ్చుకుంటే, జుల్మానా వేశాట్ట; సౌజన్యారావుపంతులు అలాటివాడు. ఆయనతో మనం వున్నమాట చెప్పామంటే, ఆయన నిజం కోర్టులో చెప్పేస్తాడు. ఆపైని లుబ్ధావధానుల పీకవురి మనపీకకి తగులుకుంటుంది.

శిష్యుడు—"మన" అంటున్నారేవిటి?

కరట—మాట పొరపాటురా. రామప్పంతులు వూరికి వెళ్ళినమాట నిజమేనా ?

శిష్యుడు—నిజమే.

కరట—వాడికంట పడ్డావంటే—

శిష్యుడు—పడితే?

కరట—మరేంలేదు. మధురవాణిగాని కంటె మనకి యెరువు యివ్వడానికి వొప్పుకుంటే ఆంజనేయస్వామికి పదిశేర్ల నెయ్యి దీపారాధన చేస్తాను.

శిష్యుడు—కడుపులోనికి వెళ్ళవలసిన నెయ్యి కాల్చెయ్యడం నాకేమీ యిష్టం లేదు. అమృతగుండీ మొక్కుకోండి.

కరట—హాస్యంచాలించు బెడిసిగొడుతుంది.

(నిష్క్రమింతురు)

## ౬-వ స్థలము : మధురవాణిబసలో గది

[మధురవాణి కుర్చీమీద కూచుని యుండును. కరటకశాస్త్రుల్లు, శిష్యుడూ, ప్రవేశింతురు. మధురవాణి నిలబడును.]

మధు—గురువుగారికి పదివేల దండాలు; శిష్యుడికొక చిన్నముద్దు. (శిష్యుని ముద్దు బెట్టుకొనును.)

కరట—నీపుణ్యం వుంటుంది. నాఅల్లుణ్ణి చెడగొట్టకు.

మధు—అల్లుడెవరు?

కరట—నాపిల్లని యితగాడికి యిచ్చి కన్యాదానం చేస్తాను.

మధు—జెయిలునుంచి వచ్చినతరవాత పెళ్ళా ? లేక, పెళ్ళిచేసుకుని, మరీ మరి ప్రవేశమా?

శిష్యుడు—జయిలేవిఁటండోయి?

కరట—వొట్టినె పోస్యానికంటూంది.

మధు—పాపం ఆపసిపిల్లవాడికి ఉన్న నిజస్థితి చెప్పండి తనవాళ్ళని వెళ్ళి చూసైనా వస్తాడు.

శిష్యుడు—(కరటకశాస్త్రితో) కొంపముంచావో?

మధు—ముంచడం అంటే అలాగా యిలాగానా?

కరట—నీపుణ్యంవుంటుంది హాస్యం చాలించు. లేకపోతే కుఱ్ఱవాళ్ళకి పెద్దలయందు భక్తి చెడుతుంది.

శిష్యుడు—నేనేం తప్పచేశాను? గురువుగారు చెప్పినపని చేశాను. అతప్పూవొప్పూ ఆయందే.

మధు—యెవరేమి చేసితిరో, నాకు తెలియదుగాని, మీయిద్దరికోసం హెడ్ కనిస్టీబు గాలిస్తున్నాడు. దొరకగానే మఠప్రవేశం చేస్తాడట యీ మాటమట్టుకు నాకు రూఢిగా తెలుసును.

శిష్యు—యిదేనా మీరు నాకు చేస్తానన్న పెళ్ళి?

కరట—యేమైనా జట్టివస్తే, నీప్రాణానికి నాప్రాణం అడ్డువెయ్యనట్రా?

మధు—వొస్తే జట్టి గురుశిష్యులకు యిద్దరికీ వొక్కమారే వస్తుందిగాని, ఒకరికి రావడం ఒకరు అడ్డుపడడం అన్నమాట వుండబోదు. యెప్పుడైనా మీయిద్దరి ప్రాణాలకీ నేను కనికరించి, అడ్డుపడాలిగాని, మరియెవడికి సాధ్యం కాదనుకుంటాను.

శిష్యు—మాగురువుగారి మాటకేం; ఆయన పెద్దవారు; యేవొచ్చినా సర్దుకోగలరు. నేను పాపం పుణ్యం యెరగని పసిపిల్లవాణ్ణి. నాప్రాణానికి నీప్రాణం అడ్డువేశావంటే కీర్తి వుండిపోతుంది.

మధు—నీగురువుని వొదిలేసి నాదగ్గిర శిష్యరికం చేస్తావా?

శిష్యు—యిదిగో-యీనిమిషం వొదిలేస్తాను. (బుగ్గలు గాలితో పూరించి పిడికిళ్ళతో తట్టిగురువుతో) మీనేస్తం యీవేళతో సరి మరి ఆడవేషం యీజన్మలో వెయ్యను.

మధు—నాటకంలో కూడా వెయ్యవా?

శిష్యు—మరి నాటకం గీటకం నాకొద్దు.

మధు—నాదగ్గిర శిష్యరికం అంటే యేవేం చెయ్యాలో తెలుసునా?

శిష్యు—నీళ్ళుతోడుతాను. వంటచేస్తాను. బట్టలుతుకుతాను. గాని బ్రాహ్మణ్ణిగదా కాళ్ళు పట్టమనవుగద.

మధు—(విరగబడి నవ్వి) యిదా నీగురువుదగ్గిర చేసే శిష్యరికం?

శిష్యు — మరిచిపోయినాను. చిడతప్పుళ్లు కూడా కొడతాను.

మధు — (నవ్వి) వెంకా?

శిష్యు — యే నౌఖరీ చెయ్యమంటే ఆ నౌఖరీ చేస్తాను.

మధు — నన్ను ముద్దెట్టుకొమ్మన్నప్పుడల్లా ముద్దెట్టుకోవాలి.

శిష్యు — ముద్దెట్టుకుంటాను.

కరట — వాడు కుఱ్ఱవాడు—వాణ్ణెందుకు చెడగొడతావు? ఆ శిష్యరికం యేదో వాడి తరఫునా నా తరఫునా కూడా నేనే చేస్తాను. చాతనైతే చక్రం అడ్డెయి.

మధు — "గురువూ శిష్యుడాయె. శిష్యుడూ గురువాయె"
మీరు శిష్యుడు కావాలంటే యీనూర్లు జీతం యిచ్చుకోవాలి.

కరట — పిల్లికి చెలగాటం; యెలక్కి ప్రాణపోకటా; !

మధు — మీరా యెలక?

కరట — అవును.

మధు — మీరు యెలక కారు. పందికొక్కులు. మీ శిష్యుడు యెలక.

కరట — పోనీ — వాణ్ణయినా కాపాడు.

మధు — అదే ఆలోచిస్తున్నాను.

కరట — బుద్ధీ బుద్ధీ కలిస్తే రాపాడుతుంది. నీ ఆలోచన యేదో కొంచం యనా నా ఆలోచన కూడా చెబుతాను. కలబోసుకుందాం.

మధు — మీ ఆలోచన ముందు చెప్పండి.

కరట — మరేమీ లేదు. నేపుచ్చుకున్న పజ్యాండువొందలరూపాయలనోట్లూ, ఆకంటా, పోస్టుద్వారా భీమా చేసి గుంటూరు శాస్త్రుల్లు పేరట లుబ్ధావధాన్లుకి పంపిస్తాను. దాంతోటి కానీ కేసు నిజం కాదని సౌజన్యారావు పంతులుగారు పోల్చుకుంటారు. పైపైని దైవాధీనం!

మధు — మీకు కంటె యెలా వొస్తుంది?

కరట — నువ్వు అనుగ్రహిస్తేను.

మధు — (ముక్కుమీద వేలువుంచుకుని) చిత్రం! బ్రాహ్మలు యంతకైనా తగుదురు.

కరట — యేమిఁ అలా అంటున్నావు?

మధు — నా కంటె తిరిగి నేను కళ్ళచూడడం యెలాగ?

కరట — సౌజన్యారావు పంతులుగారు నీవస్తువ నీకు యిచ్చేస్తారు. ఆయన బహు న్యాయమైన మనిషి.

మధు — అంత మంచివాడా?

కరట — అందులకు సందేహావేవిఁటి?

మధు—యెంత మంచివాడు?

కరట—అంత మంచిమనిషి మరి లోకంలో లేడు.

మధు—ఆయన్ని నాకు చూడాలనుంది. తీసికెళ్తారా?

కరట—నా ఆబోరుంటుందా? ఆయన సానివాళ్ళని చూడరు.

మధు—అంటే నాచ్చి కాబోలు?

కరట—యింగిలీషు చదువుకున్నవాళ్ళకి కొందరికి పట్టుకుంది యీచాదస్తం! ఐనా అందులోనూ దేశకాలాలనుబట్టి రకరకాలు లేకపోవడంలేదు.

మధు—సౌజన్యారావుపంతులుగారిది యేరకం? గిరీశంగారిది యేరకం?

కరట—ఏమి సాపత్యం తెచ్చావు? కుక్కకీ గంగిగోవుకూ యెంతవారో, వాడికీ ఆయనకు అంతవార. సౌజన్యారావు పంతులుగారు కర్మణా, మనసా, వాచా, యాంటీనాచి "వేశ్య" అనేమాట, యేవరి ఆయనయదట పలికితే వట్టాయనా, "అసందర్భం" అంటారు. ఆయనలాంటి అచ్ఛాణీలు అరుదు. మిగిలినవారు యథాశక్తి యాంటీనాచులు, ఫోజు ఫోజంతా, మాటల్లో మహావీరులే. అందులో గిరీశం అగ్రగణ్యుడు. కొందరు బంట్లు పగలు యాంటీనాచి, రాత్రి ప్రోనాచి, కొందరు ఉన్నవూళ్ళో యాంటీనాచి, పరాయివూళ్ళో ప్రోనాచి; కొందరు శరీర దారుఢ్యం ఉన్నంతకాలం ప్రోనాచి, శరీరం చెడ్డతరవాత యాంటీనాచి; కొందరు బ్రతికివున్నంతకాలం ప్రోనాచి; చచ్చిపోయిన తరవాత యాంటీనాచి; కొందరు అదృష్టవంతులు చచ్చినతరవాత కూడా ప్రోనాచే అనగా యజ్ఞం చేసి పరలోకంలో భోగాలికి టిక్కెట్టు కొనుక్కుంటారు; నాబోటి అల్పప్రజ్ఞులవాళ్ళు లభ్యం కానప్పుడల్లా యాంటీనాచే.

మధు—మీయోగ్యత చెప్పేదేమిటి! గాని, పెద్దగారిమాటలు చూస్తే, సౌజన్యారావుపంతులుగారు లుబ్ధావధాన్లుగారిని కాపాడడానికి, విశ్వప్రయత్నం చేస్తూ వున్నట్టు కనబడుతుంది. యేమి కారణమో?

కరట—చాపలు యీదడానికి, పిట్టలు యెగరడానికి, యేంకారణమో అదే కారణం.

మధు—పరోపకారం ఆయనకు సహజగుణమనా?

కరట—కాకేమి?

మధు—మీరెందుకు కొంచం ఆయీదడం, యెగరడం నేర్చుకోకూడదు.

కరట—నీమాట అర్థంకాదు.

మధు—యీ కేసులో నిజమేదో సౌజన్యారావు పంతులుగారితో చెప్పి మీరు కూడా కొంచం లోకోపకారం చెయ్యరాదా?

కరట—నా మంచి సలహా చెప్పావు! తనకు మాలిన ధర్మమా? "స్వయం తీర్ణః పరాం స్తారయతి" అన్నాడు. నిజం చెప్తే పంతులు యేమంటాడో నీకు తెలుసునా? "శాస్త్రులు గారూ మీరు నేరం చేశారు. నే నేమి చెయ్యగలను? మిమ్మల్ని గురించి నాకు చాలా విచారంగా వున్నది." అని నగుస్తూ, పోలీసువాళ్ళతో చెప్పి, జెయిలు లోకి పంపిచేస్తాడు. జెయిలునుంచి తిరిగి వచ్చిందాకా మాత్రం నెలకో పాతికో, పరకో కనికరించి నా భార్యకు యిస్తూవుంటాడు. అలాంటి ప్రమాదం లేకుండా కార్యానుకూలం కావడంకోసమే యీ యెత్తు యెత్తాను.

మధుర—సరే. సౌజన్యారావు పంతులుగారు మంచివారు గనక ఆయన సాక్షా వస్తే నాకంటె నాకు యిప్పించేస్తారు గాని, బుద్ధావధాన్లు ఆరూపాయలూ, కంటా, పెట్లో పెట్టుకుని మ్రుంగిలా మాట్లాడకుండా వూరుకుంటేనో?

కరట—దానికి ఖరీదు నేనిచ్చుకుంటాను.

మధు—తమరు ఒకవేళ మఠంలో ప్రవేశిస్తే మరి నాకు కంటె ఖరీదు యిచ్చేవారెవరు? అందుచేత ఆకంటె నాకు తిరిగివచ్చేవరకూ మీ శిష్యుణ్ణి నాదగ్గిర తాకట్టువుంచండి.

కరట—అలాగనే.

శిష్యుడు—మీ సొమ్మేంబోయింది. నా పెళ్ళో?

కరట—నాలికా తాటిపట్టెరా!

శిష్యుడు—మీరోవేళ — జయిల్లోకి వెళ్ళితే—

మధు—గురువుకు తగిన శిష్యుడివేదువు!

కరట—అంత ఉపద్రవం వొస్తే, నీ పెళ్ళిమాటట నా పెళ్ళాంతో యరేంజిమెంటు చేసి మరీ వెళతాను.

శిష్యుడు—యేమో! ఘోరమైన ప్రమాణం చేశారుగదా?

కరట—మధురవాణీ కొంచం శ్రమచేసి కంటె తేవా?

మధు—యేవొచ్చింది తొందర?

కరట—హెడ్డుగాని, రామప్పంతులుగాని, వొచ్చాశంటే నాకొంప మునుగుతుంది.

మధు—మునిగితే తేలుస్తాను.

కరట—అంత చాకచక్యం నీకు లేదని కాదు.

[మధురవాణి లోనికి వెళ్ళును]

కరట—అది చెప్పిందల్లా చెయ్యి, కొంచంపై ఒచ్చేది కాని, మరీ నడుస్తూ వుండు. యేమైనా ఉంటే, నా చెవిని పడేస్తూండు.

శిష్యుడు—యివరిదగ్గిర వున్నప్పుడు వారు చెప్పిందల్లా చెయ్యడమేం, నా నిర్ణయం. మీరు యేం పైకాని, నా చేత ఆడవేషం వేయించి పెళ్ళిచేశారో?

కరట—ప్రమాదోధీమతామపి, యెంతటివాడికైనా ఒకప్పుడు కాలు జారుతుందిరా?

[మధురవాణి కంటె పట్టుకు ప్రవేశించి]

మధు—తాకట్టువస్తువ తప్పించుకు పారిపోతేనో? కుక్కా, నక్కా కాదుగదా? గొలుసులు వేసి కట్టడానికి?

కరట—నీవలల్లోపడ్డప్రాణి మరి తప్పించుకు పారిపోవడం యెలాగ? వానికి వున్న పటుత్వం యేవుక్కుగొలుసులకూ ఉండదు.

మధు—వలలో మత్స్యపుచిప్పలు పడితే లాభంగాని, నత్తగుల్లలు పడితే మోతచేటు.

కరట—యంతసేపూ డబ్బూ, డబ్బేనా? స్నేహం వలపూ అనేవి వుంటాయా?

మధు—స్నేహం మీలాటివారిచోట; అందుచేతనే కష్టపడి ఆర్జించినకంటె మీపాలు చేస్తున్నాను. మాతల్లి చూస్తే భవిష్యం వుంచునా? యిక వలపో? బతుకనేది వుంటే, వలపువన్నె తెస్తుంది. అంగడివాడికి మిఠాయిమీద ఆశా, సానిదానికి వలపూ, మనస్సులోనే మణగాలి; కొద్దికాలంవుండే యవ్వనాన్ని జీవనాధారంగా చేసుకున్న మాకులానికి వలపు ఒక్కచోటే.

కరట—యక్కడో?

మధు—బంగారంమీద శృంగారం వన్నె చెడినదగ్గిరనుంచీ, బంగారంగదా తేటుతే వాలి? ఆబంగారం మీకు ధారపోస్తూవున్నప్పుడు నాస్నేహం యెన్ననేల?

కరట—నీస్నేహం చెప్పేదేమిటి! నీయౌవ్వనం, నీశృంగారం దేవతాస్త్రీలకువలె శాశ్వతంగా వుంటాయి.

మధు—మాతల్లి ధర్మవాం అని, ఆమె నాచెవిలో గూడుకట్టుకుని బుద్ధులు చెప్పబట్టిగాని, లేకుంటే మీలాంటి విద్వాంసులయిచ్చకాలకి మైమరచి, యీపాటివూళ్ళో సానులవలె చెడివుండనా?

కరట—మీతల్లి అనగా యెంత బుద్ధివంతురాలు! దాని తరిఫీదుచేతనే నువ్వు విద్యాసౌందర్యాలు రెండూ దోహదం చేసి పెంచుతున్నావు?

మధు—అంతకన్న కాపుమనిషైపుట్టి, మొగుడిపొలంలో వంగమొక్కలకూ, మిరపమొక్కలకూ దోహదంచేస్తే, యావజ్జీవం కాపాడే తనవాళ్ళన్నవాళ్ళు వుందురేమో?

కరట—యేమి చిన్నమాట అన్నావు! మధురవాణి అంటూ ఒక వేశ్యాశిఖామణి యీకళింగ రాజ్యంలో వుండకపోతే, భగవంతుడి సృష్టికి యంతలోపం, వచ్చి వుండును?

మధు—సృష్టికి లోపం వచ్చినా రాకపోయినా, యిప్పటిచిక్కులలో మీకు మట్టుకు కించిత్ లోపం వచ్చివుంటును.

కరట—మమ్మల్ని తేల్చడానికి నీఆలోచన యేదో కొంచెం చెప్పావుకావుగదా?

మధు—నన్ను సౌజన్యారావు పంతులుగారి దగ్గిరకు తీసుకువెళ్ళడానికి వొప్పారు కాదుగదా?

కరట—ఆయన నిన్నూ, నన్నూ యింట్లోంచి కఱ్ఱపుచ్చుకు తరుముతారు.

మధు—కోప్పిష్టా?

కరట—ఆయనకి కోపవఁన్నమాటేలేదు.

మధు—అయితే భయమేల?

కరట—చెడ్డవారివల్ల చెప్పుదెబ్బలు తినవచ్చును గాని, మంచివారివల్ల మాటకాయడం కష్టం.

మధు—కొత్తసంగతి వకటి యీనాటికి నాకు తెలిసినది. సృష్టికల్లా వన్నె తెచ్చిన మధురవాణి అనే వేశ్యాశిఖామణి గిరీశంగారివంటి కుక్కలపొత్తుకే తగివున్నది. గాని, సౌజన్యారావుపంతులుగారివంటి సత్పురుషులను చూడడమునకైనా అర్హత కలిగివుండలేదు. గిరీశంగారు దానియింట అడుగుబెట్టగానే మీచెల్లెలుగారియింట అడుగుపెట్టడానికి ఆయనకు యోగ్యత తప్పిందని నానిర్ణయం. తమలాంటి పండితోత్తములు మాత్రం కార్యావసరం కలిగినప్పుడు వూరూవాడా వెతికి, మధురవాణిదగ్గిర లాంచారీపడవచ్చును. అయితే డిప్టీకలక్టరు కుక్కేనా?

కరట—లంచం తినడుగాని, ఆయనకు స్త్రీవ్యసనం కద్దు. పెద్ద ఉద్యోగస్థుడు గనక, సీమకుక్క అని అందాం. ఆయన్ని గాని వలలో వేశేవా యేమిటి?

మధు—వేస్తే?

కరట—బతికానన్నమాట! ఆయనసాయం ఉంటే, కేసు మంచులా విడిపోతుంది. తెలిసింది. యిదా నువు చేసిన ఆలోచన? యెంత గొప్పదానివి!

మధు—ఆయన నాయుడుచేత రాయబారాలు పంపుతున్నారు.

కరట—వెళ్ళు, వెళ్ళు, వెళ్ళు, వెళ్ళు, యింకా ఆలోచిస్తావేమిటి? నీఅదృష్టం నా అదృష్టం యేవఁని చెప్పను!

మధు—వెళ్ళతలుచుకోలేదు.

కరట—చంపివేశావే! ఆయన ఒక్కడే మమ్మల్ని కాపాడకలిగినవాడు.

మధు—యిటువైని ఊరకుక్కలనూ, సీమకుక్కలనూ దూరంగా వుంచడానికి ఆలోచిస్తున్నాను.

కరట—ఆయనని హాస్యానికి సీమకుక్క అని అన్నానుగాని, ఎంత రసికుడనుకు

మధు—పట్ణం వొదిలి పల్లెటూరుకాగానే, మీదృష్టిలో, పలుచనైతినో? హెడ్డును నౌఖరులా తిప్పుకున్నానుగాని అధికం లేదే. ఆనాలుగురోజులూ సర్కారుకొలువు మాని అతడు నాకొలువుచేశాడు. అతడిసాయం లేకపోతే, మీరు ఆఊరిపొలిమేర! దాటుదురా? యీదాసరి దాటునా? లోకంఅంతా యేమి స్వప్రయోజనపరులూ

కరట—అపరాధం, అపరాధం! కలక్టరుని చూడనంటే మనస్సు చివుక్కుమని అలా అన్నాను. నువ్వు ఆగ్రామం గ్రామం సమూలం రాణీలాగ యేలడం నేను యీ కళ్ళతో చూడలేదా?

మధు—నేను కలక్టరుని చూడనంటే, మీమనస్సు చివుక్కుమనడం యెట్టిది? యేమి చిత్రం! సౌజన్యారావుపంతులుగారు యీమాట వింటే సంతోషిస్తారు కాబోలు?

కరట—పీక వుత్తరిస్తారు.

మధు—ఆదేదో చూస్తాను.

కరట—బ్రహ్మహత్య కట్టుకుంటావా యేమిటి?

మధు—ఆహా! యేమి బ్రాహ్మలూ!—అయినా పోలిశెట్టి చెప్పినట్టు, యెంత చెడ్డా బ్రాహ్మలుగదా? యిందండి; (కంటె యిచ్చును.) తిలోదకాలేనా?

కరట—యెంతమాట! పువ్వులలో పెట్టి మళ్ళీ రాదా? నీయెదట అనవలసినమాట కాదు. నీలాంటి మనిషి మరలేదు. కించిత్ తిక్క లేకుంటేనా!

మధు—ఆతిక్కేగదా యిప్పుడు మీకు ఉపచరిస్తూంది?

కరట—యేం ఉపచరించడం? చంపేశావు! ఆడిప్టీకలక్టర్ని ఒక్కమాటుచూసి యీ బీదప్రాణిని కాపాడితే.—

మధు—చాలించండి. యిక విజయం చెయ్యండి. (వెళ్ళిపొమ్మని చేతితో సాజ్ఞ చేయును. కరటకశాస్త్రుల్లు, శిష్యుడు నిష్క్రమించుచుండగా) శాస్త్రుల్లుగారూ!

[కరటకశాస్త్రుల్లు తిరిగి ప్రవేశించును]

మధు—మీపిల్లని మహేశానికి యిస్తారా?

కరట—యిస్తాను.

మధు—అయితే నాకో ఖరారు చేస్తారా?

కరట—చేస్తాను.

మధు—యిక ఆతణ్ణి నాటకాలాడించీ, ముండలిళ్ళకి తిప్పీ చెడగొట్టకండి.

కరట—యిటుపైని చెడగొట్టను-నాకు మాత్రం అక్కర్లేదా?? (పొడుం పీల్చి) నీది గురూపదేశం మధురవాణీ।

మధు — బ్రాహ్మలలో ఉపదేశంలావున్నూ, ఆచరణ తప్పినా, ఖరారేనా?

కరట — ఖరారే.

మధు — బ్రాహ్మలు కాగానే, దేవుఁడికంట్లో ఒంగిపొయ్యాలేరు అనుకుంటాను.

కరట — చీవాట్లకి దిగావేవిఁటి?

మధు — చిత్రగుప్తుడికి లంచం యివ్వగలరా? అతడిదగ్గిరికి మధురవాణిని పంపి, చేసిన పాపాలు అన్నీ తుడుపుపెట్టించడానికివీలువుండదు గాబోలు?

కరట — మధురవాణీ! పనివకటుంది. మరిచిపోయినాను_వెళ్ళి రేపు మళ్ళీ వస్తాను.

మధు — (నవ్వుచేత కుర్చీమీద విరగబడి, తరవాత నవ్వు సమాళించుకొని) ఒక్క నిమిషం ఆగండి. శిష్యుడా! (శిష్యుడు ప్రవేశించును) యేదీ వాడు నువ్వు రామచంద్రపురం అగ్రహారంలో, రామప్పంతులు యింటిబైజానూ, నేనూ, మీనాక్షమ్మా తలుపు యివతలా అవతలా ఖణాయించిరడగా తెల్లవారఝావునన నిశ్శబ్దంగా ఆకాశవాణిలా పాడిన చిలకపాటపాడి సీనావఁగారికి బుద్ధిచెప్పు. శవమూలంగా ఒక ముసలిబ్రాహ్మడికి ముప్పువస్తూవుంటే తమశరీరం దాచుకుంటున్నారు.

శిష్యుడు — (పాడును) యెట్టినిముక్కుగలది రామచిలుక। దాని

మధు — (బెత్తముతో కొట్టబోయినట్టు నటించి) చెప్పినపని, చెయ్యకపోతే జయిలు సిద్ధం.

(శిష్యుడు — "యెన్నాళ్ళు బ్రతికినా" అనుపాట పాడును. రెండు చరణములు పాడినతరువాత.)

కరట — అతిజరూరు పనివుంది మధురవాణీ మరోమాటువస్తాను. (నిష్క్రమించుతూ) తలవాయగొట్టింది. తలవెంట్రుకలు లావయినాయి - మనసు కొంచం మళ్ళించుకుందాం.

## ౭-వ స్థలము: సౌజన్యారావుగారియింట్లో కచేరీగది.

[సౌజన్యారావు పంతులుగారు, అగ్నిహోత్రావధాన్లు ప్రవేశింతురు]

సౌజ — ఇక మిమ్మలను జయించినవాడు లేడు. పిల్లల్ని అమ్మకోవడం శిష్టాచారం అంటారండీ?

అగ్ని — ఆహా మా మేనత్తల్ని అందరినీ కూడా అమ్మారండి. వాళ్ళంతా పునిస్త్రీ చావే చచ్చారు. మా తండ్రి మేనత్తల్నికూడా అమ్మడవేఁ జరిగిందను. యిప్పుడు

యీ వెధవ యింగిలీషు చదువునుంచి ఆవకీయవెధవ దాన్ని లేవదీసుకు పోయినాడు గాని, వైధవ్యం అనుభవించిన వాళ్ళంతా పూర్వకాలంలో యెంత ప్రతిష్ఠగా బతికారు?

సౌజ — పసిపిల్లల్ని కాలంగడిచినవాళ్ళకి పెళ్ళిచేస్తే వైధవ్యం రాక తప్పుతుందా? నిలపాదిచేసి కొంచం యోచించండి.

అగ్ని — ప్రారబ్ధం చాలకపోతే ప్రతివాళ్ళకీ వస్తుందండి. చిన్నవాళ్ళకిచ్చినా పెద్దవాళ్ళకిచ్చినా, రాసినరాత యెవడైనా తప్పించగలడా?

సౌజ — మీరు చదువుకున్నవారుగదా, ప్రారబ్ధమని పురుషప్రయత్నం యేవ్యవహారంలో మానేశారు? కేసు, “విధికృతం; యలావుంటే అలా అవుతుం” దని వకీల్ని పెట్టటం మానేశారా? కన్యలని అమ్ముకోవడం శాస్త్రదూష్యం కాదా? డబ్బుకి లోభించి పిల్లల్ని ముసలవాళ్ళకి కట్టబెట్టి విధికృతం అవడం న్యాయమేనా? శెలవియ్యండి.

అగ్ని — యిప్పుడు మీలౌక్యుల్లో చెయ్యేసీ, రెండేసివేలు, వరకట్నాలు పుచ్చుకుంటున్నారు కాదండీ? గిరీశంగారు చెప్పినట్లు — వాడి పిండం పిల్లులికి పెట్టా! — మీలో ఆడపిల్లలికి యిన్నితులాలు బంగారం పెట్టాలి యిన్నితులాలు వెండిపెట్టాలి అని నిర్ణయించుకోవడంలేదా? అదిమాత్రం కాదేం కన్యాశుల్కం?

సౌజ — అలా చెయ్యడం నేను మంచిదన్నానాయేమిటండి? “గిరీశంగారు చెప్పినట్టు” అని అన్నారేమిటి?

అగ్ని — ఆ వెధవపేరు నాయెదట చెప్పకండి.

సౌజ — కానీండి గాని_మీ రెండోపిల్లకి తగినవరుణ్ణి చూచి పెళ్ళిచెయ్యండి. యేం సుఖపడుతుందని ముసలివాళ్ళకి యివ్వడం? శెలవియ్యండి.

అగ్ని — అదంతా మీకెందుకయ్యా? ఓహో యిందుకా నన్ను పిలిపించారు? మీ గృహకృత్యాలవూసుకి నేవొచ్చానా యేమిటి? నాగృహకృత్యాలవూసు మీకెందుకూ?

సౌజ — తొందరపడకండి అవుధానులుగారూ, దూరం ఆలోచించండి. మీకడుపున బుట్టినపిల్లయొక్క సౌఖ్యం ఆలోచించి సలహాచెప్పానుగాని నాస్వలాభం ఆలోచించి చెప్పలేదుగదా పెద్దపిల్లకి సంభవించినఅవస్థ మీకళ్ళతో చూడనేచూశారు యికనైనా వృద్ధులకు పిల్లని కట్టబెట్టడపు ప్రయత్నం చాలించండి.

అగ్ని — నాపిల్ల భారం అంతా మీదైనట్లు మాట్లాడుతున్నారేమిటి? ఆసంత మీకెందుకూ?

సౌజ — నన్ను తమ స్నేహవర్గంలో చేర్చుకోండి_పరాయివాణ్ణిగా భావించకండి_దయచేసి నాలహా వినండి_మర్యాదగలయింట పుట్టిన బుద్ధివంతుడగు కుఱ్ఱవాణ్ణి

చూసి మీ చిన్నపిల్లని పెళ్ళిచెయ్యండి. యిక పెద్దపిల్లమాట. ఆమెకు వితంతువుల మఠంలో - సంఘసంస్కారసభవారు విద్యాబుద్ధులు చెప్పించుతారు. మీ కడుపున పుట్టినందుకు యెక్కడనయినా ఆమె సుఖంగా ఉండడం గదా తండ్రైనవారు కోరవలసినది. ఆమె తాలూకు కొంత ఆస్తి తమవద్ద ఉన్నది. మా స్నేహితులున్నూ స్త్రీపునర్వివాహసభాకార్యాధ్యక్షులున్నూ అయిన రామప్పంతులుగారు నా పేర వ్రాసినారు. ఆ ఆస్తి చిక్కులుపెట్టక, తాము ఆపిల్లకి పంపించి వెయ్యడం మంచిది.

అగ్ని — యేమిటీ ముండా యేడుపుసంత; వాడెవరు? వీడెవరు? మీరెవరు? అద పఃర్తి? నా పిల్లేవిఁటి? పకీరుముండ! రేపు యింటికి వెళుతూనే ఘటశ్రాద్ధం పెట్టేస్తాను.

సౌజ — యిప్పటి ఆగ్రహంమీద మీరు అలా శెలవిచ్చినా, నిడివిమీద మీకే కనికరం పుడుతుంది. ఇప్పట్లోనే కనికరిస్తే కొంత మీకు నేను ఉపకారం చెయ్యగలను.

అగ్ని — కనికరం గాకేం; కడుపులో యేడుస్తున్నానుకానూ? ఆస్తీ గీస్తీ యిమ్మంటే మాత్రం యిచ్చేవాణ్ణికాను. ఆ వెధవని పెళ్ళిచేసుకోకుండా యిల్లు జేరితే, యింట్లో బెట్టుకుంటాను. అంతే.

సౌజ — అది మరి జరగదు.

అగ్ని — యిది అంతకన్నా జరగదు.

సౌజ — ఆమె ఆస్తి మీరు యిచ్చివెయ్యకపోతే దావాపడుతుంది నిష్కారణంఖర్చులు తగులుతవి.

అగ్ని — నేను అగ్రహారపుచెయ్యిని-దావాగీవా అని బెదిరించితే భయపడేవాణ్ణికాను.

సౌజ — నామాటవిని ఆస్తి యిచ్చివేసి గిరీశంగారిమీద గ్రంథం చెయ్యడపుప్రయత్నము మానుకుంటే, లుబ్ధావధాన్లుగారు మీమీద తెచ్చినకేసు తీయించివేస్తాను. మీపిల్ల దయాదాక్షిణ్యాలు లేకపోతే, స్వలాభమైనా ఆలోచించుకోండి.

అగ్ని — వెధవముండని లేవదీసుకపోయిన పకీరు వెధవపక్షం మాట్లాడుతావు. యేవిఁ పెద్దమనిషివయ్యా? నేనా కేసు వొదులుకుంచాను? ఆ వెధవగానీ కంటికి కనబడితే ఖూనీ చేస్తాను. పెద్దప్లీడరు ప్రత్యుత్థానంచేసి పిలిచాడంటే కేసుల్లో యేవిఁ సలహా చెబుతాడో అని భ్రమపడ్డాను. వెధవముండలికి పెళ్ళిచేయడపు పోయీకాలం పట్టుకుందేవిఁ, పెద్దవాళ్ళకి కూడాను?

సౌజ—లుబ్ధావధాన్లుగారితరఫున మీమీద గ్రంథం నేనడిపించవలసి ఉంటుంది. మీకు వృథాగా డబ్బు తట్టుబడీ, శిక్షా, త్రూణతా కూడా సంభవిస్తాయిగదా అని ఇంత దూరం చెప్పాను. మంచికి మీరు మనుష్యులైనట్టు కనపడరు గనక నాసాయశక్తులా పనిచేసి మీకు గట్టి శిక్ష అయేటట్టు గ్రంథం నడిపిస్తాను. పిల్ల దాని ఆస్తివిషయమయి దావా కూడా నేనే పడేస్తాను.

అగ్ని—నీయింట కోడి కాల్చా!

సౌజ—మీరు యేమన్నా, నాకు కోపం లేదు. యింటికి వెళ్ళి ఆలోచించుకొని, నా సహాయం కావలసివుంటే తిరిగి రండి.

అగ్నిహోత్రావధాన్లు (నిష్క్రమించుతూ తనలో) వీడికి వెఱ్ఱిగాబోలు!

(తెర దించవలెను)

---

# ఓల్డ్ డాటర్

## రచయిత: కోపల్లి వేంకటరమణారావుగారు

బాలవితంతూద్వాహ విప్లవాన్ని లేవదీసి తెలుగుదేశానికంటూ వీరేశలింగంగారాంధ్రావనికి నగరాదిత్య మనదగిన రాణ్మహేంద్రవరంలో ప్రథమ వితంతూద్వాహం జరిపించి వారి మానప్రాణధనాలను ధారవోసి ధన్యులైనారు. అప్పటికీ గోపాలరావు వంటి మహాత్ములుండి కన్నకూతుళ్ళను కట్టెళ్ళు పెడుతూనే ఉన్నారు. ఓల్డ్‌డాటరయిన తన కూతురు సుందరమెంత ప్రాధేయపడినా సంఘపిశాచానికి భయపడి గోపాలరావు ద్వితీయం చెయ్యకపోతే గానవిద్యాభ్యాసనెపంబున ఓసంగీతంమాష్టర్ని తెప్పించుకొని గానకళకు మాఱుగా కామకళాభ్యాసం మొదలెట్టింది. ఈనాటకంలో ధనికుల యిండ్లలో చనవుగా సంచరించే దాసీల దారుణచర్యలు—యాయివారబ్రాహ్మణుని దుర్నడతలు, బాలవితంతువులకు మళ్ళీ పెళ్ళిళ్ళు చెయ్యకపోతే కలుగే అగచాట్లూ కళ్ళకు కట్టినట్లుగా చిత్రింపబడి సంఘదురాచారమనే మబ్బుదొంతరను విడగొట్టే జంఝామారుతం చెలరేగించారు. నీకు ఓల్డ్‌డాటరున్నా డబుల్—ట్రిబుల్—ఫోరుఫోల్డు డాటర్సున్నా, పిల్లలేకపోయినా, ఆడపిల్లలు గలవాడవైనా ఓల్డ్‌డాటరు నీయింట్లో ఉండవలసిందే.

వెల రు 1—0—0

# కన్యాశుల్కము — సప్తమాంకము

## ౧-వ స్థలము: విశాఖపట్నంలో వీధి.

[బైరాగీ, వెనక పదిమంది శూద్రులూ ప్రవేశింతురు]

రామన్న—యెక్కణ్ణుంచి యిజయం సేస్తున్నారు గురూ?

బైరాగి—కాశీనుంచిరా.

రామ—యెన్నాళ్లైంది గురూ?

బైరాగి—ప్రాతఃకాలం గంగ సేవించి బయల్దేరాంరా.

బుచ్చన్న—యోగులికి సిద్ధులుండవు గానీ? యీయన్నేరా, ఉప్పాకలోనూ, సింహాచలంలోనూ మొన్న శివరాత్రికి ఒక్కమారే అగుపడ్డారు.

లత్సుమన్న—తెల్లోడు తీగిటపాయేసినాడుకాదా? నిమేటికి ఉత్తరం దేశదేశాలకి యెల్లదా?

బైరాగి—పామరులు! పామరులు!

రామ—ఊరుకోన్సి—నీకేటెరిక—యెత్తినాకొడక.

బైరాగి—యీవూళ్ళో తీర్థపు రేవున రెండు మైళ్ళలోసబురున ధర్మరాజువారు ప్రతిష్ఠ చేసిన శివాలయం, కంచుదేవాలయం ఒకటిఉన్నది. రాత్రి ఆదేవుణ్ణి సేవించుకుని; రేపు రామేశ్వరం వెళ్ళిపోతాం. సదావృత్తి యక్కడ దొరుకుతుంది?

రామ—యీవూళ్ళో మఠం లేదు గురూ. మేవంతుండగ తమకి లోసవేటి గురూ? కాశీకబుర్లేటి గురూ?

బైరాగి—నాలుగు రోజులకిందట విశ్వేశ్వరుడి కోవెలలో ఒక బంగారపురేకు ఆకాశంనిుంచి పడ్డది. దానిమీద వ్రాసినలిపి బ్రాహ్మలికి బోధ అయిందికాదు. మేం చిత్తగించాం. సిద్ధులభాషని దానిమీద బంగారం చేసే యోగం వకటి కలికాలం బతికే యోగం వకటి వ్రాసిఉన్నాయి.

రామ—యేవాశ్చెర్యం! గురూ భోజనం యేం ఆరగిస్తారు?

బైరాగి—పాలూ, పంచదారా, అరటిఫలములూ, యీప్రకారం ఒకపక్షం ఫలహారం చేస్తాము. మరి పదిహేను రోజులు వాయుభక్షణ చేస్తాము.

రామ—ఒక్కమిట్టకాయలో జలాపం జాగర్త చేస్తాం గురూ. మా రామమందిరానికి దయసెయ్యాలి.

బైరాగి—వస. యీవూరి వింతలేవిఁటి?

లత్కన్న—యేటిలేవ్-రావఁశంద్రపురం అగ్ఘురారంలో ముసలబాపనోడు ఆల్నిచంపేసినాట్ట. ఆడికీ దొంగ సాచ్చీకం పలికి నోళ్ళకీ తాసీలుగోరికీ సిచ్చైపోతాదిట?

బైరాగి—యీవూరు పాపంతో నిండివున్నట్టు కనపడుతూంది. యీవూళ్ళో మేము నిలవము.

రామ—లచ్చువుఁడు వెర్రోడు గురూ. ఆడిమాట నమ్మకండి. మీరెళ్ళిపోతే మాలాటోళ్ళు తరించడం యలాగ్గురూ? ఆళ్ళీ వూరోళ్ళు కారు.

బుచ్చన్న—అవూరిదుకాణదారుగారు అదుగో వొస్తున్నారు.

బైరాగి—యీవూళ్ళో తాగడం లావుగా ఉన్నట్టు కనపడుతుంది. మేము తాగుబోతులతో మాట్లాడం. ఆదుకాణదారు వచ్చేలోగా యీసందులోకి మళ్లిపోదాం రండి. (దుకాణదారు పరుగునవచ్చి కలిసి బైరాగిమెడలో చెయివేసి పట్టుకొనును.)

దుకా—రూపాయలు కక్కి మరీ కదలాలి!

బైరాగి—యేమిటీ చాళకం, వీడు తప్పతాగి పేలుతున్నాడు - నేను మొదటే చెప్పలేదా యీవూరి సంగతి అంతా పాపంతో నిండివుంది! వేమన్న యేమన్నాడు?

"తాగుబోతుతోడ తగదెందు నేస్తంబు"

రామ—(దుకాణదారునితో) భాయీ! మీకేటి, మతోయిందా? గురువుగారికి దణ్ణవెట్టి లెంపలోయించుకోండి.

దుకా—గురువూలేదు గుట్రూలేదు. వూరుకొస్సి యీడెక్కడ గురువు? నాదుకాణంలో సారాఅంతా చెడతాగి డబ్బియ్యకుండా యెగేసినాడు.

రామ—నీకు మతోయిందా భాయి? ఆరేటి మీదుకాణంలో తాగడవేఁటి. కాశీనించి యిప్పుడే ఒచ్చినారుగదా?

దుకా—ఆకాశం బొక్క చేసుకుని వొచ్చాడుకాదూ? (బైరాగితో) డబ్బిచ్చి మరీ కదులు.

బైరాగి—మావంటి సాధులతో నీకు వాదెందుకు అబ్బీ? యెవర్ని చూసి మేవఁనుకున్నావో! మమ్మల్ని పోలిన దాసరివాడొకడు, బైరాగివేషం వేసుకుని యీదేశంలో తిరుగుతున్నాడు. కిందటిమాటు మేం దేశసంచారం చేసినప్పుడు చూసి చీవాట్లు పెట్టాం. నీకు డబ్బుమీద అంత దాపేనం ఉంటే తులం రాగి తెమ్మకో బంగారం చేసియిస్తాం. సంగోరు ధర్మఖర్చుచేసి సంగోరు తిను లేకుంటే తల పగిలి పోతుంది.

రామ—యేం యెత్తేయుండాపని చేసినావు భాయీ; బంగారం చేసేసిద్ధులికి డబ్బు లచ్చంటోయి! అరికాళ్ళమీదపడి అలక తీరుసుకోండి.

దుకా—వుండోస్సి - యేడిసినట్టేవుంది. నీసొమ్మేంపోయింది?

[హెడ్కనిస్టేబు ప్రవేశించును]

హెడ్—యేమండోయి గురోజీ! మీరు దొరకడం నాను దేవుఁడు దొరికినట్టుంది. ఇక బతికాను. మీతో కొన్ని జరూరుసంగతులు మాట్లాడాలి, రండి.

బైరాగి—భాయీ! మీరు వెనక్కుండండి. (దుకాణదారు తప్ప తక్కినవారు దూర ముగా వెళ్ళుదురు)

దుకా—నాడబ్బిచ్చి మరీ మాట్లాడండి.

బైరాగి—నలుగురిలోనూ మర్యాదతియ్యడంధర్మవేఁనాతమ్మడా? యోగరహస్యాలు పామరులదగ్గిరా వెల్లడిచెయ్యడం?

దుకా—డబ్బు యెగ్గొయ్యడమే యోగం నాదగ్గిర పారదు. రహస్యవేఁటి? ఆవిద్యకి అంతా గురువులే.

బైరాగి—వెఱ్ఱినరుడా! బైరాగివాళ్ళకీ మాకు డబ్బుమీద తనువుఁటుందటోయి? ఒక ళ్ళకి యిచ్చేదీ కానం-పుచ్చుకున్నదీ కానం.

హెడ్—భాయీ! నీరూపాయలు నేనిస్తాను. తెలివిమాలిన మాటలాడకు. గురువు గారికి కళ్ళు మెయ్యా, ఆగ్రవొఁస్తే మనం మండిపోతాం. మీరటుండా, వెళ్ళండి (బైరాగితో) గురోజీ! ఖూనీకేసు పీకలమీదికొచ్చింది. కేసూ యేబుగ్గీ లేనిదే ఆరాత్రి నాలుగుకాళ్ళు తడువుఁకుందావఁని మనం ఆముసలాణ్ణి అల్లరి పెట్టావాఁ? ఆతరవాత, తాసిల్దారొచ్చి "హాత్ హూత్" అని బెదిరించి వదిరాళ్ళు లాగేడు. తనతాలూకుకంటె పెగిలిందికాదని రావఁప్పఁతులుగాడు ఇనస్పెక్టరికీ పోలీసు సూపరెంటుకీ అర్జీలుకొట్టాడు. నిజంగా ఖూనీకేసు జరిగిఉండగా, మేవుఁ కామాపు చేశావఁని తాసిల్దారుమీదా, నామీదా యిప్పుడు పితూరీచేస్తున్నారు.

బైరాగి—మేవుఁండగా మీకేం భయం భాయీ?

హెడ్—అందుకేగదా నా పాలిటిదేవుఁళ్ళా మీరు దొరికారన్నాను.

బైరాగి—మీశత్రువులను వాగ్బంధంచేస్తాను. వాళ్ళ పేర్లు వ్రాసియివ్వండి. యినస్పెక్టరుకి మీమీద యిష్టవఁని చెప్పేవారే?

హెడ్—మీ పెద్దఉద్యోగస్థులకి దయలూ, దాక్షిణ్యాలూ యేవిఁటీ గురూ? వాళ్ళకి యెంత మేపినా, వాళ్ళకి కొరట్టు వొస్తుందని గాని, ప్రమోషను వొస్తుందని గాని

ఆశపుట్టినప్పుడు, తెగనికత్తితో పీకలు తెగగోస్తారు. సాయినస్పెక్టరికి నూవరెంటుపని కావాలని ఆశవుంది. తాసిల్దారికీ వాడికీ బలవద్విరోధం వుంది. ఆవిరోధం మధ్య నన్ను కొట్టేస్తూంది.

బైరాగి—చూస్తూవుండండి. రేపటినుంచి పక్షం తిరిగిపోతుంది.

హెడ్—మీదయా గురూ - సౌజన్యారావు పంతులుగారని ఓగొప్ప వకీలుగారున్నారు. ఆయన నాకు చాలాసాయం చేస్తున్నారు. కేసు తేలిపోయే సాధనం ఆయన వొకటి చెప్పారుగాని, అది పుదరక తల్లడిల్లుతున్నాం.

బైరాగి—యేమిటండీ, ఆసాధనం?

హెడ్—పరారీ అయిపోయిన ఆపిల్లవానితండ్రి గుంటూరుశాస్తుల్లనిఒకడువున్నాడు. ఆతగాడు దొరికితే, కేసుపోతుంది. వాడు యెక్కడా కనపడ్డు.

బైరాగి—యిదెంతపని. రాత్రి అంజనంవేసి ఒక్కక్షణంలో కనుక్కుంటాను.

హెడ్—అలా రక్షించుగురూ. ఆశుష్టాడు—అనగా ఆచిన్నది—యిప్పుడుయెక్కడుందో కనుక్కోగలరూ, గురూ?

బైరాగి—అదీ అంజనంలోనే కనపడుతుంది.

హెడ్—అదీ మొగాడయినా ఆడదయినా కూడా కనపడుతుందా గురూ?

బైరాగి—ఆడది మొగాడెలా అవుతుంది భాయీ?

హెడ్—(తనలో) చెబితే యేం ప్రమాదవొ! (పైకి) యీ చిక్కుల్నించి మతిపోతూంది గురూ. దయచేండి యింటికెళదాం.

బైరాగి—యీశిష్యులకి కొంచం జ్ఞానూపదేశం చేసి మరీ వస్తాను. మీరు ముందు నడవండీ.

హెడ్డు—యీకార్యం అయిందాకా మీపాదాలు వొదలను. - కార్యమైతే తమరు హరిద్వారంలో కట్టిస్తూన్నమఠానికి నూటపదహార్లు దాఖలుచేస్తాను.

(అందరూ నిష్క్రమింతురు.)

## ౨-వ స్థలము : డిప్యూటీ కలెక్టరు కచేరీ.

[డిప్టీకలక్టరు, వకీళ్ళు, బంట్రోతులు, మొదలైనవారు ప్రవేశింతురు]

భీమారావు—నాను మునసబుకోర్టులో కేసున్నది. వొక అర్జీ దాఖలుచేసి శలవుపుచ్చుకుంటాను.

కలెక్టర్—కోర్టువారికి అవకాశం అయేవరకూ వుండలేని వకీళ్ళు కేసు యెందుకు దాఖలుచేయవలె? ఇది చెప్పినట్లల్లా వచ్చేకోర్టనా మీఅభిప్రాయం.

భీమా—చిత్తం, చిత్తం, తమ ప్రిడిశెసర్లు అలాగు సాగిస్తూవచ్చేవారు.

కలె—ఆఫీస్‌పని చూచుకుని పిల్చేవరకూ ఉండండి.

అగ్నిహో—(రామప్పంతులుతో) యేమండోయ్ మన కొత్త సకేల్ని కోప్పడుతున్నారే?

రామప్ప—(అగ్నిహోత్రావధానులుతో) యీ అధికార్ల నైజం యేమిటంటే యెవళ్ళ మీద దయవుండి యెవళ్ళ పక్షం కేస్ చేయ్యాలంటే వాళ్ళని కరవ్వొచ్చినట్టు కనపడతారు. మీరు కోరట్లసంగతంతా తెలుసునంటారే? యిదేనా మీ అనుభవం?

అగ్నిహో—(గట్టిగా) అవునవు నాకు తెలుసును.

కలె—యెవరా మాట్లాడుతున్న మనిషి?

నాయడు—(లేచి) తక్‌షీర్ మాఫ్ చేస్తే మనవి చేస్తాను. యీయన కృష్ణారాయపురం అగ్రహారం కాపురస్తుడు, నులక అగ్నిహోత్రావధానులుగారు; మహా (అ)యోగ్యమైన బ్రాహ్మణుడు, జటాంతస్వాధ్యాయి? యీయనే లుబ్ధావధానులుగారికి తన కొమార్తెను పద్దెనిమిదివందల రూపాయలకు, కన్యాదానం చేయడానికి బేరమాడుకుని, కాబోయే అల్లుడికి దేహశుద్ధి చేశారు; అందుకే యీమధ్య లుబ్ధావధానులుగారు యేలినవారికోర్టులో ఛార్జి దాఖలు చేశాడు. అందులో ముద్దాయీ యీ మహానుభావుడే! మల్లవరంలో సహస్రమాసజీవైన వక బ్రాహ్మణశ్రేష్ఠుడుంటే ఆయనకు తన పెద్ద కుమార్తెను కన్యాదానంచేసి, రెండు పిల్లికూనలు స్వీకరించేటప్పటికి పెళ్ళిలోనే ఆ బ్రాహ్మడి పుణ్యాం అంతా మూడి పరంపదం వేంచేశాడు. ఆపిల్లదానితరఫున భూములకొరకు దావా తెచ్చాడు. వీరు తమవంటి గవర్నమెంటు ఆఫీసర్లకి తరుచుగా పని గలుగచేసి ప్లీడర్లని పోషిస్తూ వుంటారు. వీరి యోగ్యతలేమి, వీరి యంతఃకరణలేమి, వీరి సరసతలేమి, మరి యెన్నడమునకు శేషుడికైనా అలవికాదు. వారితరఫున కేసు దాఖలు చెయ్యడంకోసమే భీమారావు పంతులుగారు కోర్టుకు దయచేశారు. (విరసముగా నవ్వి కూరుచొనును.)

కలె—బలేశాబాస్ (గుమాస్తాతో) ఏది భీమారావు పంతులుగార్ని ప్రియాదు అర్జీ దాఖలు చేయమను. (గుమాస్తా పుచ్చుకొని దాఖలుచేయును.)

కలె—(కాగితమందుకొని) యేమిటయ్యా కేసుస్వభావం?

భీమా—చిత్తం, యీయన వెధవకొమార్తెని, యీయన కొమారుడికి చదువుచెప్పే గిరీశం అనే ఆయన అలంకారాలూ, ఆ స్త్రీతో కూడ లేవతీసుకు వెళ్ళిపోయినాడు.

అగ్ని—దస్తావేజులూ, కోర్టుకాయితాలూ కూడానండి.

కలె—యేమిటి! ఆ, హా, హా, హా, హా, (నవ్వుచు బూట్సు నేలపై తట్టును) బలేశాబాస్ (అర్జీ చూచుకొని) యిన్నాళ్ళేమి చేస్తున్నారు?

భీమా — తహస్సీల్దార్ గారిదగ్గిర నేరం జరిగిన మూడో రోజునే మునసబుకోర్టు వకీలు వెంకట్రావుపంతులుగారు, ఛార్జి దాఖలుచేస్తే ఆ తహస్సీల్‌దార్ గారు కేసు స్వభావం యేమిటని అడిగినారు. ఎబ్‌డక్‌షన్ అని వెంకట్రావు పంతులుగారు చెప్పేసరికి యింగ్లీషు రాకపోవడంచాత, తహస్సీలుదారుగారు ఆమాటయెప్పుడూ విన్లేదని చెప్పారు. తర్వాత కేస్ స్వభావం తెలుగున చెప్తే యీలాంటి నేరం మా జూరిస్‌డిక్‌షన్‌లో జరగదు, తోవలో రోడ్డుమీద యేతాలూకా సరిహద్దులో యెత్తుకుపోయినాడో అని అర్జీ దాఖలు చేసుకున్నారుకారు. లుబ్ధావధాన్లుగారి కూనీకేసు కామాప్ చేసిన తహస్సీల్‌దారుగారే యీయనండి.

నాయుడు — ఇంగ్లీషు రాకపోతేనేమండి? తహస్సీల్దారుగారు యెంతప్రాజ్ఞులు. పూర్వపు యూరోపియన్ అధికార్లని యెంతమందిని మెప్పించారు! ఆయన లుబ్ధావధాన్లుగారి కేసు కామాప్ చేశారని భీమారావు పంతులుగారు అంటున్నారు. యింకా యింక్వైరీ అవుతూఉన్న కేసులో అలా అన్నందుకు యీయనపైని తహస్సీల్దారుగారు పరువునష్టం ఛార్జి తేవడమునకు వీలుఉన్నది.

కలె — (భీమారావువైపు జూచి) పిల్లకు పదహారు సంవత్సరములకు లోపు యీడని రుజువున్నదా?

భీమా — జాతకం ఉందండి.

నాయుడు — కోర్టువారికి ఆజాతకం దాఖలుచేసుకోవాలి.

భీమా — యీ కేసులో ఆయన మాట్లాడుతూ ఉంటే నే ఎంతమాత్రం వొప్పేదిలేదు.

నాయుడు — యీ కేసులో నాకున్నూడా వకాల్తినామా ఉందండి (అని దాఖలు చేయును.)

భీమా — (అగ్నిహోత్రావధాన్లుగారితో) ఏమయ్యా యీయనకున్నూడా వకాల్తీ యిచ్చావయ్యా.

అగ్నిహో — మొదటా, రామప్పంతులు యీయన కిప్పించారు.

భీమా — (అగ్నిహోత్రావధాన్లుగారితో) అయితే యేడువు.

[అగ్నిహోత్రావధాన్లు తెల్లపోయి చూచును.]

కలె — యేదీ జాతకం దాఖలు చెయ్యండీ.

[భీమారావుపంతులు దాఖలుచేయును.]

నాయుడు — కోర్టువారితో వకసంగతి మనవిజేసుకుంటాను. యీజాతకం విశ్వామిత్రుడంత యోగ్యుడైన బ్రాహ్మడిచేత తయారుచేయబడ్డది. అదుగో ఆమూల నిలబడ్డ రామప్పంతులుగారికి యీజాతకంలో మంచిప్రవేశం ఉందండి.

భీమా—నేను పేపర్ వకీల్ని కేసు హియరింగు నేనే చేయవలెగాని, నాయుడుగారు చేస్తే నేనెంతమాత్రం వొప్పేదిలేదు.

నాయ—స్మార్లెట్ దొరగారిదగ్గిర్నుంచీ యేజన్సీకోర్టులో వకాల్తీ చేస్తున్నాను, డబ్బుచ్చుకున్నందుకు నాపార్టీతరఫున నాలుగు మాటలు చెప్పితీరుతానుగాని యింగిలీష్ చదువుకున్న కొందరువకీళ్ళలాగ నోటంటా మాట్రాకుండా కొయ్యలాగ నిలబడనండి.

కలె—(అగ్నిహోత్రావధానులవైపుజూచి) మీ కొమా ర్తె, యే సంవత్సరమందు పుట్టిందయ్యా?

అగ్ని—అంగిరస.

కలె—జాతకంలో భావవుందే? బ్రాహ్మణ్యం పరువంతా తీసేస్తిరే గడ్డితిని పిల్లనమ్ముకున్నావు సరే కాని, యీలాటి ఫోర్జరీలు కూడా చేయిస్తావూ? బ్రాహ్మల్లో ఉన్నంత, ఖంగాళీ, మాలకూడూ మరెక్కడా లేదు. నీదుర్మార్గతవల్ల నీకుమార్తెను యీ అవస్థలోకి తెచ్చి మళ్ళీ ఎబ్డక్షన్ కేసు కూడానా? నీపొట్ట కరిగించేస్తానుండు. (గుమాస్తాతో) కేసులో నోటీసులు చెయ్యి.

గుమా—(ఛార్జీ కాగితము జూచి) యిందులో ముద్దాయీ యింటిపేరూ సాకీనూ లేదండి.

నాయ—(లేచి) యీ అర్జి వల్లకాట్లో రామనాధాయ వ్యవహారం లాగుంది. ఇంగ్లీషు వకీళ్ళు దాఖలుచేసే కాకితాలు యీరీతినే ఉంటాయండి.

భీమా—(గుమాస్తాతో రహస్యముగా) తరవాయీలు నింపించలేదటయ్యా? (పైకి) యిలా నాయుడుగారు నన్ను తూలనాడుతూంటే కోర్టువారు ఊరుకోడం న్యాయంకాదు.

కలె—నాయుడుగారు మిమ్మల్నేమీ అన్లేదే?

భీమా—(తనలో) యిక్కడికి నేను రావడం బుద్ధిపొరపాటు.

క్లార్కు—(భీమారావు పంతులుగారితో) ఇంటిపేరూ, సాకీనూ యేమిటండీ?

భీమా—(అగ్నిహోత్రావధాన్లుగారితో) ఏమిటయ్యా?

అగ్ని—ఆయనపేరు గిరీశం, మరంతకంట నాకు తెలియదు.

కలె—చాబాష్; బాగా ఉంది! అవధాన్లుగారికొమార్తెని యెవడో తీసుకుపోయినాడు కనక వాడి వూరూ పేరూ యెరిగినవాళ్ళు తెలియచెయ్యవలసినదని, దండోరా కొట్టించి గేజట్లో వేయించండి. పోలీసువారికి యెందుకు నోటీసివ్వలేదూ! సాకీనూ మొదలైనవి లేనిదీ కేసు యడ్మిట్ చేయడానికి వీలులేదు. టిఫిన్కి వేళ యిందిలేదాము (అని లేచి వెళ్ళిపోవును.)

అగ్నిహో—(భీమారావు పంతులుగారితో) ఏమండోయ్ కేసు అడ్డంగా తిరిగిందేం?
(భీమారావు పంతులుగారు మాట్లాడరు.)
అగ్ని—యేమండోయి మీతోటి, మాట్లాడుతున్నాను.
భీమా—ఇచ్చినఫీజుకు పనైపోయింది; మళ్ళీ ఫీజిస్తేకాని మాట్లాడేదిలేదు.
అగ్ని—యేంపనైంది అఘోరంపని? కలక్టరు చీవాట్లు పెడుతూంటే ముంగిలా మాట్లాడక ఊరుకున్నావు!
భీమా—బంట్రోతే! యితన్ని నాదగ్గిరికి రాకుండా గెంటేయ్.
అగ్ని—ఓహో బాగుంది వ్యవహారం! రామప్పంతులేడీ?
నాయుడు—(మెల్లగా వెనకనుండి వచ్చి) పోర్జరీమాట రాగానే వన్నసన్నంగా జారాడు యీపాటికి వారిఊరికి సగంతోవలో ఉంటారు.
అగ్ని—అయ్యో కొంపతీశాడే!
నాయుడు—ఇంగ్లీషువకీలు పరదాతీరిందా? పోర్జరీకి తమకూడా మతప్రవేశం అవుతుంది.
అగ్ని—అయ్యో సీయింట కోడి కాల్చా.
నాయుడు—రోజూ కాలుస్తూనే వుంటారు.

(తెర దించవలెను)

## 3-వ స్థలము : సౌజన్యారావు పంతులుగారి కచేరీగది.

[సౌజన్యారావు పంతులుగారూ, పోలిశెట్టి ప్రవేశింతురు]

సౌజ—చూశారా శెట్టిగారూ యిప్పటిరోజుల్లో దేవబ్రాహ్మణభక్తి కోమట్లలోనే ఉన్నది. లుబ్ధావధాన్లుగారు బ్రాహ్మలు, వృద్ధులున్నూ - ఆయనను కాపాడితే మీకు చాలాసుకృతం ఉంటుంది.
పోలిశెట్టి—బాబు; తమశెలవు కబ్బెంతర వేటి?
సౌజ—చూశారా, మీరు సాక్ష్యంచెప్పి ఆయన్ని యీఆపదలోంచి తప్పించకపోతే నిజం దాచినందువల్ల ఆయనకి యేమి ప్రమాదం వచ్చినా, ఆపాపం మిమ్మల్ని చుట్టుగుంటుంది.
పోలి—అబ్బెంతరవేటి? బాబూ!
సౌజ—నిజంగా కూనీజరగలేదని మీనమ్మకి పెంకదూ?
పోలి—అబ్బెంతరవేటి? బాబూ!
సౌజ—ఆపిల్ల గోడదాటి పారిపోవడం మీరు చూశారుగదూ?
పోలి—అబ్బెంతరవేటి బాబూ?

సౌజ—మీరు అప్పుడు గుడ్డిమీదికి బాహ్యానికి వెళ్ళి ఉన్నారు.

పోలి—అబ్బెంతరవేఁటి బాబూ?

సౌజ—మీరు బాహ్యానికి వెళ్ళినప్పుడు, సహాయంగా మీనాక్షిని కూడా తీసుక వెళ్ళారు?

పోలి—అబ్బెంతరవేఁటిబాబూ?

సౌజ—(కలం కాగితం తీసి) యీసంగతులే వ్రాస్తాను చెప్పండి.

పోలి—యేటి బాబూ?

సౌజ—మీరు చెప్పబోయే సాక్ష్యానికి స్టేటుమెంటు వ్రాసుకుంటాను; జరిగినది అంతా చెప్పండి - వ్రాస్తాను.

పోలి—మా యింట్లోళ్ళకి ఉడ్డోలమైన జబ్బుగా ఉందని కబురెట్టారు. బాబూ నాకు సేతులు కాళ్ళు ఆడకుండున్నాయి. బండీ కుదుర్చుకొచ్చాను - శెల విప్పించండి - యీసాచ్చీకాల్లో తిరిగితే పిల్లాపేకా బతుకుతారా బాబూ?

సౌజ—యింతసేపూ చెప్పారు కారేమి? సుస్తీ నిజమే ఐతే చాలవిచారమైన సంగతి- మీకు సాక్ష్యం యలాగా తప్పదు. చెప్పేమాటలు ముందు వ్రాసుకుంటే మంచిది. లేకుంటే బోనెక్కినతరవాత తత్తరపడిపోతారు, పదినిమిషములు పట్టదు. చెప్పండి వ్రాస్తాను.

పోలి—సాచ్చీకం తప్పదు బాబూ?

సౌజ—యలాతప్పుతుంది? నిజం చెప్పినవారు సాక్ష్యం పలకకపోతే మరి యవరు పలుకుతారు?

పోలి—బాబూ-తమరు పెద్దవోరికీర్తో. కోమటోడిమాటని కొట్టేయక, యింటారా?

సౌజ—విన కేమి?

పోలి—నిజవేఁటి బాబూ? అబద్దవేఁటి బాబూ? నేను చూసి నిజవాఁ చెప్పినాను? గుడ్డిమీదికేటి నిశిరాత్రివేళ నేను బైటకెల్లవేఁటి? జావ్విచెట్టుమీద పిశాచం అమాంతంగా సంపేసిపోదా! బాబూ! యేటిబాబూసాచ్చీకానికి ముండపోలిశెట్టి పోలిశెట్టే సెప్పాలా సాచ్చీకం బాబూ? తమవంటి అధికార్లని చూస్తే, పాణం యెగిరిపోతుందిగదా? తమరు తలిస్తే సాచ్చీకానికొర్కొదవా? బాపనోళ్ళు నచ్చాపనచ్చలు. కొంచం సెయి తడిజేస్తే సాచ్చీకం చెప్పేసిపోతారు బాబూ.

సౌజ—యీపాటికి చాలించండి. దొంగసాక్ష్యాలు నాదగ్గిర పనికిరావు. నిజం తెలిసిన సాక్షులే నాకు కావాలి.

పోలి—ఆపాటిమాట యెవరూ సెప్పనక్కారదు బాబూ, నిజంగా నాకేమీ తెల్దు, యేదేవుఁడు నెత్తికొట్టమంటే ఆదేవుఁడు నెత్తి కొడతాను బాబూ.

సౌజ — మరి యెరుగుదువని యెందుకు చెప్పావూ?

పోలి — బాబూ, సెప్పకంటే కనిష్టీబోళ్ళు ఊరుకున్నారా?

సౌజ — యిప్పుడూమాత్రం ఊరుకుంటారా?

పోలి — చెప్పితే, యిన్నిసిపికటరు పీక పిసికెద్దురు బాబూ!

సౌజ — చెప్పకపోతే హెడ్డుకనిష్టీబు పీక పిసకడా?

పోలి — అధికార్లేటి చెయ్యమంటే, మాలాటోళ్ళు అదల్లా సెయ్యాలిగదా బాబూ — లేకుంటే పీక్కూరిగదా. 'పోలిశెట్టి సాచ్చీకం సెప్పాలి' అని హెడ్డుగారంటే, సిత్తం బాబూ అనాలి; "పోలిశెట్టి కబడదారు. సాచ్చీకం చెప్పితే పంపేస్తాను" అని యిన్నిసిపికటరుగారు అంటే, సిత్తం బాబూ అనాలి. హెడ్డుగారిని బదిలీచేస్తాం మరి భయపడకు" అంటే, సిత్తం బాబూ అనాలి. ఆరాత్రి నే నూళ్ళోవున్నానా బాబూ? లింగోరం సంతకి పోలేదా?

సౌజ — మీ సాక్ష్యాన్ని, నమ్ముకుని, లుబ్ధావధాన్లుగారికి నేను ధైర్యం చెప్పేనే?

పోలి — గొప్పధికార్లు! తమరు తలుస్తే ఆరికినోటేటి బాబూ? కోర్టుటాడిమాట కొట్టెయ్యండి బాబూ. తమవంటోరు తలుస్తే బాపన సాచ్చీకాలు నచ్చాపనస్పలు.

సౌజ — మీయోగ్యత తెలిసింది. చాలు, యీపాటికి వెళ్ళండి.

పోలి — (లేచి నిలబడి) కోపవాఁ బాబూ? మేం బతగ్గలవా? ఆవునెయ్యి బాబూ గుమగుమలాడేది ప్రతోరం పంపించుకుంటునా బాబూ?

సౌజ — యీయినస్పెక్టరికి పంపండి.

పోలి — (వెళ్ళిపోతూ) ఆరతోరుఆరూ; తమంతోరుతమరూ. మాకిద్దరోహటి గాదా?

సౌజ — చాలును వెళ్ళండి. వెళ్ళండి.

పోలి — తమకోప్పవొస్తే బతగ్గలవాఁ బాబూ. (గుమ్మందాటి) బతికాన్రా దేవుఁడా? పెండ్రరకాశే.ఝిల్లింటికిపోయి యెంకటేశ్వర్లుకి అరశటాకు నెయ్యి దివ్వెలిగిస్తాను.

(నిష్క్రమించును)

## ౪-వ స్థలము: వీధి

[అగ్నిహోత్రావధాన్లు నాయుడు ప్రవేశింతురు]

అగ్ని — అయితె కేసు మానుకోమ్మంటారా?

నాయడు — లేకపోతే మీకు చాలా ఉపద్రవం సంభవిస్తుంది. ఆ యింగిలీషు వకీలు అంతా పాడుచేశాడు.

అగ్ని—అయితే రామప్పంతులు వుడాయించేసినట్టేనా?

నాయడు—అందుకు సందేహవేవిటి?

అగ్ని—నా కడియం పట్టుకుపోయి తాకట్టుపెట్టాడు?

నాయడు—దానికి నీళ్ళధారే.

అగ్ని—అయ్యో! ఆకడియం మాతాతనాటిది. మీరు మొన్న పడ్డీతోవంట వొచ్చారే ఆసాందానియింట్లో తాకట్టుపెట్టాడు.

నాయ—రామ! రామ! ఆసరుకు దానిదగ్గిర వుంచేలేదు. మీరుమిక్కిలి దానితాలూకు కంటె వకటి వాడే తీసుకుపోయి యెక్కడో తాకట్టు పెట్టాడు. ఆతాగుబోతు మీకెలా దొరికాడు?

అగ్ని—రామప్పంతులు తాగుతాడా?

నాయ—మరి కడియం, కంటెకూడా తాగేశాడుకాడా?

అగ్ని—వీడిసిగతరగా!

నాయ—అవును గాని, మీమీద పోర్జరీకేసు ఖరాయించకుండా డిప్టీకలక్టరుగారితో సిఫార్సుచేశానుగదా, నాకేమిస్తారు?

అగ్ని—యేమిచ్చేది? నాభి కొనుక్కోడానికి దమ్మిడీ అయినా నాదగ్గిరలేదు. వూరికి చేరితేగాని డబ్బు పెగల్దు.

నాయ—పోనియ్యండి. ఒక ప్రోమిసరీ నోటు రాయండి; రూపాయలు యిప్పిస్తాను.

అగ్ని—నాప్రాణం పోతే నోటురాయను. అప్పుపత్రం రాయనని మాతండ్రి చచ్చిపోయేటప్పుడు నాచేత ప్రమాణం చేయించాడు.

నాయ—అయితే మీతోకూడా మీవూరువస్తాను. ఒక బండెడు ధాన్యం యివ్వండి.

అగ్ని—డబ్బూ, దినుసులూకూడా వొకళ్ళనెత్తిన కొడితే, యేటి కేడాదీ బతకడం యెలాగు? రెండుపుట్లు మిరపకాయలిస్తాను.

నాయ—అదైనా యెంతకాదు. ఖరారేనా?

అగ్ని—అగ్నిహోత్రావధాన్లు అన్నమాట తప్పుతాడా? లుబ్ధావధాన్లు నన్ను ఖరాబు చేశాడు. వాడికి శిక్షకాదేం?

నాయ—అవును గాని, సౌజన్యారావుపంతులుగారు అతడికి సాయంచేస్తున్నారు అధికార్లంతా ఆపంతులుమాట వింటారు.

అగ్ని—ఆపంతులు అవుధాన్లుకూతుర్ని పెళ్ళాడతాడా యేమిషి?

నాయ—ఆయనప్రారబ్ధం, దాన్ని పెళ్ళాడతాడా?

అగ్ని—మరియెందుకు, లుబ్ధావుధాన్లు మీదపడి యేడుస్తాడు?

నాయ — సౌజన్యారావు పంతులుగారు మహాదొడ్డవారు. కోట్లలో యెన్నవలిసిన మనుషులు. ఆపదలోవున్న యెవరికైనా ఆయనఉపకారం చెయ్యవలసినవారే?

అగ్ని — అట్టైతే, వెధవముండని పెళ్ళాడిన చావాటుపీనుగను వెనుకేసుకొని నాపీక యెందుకు నొక్కుచున్నారు?— అదుగో ఆగాడిదకొడుకు!

[గిరీశం తొందరగా ప్రవేశించును. అగ్నిహోత్రావధాన్లు పక్కనుంచి గిరీశం మీదపడును. గిరీశం తప్పించుకుని కిందికి జారి, అగ్నిహోత్రావధాన్లు కాళ్ళుబట్టి లాగి "మావగారికి నమస్కారం" అని పరుగుచ్చుకొనును. అగ్నిహోత్రావధాన్లు కిందపడును.]

నాయ — అల్లుడుగారా యేమిటండీ? (లేవదీసి వొళ్ళు దులుపును.)

అగ్ని — వీడిశ్రాద్ధం చెట్టుకిందబెట్టా! యేడీ, వెధవని చంపేస్తాను?

నాయ — అల్లుణ్ణి హతవారిస్తే, కూతురు డబ్బిల్ వెధవౌతుంది శాంతించండి.

అగ్ని — నీయింట కోడిగాల్చా!

నాయ — అమోఘాశీర్వచనము పదండి.

## ౫-వ స్థలము: లుబ్ధావధానులు బస.

లు — రామనామతారకం। భక్తిముక్తిదాయకం॥

[గిరీశం ప్రవేశించి లుబ్ధావధాన్లును కౌగలించుకొని 'అన్నయ్యా' అని యేడ్చును]

లు — యిదేవింట్రా?

గిరీశం — నీమీద కూనీకేసు వొచ్చిందని తెలిసి నిద్రాహారం లేకుండా యాకాయకీని వొచ్చాను. మాఅన్నయ్యకీ వాళ్ళకి కబురు పంపించావు కాదేవిఁ.

లు — యెవడేంజెయ్యాలి? అన్నిటికీ సౌజన్యారావు పంతులుగారే వున్నారు అయితే అబ్బీ, అగ్నిహోత్రావధాన్లుగాడి కూతుర్ని లేవదీసుకు పోయినావట్రా? వాడికి తగినశాస్తిచేశావు. దాన్నిగానీ పెళ్ళిమాత్రం ఆడలేదుగద?

గిరీశం — నేనెంత తెలివితక్కువపని చేస్తాననుకున్నావా అన్నయ్యా? నువ్వు నన్నేదో పెంచుకుంటావనీ, పెళ్ళిచేస్తావనీ మా వాళ్ళు కొండంత ఆశ పెట్టుకున్నారు గదా?

లు — యీగండం గడిస్తే పెంపకంమాట ఆలోచించుకోవచ్చును.

గిరీ — (గద్గదస్వరంతో) సౌజన్యారావు పంతులుగారు చెప్పినమాటలు చూస్తే, యీ గండం గడుస్తుందని నాకు ధైర్యం తాళకుండా వుంది. నీకు కావలసినవాణ్ణి,

చదువుకున్నవాణ్ణి, బుద్ధిమంతుణ్ణి గనక నీకు మంచి సలహా చెప్పమని సౌజన్యారావు పంతులుగారు నాతో మరీమరీ చెప్పారు.

లు—ఆయన్ని చూశావురా?

గిరీ—"చూశావా" అనా అడుగుతున్నారు? ఆయనదగ్గిరికి పెద్ద సిఫార్సు తీసుకు వొచ్చాను. ఆయనకి నామీది పుత్రప్రేమ, ఆ యనకేవిూ పాలుపోక నే, నన్ను మీతోటీ, హెడ్డుకనిస్టేబుతోటీ మాట్లాడి, మంచి సలహా యిమ్మని పంపించారు. గనక నామాట విను. యెందుకైనా మంచిది. ఒక దత్తత పత్రిక రాయి - కన్న కొడుకు లేనందుకు. ఉత్తరగతి చూసుకోవాలా లేదా?

లు—నాకువున్న బంధువులంతా నాదగ్గిర డబ్బు లాగాలని చూసేవారేగాని, నాకష్ట సుఖాలికీ పనికివొచ్చేవాడు ఒక్కడైనా కనపడ్డు.

గిరీ—ఒహో జ్ఞాతినైనాయెన్నడైనా, ఓ దమ్మిడీ కొట్టిన పాపాన్ని పోయినావూ? నేచొక్కణ్ణేగదు. నీమీద అభిమానం పెట్టుకు దేవులాడుతున్నాను మిగతా నీబంధువులకి యెవరికైనా నీమీద పిసరంత అభిమానం ఉందేఁ చెప్పు.

లు—లేకపోతే పీడా నాడా కూడా పాయెను.

గిరీ—నేమట్టుకు నీదగ్గిర ఒక్కదమ్మిడీ యెన్నడూ ఆశించలేదు. నీపరంకోసం దత్తత చేసుకోమన్నాను. నన్ను కాకపోతే మరొకణ్ణి చేసుకో.

లు—యిహం యింతబాగా వెళ్లింది; పరంమాట బతికివుంటే ముందు చూసుకుందాం.

గిరీ—సౌజన్యారావు పంతులుగారు నీకు మంచి సలహా యిమ్మని శలవిచ్చారు గనక నీతో యీమాట చెప్పాను; అంతేగాని అప్పుడు చెప్పినమాట నువ్వు వినవన్నమాట నాకు బాగా తెలుసును-పోనియ్యి-మరోమాట చెబుతాను, అదివినా చెవినిపెట్టు- నీకొకవేళ శిక్ష అయితే నీతరఫున నీవ్యవహారాలూ, సవఫీరాలూ చూడడానికి యెవడైనా ఒకడుఉండాలా లేదా? నీబంధువుల్లోకల్లా యింగ్లీషు వొచ్చినవాణ్ణీ, వ్యవహారజ్ఞానం కలవాణ్ణి నేను ఒక్కణ్ణేగదా? నాకో పవరాఫ్ టర్నామాగొలికి యిచ్చెయ్యి.

లు—నువ్వెందుకు నన్ను దుఃఖంలో ఉన్నవాణ్ణి, మరింత దుఃఖపెడతావు? అన్నిటికీ నాకు సౌజన్యారావు పంతులుగారు ఒక్కరే ఉన్నారు. ఆయన యేలా చెబితే అలా చేస్తాను.

గిరీ—నేనన్నమాటా అదేకదూ? ఆయన చెప్పినట్టు నువ్వేవిఁటి, యెవరైనా వినవలసిందే. ఈ రెండు సంగతుల విషయమయి, ఆయన సలహా తప్పకుండా అడిగి, వారు యలా శలవిస్తే అలాచేదాం? యేవంటావు?

లు—ఇప్పటి నాచిక్కుకు పనికొచ్చేమాట ఒక్కటి లేదుగద.

గిరీ—మరియెందుకొచ్చాననుకున్నావు యింతదూరం? నేను వాడు వ్రాసిన ఉత్తరపు సంగతులు నువ్వు ఆలోచనలోకి తెచ్చివుంటే, ఈచిక్కులు నీకు రాకపోనుగదా?

లు—అప్పుడు గడ్డితిన్నాను.

[హెడ్డుకనిస్టీబు, దుకాణదారు ప్రవేశించి]

హె—అవుధాన్లూ—ఈయనెవరు?

లు—నాతమ్ముడు.

హె—నాకేం తోచకుండావుంది బైరాగి మాయమైపోయినాడు.

లు—అయ్యో! మరేవిటి సాధనం?

హె—అదే ఆలోచిస్తున్నాను.

లు—యెక్కడికి వెళ్లాడో?

హె—శ్రీ జగన్నాథస్వామివారి కలవాతూంది అని యీ ఉదయంనుంచీ అంటూ వొచ్చాడు.

దుకా—సారాదుకాణాల్లో యెతికితే, దొరుకుతాడు.

హె—అదేమాట భాయీ సిద్ధులు యేంజేసినా, వారికి తప్పులేదు. యేదుకాణంలో కూడా కానరాలేదు.

కు—ఆలాగైతే అనకాపిల్లిరోడ్డు కాసి యెంతకండి.

గిరీ—బైరాగి యెందుకయ్యా?

హె—ఆయన అంజనంవేసి గుంటూరు శాస్త్రుల్లునీ, వాడికూతుర్నీ చూపించాడు.

గిరీ—డామ్ నాన్సెన్సు గ్రోస్ సూపర్‌స్టిషన్—యీవెఱ్ఱికబుర్లు యేదొరనమ్ముతాడు?

హె—దొర్లు నమ్మకపోతే పోయేరు. ఆగుంట బతికి వుందనీ, ఫలానాచోట వుందనీ మనకి ఆచోకి తెలిస్తే చాలదా?

గిరీ—ఇగ్నోరెన్స్! ఏమి ఆచోకీ తెలిసింది?

హె—ఆపిల్ల ఒక వూరియింట్లో కుక్కిమంచంమీద కూచుని యేడుస్తూన్నట్టు కనపడ్డది.

గిరీ—మీకే కనపడ్డదా?

హె—నాకెలా కనపడుతుంది? పాపం పుణ్యం యెరగని చిన్నపిల్లవాళ్ళకే కనపడుతుంది.

గిరీ—లోకం అంతటా వూరియిళ్ళూ కుక్కిమంచాలూ ఉన్నవిగదా, యేవూరని పోల్చడం?

హె—యీరాత్రి మళ్ళీ అంజనంవేసి ఊరుపేరు చెప్పిస్తానన్నారు.

గిరీ—యవిడెన్సు ఆక్టులో అంజనాలూ, పిశాచాలూ సాక్ష్యానికి పనికొస్తాయిటయ్యా?

హె—ఆబైరాగిని మీరెరుగరు; ఆయన గొప్పసిద్ధుడు యేంజెయ్యాలంటే అది చెయ్యగల్డు_అతడు పక్కనివుంటే నాకు కొండంత ధైర్యం ఉండేది. జగన్నాధస్వామిని సేవించుకుని సాయంత్రానికి ఆయన వొస్తె, నేను అదృష్టవంతుణ్ణి.

గిరీ—పదిరోజులు ప్రయాణంగదా, ఒక్కరోజుకి పోవడం రావడం యలాగ?

హె—ఆయనకీ వాయువేగం ఉంది.

దు—అప్పలాళ్ళు అగుపడితే, వాయువేగంగా యెగేస్తాడు. నాబాకీ వసూలు చేసుకోనిచ్చినారు కారుగదా భాయీ!

హె—వెధవబాకీ - యీగండం తప్పితే, నేను యిచ్చేస్తాను భాయీ.

దు—గండం తప్పేదేటి, నాసొమ్ము నాచేతిలో పడేదేటి భాయి?

హె—మీఅందరిసాయం ఉంటే దాటకేం భాయి?

దు—ప్రాణం పెడతాను భాయి. సాక్షెంమాట మాత్రం శలవియ్యండి?

హె—సాక్ష్యం పలకరా యేవిఁటి?

దు—దుకాణవేఁసుకు బతికేవాళ్ళకి సాక్షీకాలెందుకు భాయీ? యీతిరగడంనించి బేరం చెడ్డాది. యీవేళ ఊరికి పోకుంటే దుకాణం యెత్తిపెట్టాలి.

హె—యిదేనా మీస్నేహం, నేస్తం?

దు—నీవెంట తిరిగితే కొత్తహేడ్డుగారు—

హె—కొత్తహెడ్డేవిఁటి భాయి?

దు—యినసిపిక్టరుగారు, చెప్పినారు. నాసొమ్ము మాటేటి భాయి?

హె—యినస్పెక్టరుగాడు అన్నిందాలా నాకొంప తీసాడు!

దు—ఆబైరాగాడు నాకొంప తీసినాడు. యిహ నాడబ్బు నాచేతులో పడేదేటి?

(నిష్క్రమించును)

[అసిరిగాడు ప్రవేశించి]

అసిరి—(బుఱ్ఱ గోకుకుంటూ) బాబు, మా ముసల్దానికి సాలొచ్చిందట - కబురెట్టింది బాబూ.

హె—వెధవా, సాక్ష్యం యివ్వంది వెళ్ళిపోతావాయేమిటి?

అసిరి—సాచ్చీకం అయిందాకా బతికుంతాదా బాబు?

హె—ఓరి, వెధవా, దొంగమాటలాడుతున్నావు. గుండె పగలగొడతాను. నీకెవ్రడా కబురు తీసుకొచ్చాడు?

అసిరి—మనవూరు బండోళ్ళొచ్చినారు బాబు.

హె.—గాడిదకొడకా, యిల్లు కదిలావంటే వీపు పెట్లగొడతాను.

అసిరి.—యెళ్ళితే మీరు తంతారు, యెళ్ళకుంటే ఆరుతంతారు.

హె.—ఆరెవఱ్ఱా?

అసిరి.—యినిసిపిక్కటోరు.

హె.—యీ యినస్పెక్టరు గారి సాక్ష్యం రానివ్వడు.

గిరీ.—అసిరీ నాదెబ్బ నీకు తెలుసును - యినస్పెక్టరూ గినస్పెక్టరూ జాంతేనై విన్నావా, తిన్నగా బోనెక్కి నిజవేఁదో సాక్ష్యం పలక్కపోతివట్టాయనా, పీక నులివేఁసి నిన్ను నూతిలో పారేస్తాను.

అసిరి.—యేటిబాబూ! మీరో తెన్నా, ఆరో తెన్నా, యీరో తెన్నా, నాకేటెరిక బాబు? మీనాకరీకిదణ్ణం పోతాను, బాబూ ఆయమ్మ గోడగెంతడం నానుసూపు లేదుబాబూ. గవరయ్యగోరు దెయ్యాన్ని సీసాలో యెడితే, గోడగెంతడం యేటి బావ? వొట్టిఅబద్ధం! నాను సూపులేదు బాబు.

గిరీ.—వాడు చూడందీ సాక్ష్యం యేలా పలుకుతాడు, అన్నయ్యా?

లు.—నా ప్రారబ్ధం - యేవఁని జెప్పను?

హె.—యెవరీయనా? కేసులమొహం అంటే యీయనకేమైనా తెలుసునా?

గిరీ.—కేసులమొహం నాకూ తెలియదు. నిజంమొహం పోలీసువాళ్ళకీ తెలియదు. అబద్ధసాక్ష్యాలవల్ల తప్పించుకోవడం కన్న, జెయిల్లో కూచోడవేఁ ఉత్తమం. ధన ప్రాణాలు రెండూ పోయిన మనిషి అన్నవాడు అసత్యం ఆడకూడదు. ఆడించ కూడదు.

హె.—యేవిఁటండీ ఈయన శల్యసారథ్యం! యవరితడు?

గిరీ.—నేను లుబ్ధావధాన్లుగారి తమ్ముణ్ణి - నా పేరు గిరీశం అంటారు. నేను పరీక్షలు పాసైనవాణ్ణి, తెలిసిందా?

హె.—వెధవముండని తగులుకుపోయిన మహానుభావుడివి నువ్వేనా?

గిరి.—డిఫమేషన్ అంటే మీకేమో తెలుసునా? నేను సౌజన్యారావు పంతులుగారి స్నేహితుణ్ణి సాక్ష్యాలు యేరీతిగా ఉన్నాయో కనుక్కొని, అన్నయ్యగారికి మీకూ సలహాచెప్పమని పంతులుగారు నన్ను పంపితే వచ్చాను.

హె.—అలా అయితే మాకు మీరు సాయంచెయ్యాలిగాని, అబద్ధంలేకుండా సాక్ష్యం కావాలంటె యీభూప్రపంచకమందు యెక్కడైనా సాక్ష్యంఅన్నది వుంటుందా? నా నెత్తిమీద యెన్ని వెండ్రుకలున్నాయో, అన్ని సాక్ష్యాలు చూశాను. పెద్ద పెద్దవకీళ్ళు తయారుచేసిన సాక్ష్యాలు కూడా చూశాను. మీరు అనుభవం లేక నీతులు చెబుతున్నారుగాని, హైకోర్టు వకీళ్ళు కూడా తిరగేసి కొట్టమంటారు.

నీపుణ్యం వుంటుంది బాబూ, నిజం అబద్ధం అని తేలగొట్టక, రేపో ఒక తడకఅల్లి తయారుచేస్తేగాని ఆబోరు దక్కదు.

గిరీ—అన్నయ్యాకీ, మీకూ సహాయం చెయ్యడంకోసం కాకపోతే అంత దూరంనుంచి నేను యెందుకు వచ్చాను? మీయిష్టం వొచ్చినట్టల్లా మీకు పనికివొచ్చే అబద్ధాలు మీరు పలికించడమునకు నాఅభ్యంతరం యెంతమాత్రం లేదు. ఏబ్ స్ట్రాక్టు ట్రూత్ అనగా సుద్ధసత్యమనేది, సాక్షాత్తూ భగవంతుడితో సమానమైన వస్తువ అన్నమాట మాత్రం మరిచిపోకూడదని నాఅభిప్రాయము. నేనుమట్టుకు నిజంకోసం సమయం వొస్తే సంతోషముతో ప్రాణం యిచ్చేస్తాను. "లోకోభిన్నరుచిః" అన్నాడు. కొందరికి కందిపప్పు పచ్చడి రుచి; కొందరికి పెసరపప్పు పచ్చడి రుచి; కొందరు అదృష్టవంతులికి రెండుపచ్చళ్ళు రుచి. అలాగనే, కొందరికి అబద్ధం రుచి; కొందరికి నిజం రుచి; చాలామందికి రెండింటీ కలగలుపు రుచి. యిది లోకస్వభావం. గనక అవసరం గలిగినప్పుడు తొణుకూ బెణుకూ లేకుండా, అబద్ధం ఆడవలసిందే. ప్రస్తుతాంశంలో, అసిరిగాడిచేత అబద్ధం ఆడించడం నాది పూచీ. అసిరీ నాతడాఖా జ్ఞాపకం ఉందా, కబడదార్ — సాక్ష్యం యివ్వకపోతే చంపేస్తాను.

హెడ్—అలా తోవలోకి రండి భాయీ — చక్కం చెప్పాలు కట్టియిస్తాను. (లుబ్ధావధాన్లుతో) ఆఖండాలుడు కావఁప్పుఁకులని నమ్మక, యిలాంటి కావలసినవాళ్ళ మాటవింటే; మీకు యీగతి రాకపోవునుగదా?

గిరీశం—మావాడు కావలసినవాళ్ళ సలహావింటూవుండీ దత్తత చేసుకుంటానని యెన్నాళ్ళాయో అంటున్నాడు; దత్తతచేసుకుంటే కనిపెట్టి ఉండనా? "పోనీ, ఓపవరాఫ్ ఎటర్నామా అయినా నాపేర వ్రాయి, నీవ్యవహారాలు చూస్తాను" అంటే చెవిపెట్టడు.

హెడ్—యేవండీ అవుధాన్లుగారూ అలా చేయరాదటయ్యా?

లుబ్ధా—వెనకనుంచీ ఆలోచించాం.

గిరీశం—ఆధాత్తుగా, జెయిలులోకి లాక్కుపోతే, ఆపైన నేనేపనేవిఁటి?

హెడ్—జయిలు సిద్ధపరిచారూ?

గిరీ—మాటపరసవన్నాను. కేశించి మెలెంచాలి — యినస్పెక్టరుకు ప్రబలంగా వుంది. పోలిశెట్టి సాక్ష్యం పలకనని సౌజన్యారావు పంతులుగారితో చెప్పి వూరికి వెళ్ళిపోయినాడు.

హెడ్—అయ్యో మరేమిటి గతి?

గిరీ—అదే పంతులుగారూ నేనూ, విచారిస్తూన్నాం.

[పూజారి గవరయ్య ప్రవేశించును]

హెడ్—గవరయ్యగారూ, గుర్నాజీ కనపడ్డారా?

గవ—యిదుగో నాతో వొస్తూ వుంటేను! మీ పెరటి అరుగుమీదే యింతసేపూ సమాధిలో వున్నారు.

హెడ్—నాకు పెరటి అరుగుమీద కనబడలేదే? పోనీండి ఆయన వొచ్చారంటే బతికానూ అన్నమాట - యేరీ?

గవ—యేమి అలా అడుగుతున్నారు? యిదుగో మీయెదటా (కాళీజాగావేపు చూపును) మీకు కనబడలేదా యేమిటి? (కాళీజాగావైపు చూసి) యేం గురోజీ తిరస్కరిణీవిద్య అవలంబించారేమి? ఓహో, మీగురువుగారి ఆజ్ఞ ఐందనా?— అయితే నాకెలా కనబడుతున్నారు?—నాకు మంత్రసిద్ధి కలదనా?—అయితే యెన్నాళ్ళు యిలా కనపడకుండా ఉంటారు?—ఒక్కపక్షువా? (హెడ్డుతో) అదీ వారు శెలవిచ్చినమాట.

హెడ్—యీలోగా మా పీకకి ఉరి అయిపోతుందే?

గవ—(కాళీజాగ వైపు చూచి) యేమి శెలవు? గురూ!—(హెడ్డుతో) మీకేమీ ఫర్వాలేదన్నారు.

హెడ్—యీరాత్రి అంజనం వేయిస్తానన్నారుగదా యెలాగ?

గవర—(కాళీవైపు చూచి) యేం శెలవు?—(హెడ్డుతో) అన్నిపనులూ నాచేత చేయిస్తామన్నారు.

హెడ్—వారు కనపడితే బాగుండును.

అసిరి—అదేటి బాబూ, ఆరు నాకగుపడుతున్నారు!

గవర—సిద్ధులూ, పిశాచాలూ, మాలాంటి మాంత్రికులికి కనపడతారు. వాడిలాంటి మూఢభక్తులకు కనపడతారు; పాపం పుణ్యం యెరగని పసిపిల్లలకి కనపడతారు. ఇతరులకు కనపడరు.

గిరీ—డామ్, హంబగ్. (కఱ్ఱతో గవరయ్యపక్కని కాళీ జాగాకొట్టి) యేపడున్నాడిక్కడ? హెడ్ గారూ, యిదంతా గ్రాండ్డచ్చీ ఆఫ్ బేడెన్.

గవర—నువ్వు రెండు యింగిలీషి ముక్కలు చదువుకుని నాస్తికుడివికావొచ్చునే, మా మహాత్మ్యాలు పోతాయనుకున్నావా యేమిటి? నువ్వు సొట్టకఱ్ఱ తిప్పితే సిద్ధులికి తగుల్తుందా? నీలాగే పెద్దబాబు చెప్పిన రిజిస్ట్రారికి. స్మశానంలోకి తీసికెళ్ళి దెయ్యాన్ని చూపించేసరికి. ఆర్నెల్లు వూష్ణం పెట్టుకున్నాడు. సిద్ధుల్ని నిందిస్తే బుఱ్ఱపగుల్తుంది.

అసిరి—అదేటిబాబూ, బైరాగోరు!

గిరీశం—(అసిరిగాడిపైని ఉరికి) వెధవా, దేవిటిరా?

అసిరి—లేదు బాబూ, లేదు బాబూ ఉత్తినన్నాను.

గిరీశం — దొంగగాడిదకొడకా. (హెడ్డుతో) మీరు సాక్ష్యాని పరుష్కోవడం మానేసి యీగవరయ్య మాయల్లో పడితే సరి తేల్తారా?

హెడ్ — అన్నా — అలా అనకండి. వీరిసాయంవల్లే మనం వొడ్డెక్కాలి. (చెవిలో) గవరయ్యగారు మనకి ముఖ్యమైన సాక్షి.

గవర — శిరస్తాపన భ్రష్టులు పేరిగాకోలు బాంత్రికులూ, నీథులూ పుంఖజనము- (కాళీ వైపుచూసి) రండి గుర్నాజీ మనశోవని మనం పోదాం.

లు — గవరయ్యన్నా, యెక్కడికి వెళతారు!

గవర — నాకు తోచినచోటికి.

లు — మరి సాక్ష్యవో?

గవర — అవధాన్లుగారు పెళ్ళాడినది కామినీపిశాచం 'అది మనిషి, గోడగెంతి పారి పోయిందీ' అని నేను అబద్ధపుసాక్ష్యం చెప్పానంటే మరి మంత్రం అన్నది నాకు మళ్ళీ పలుకుతుందా? నావొంతు ఆగిరీశాన్ని సాక్ష్యం పలకమను.

"నమ్మి చెడినవారు, లేరు।
నమ్మక చెడిపోతే పోయేరు॥"

(గిరీశంతో) — యినసిపికటరు గారు నీకంటే యింగిలీషు చదువుకున్నా ఆయనకి మన శాస్త్రాల్లో నమ్మకాలు పోలేదు.

హెడ్ — ఆయనదగ్గిరికి వెళతారా యేమిటి?

గవ — (వెళ్ళుతూ) కబురంపించారు.

హెడ్ — రండి రండి గవరయ్యగారూ చిన్నమాట.

గవర — (వెళ్ళుతూ) చిన్నమాటేదో (గిరీశమును చూసి) ఆ మహానుభావుడుతో చెప్పండి. (నిష్క్రమించును)

హెడ్ — (గిరీశంతో) యీసాక్ష్యం మీరు మాట దక్కించమనుకున్నారు- మరి సాక్ష్య మన్నది లేదు.

గిరీశం — ఆమాటకొస్తే నేనే సాక్ష్యానికి దిగి, కేసు నీళ్ళు గారించేస్తాను. నాశక్తి చూతురుగాని, సౌజన్యారావు పంతులుతోమాత్రం ఆమాట యింకా చెప్పకండి. (తెర దించవలెను)

## ౬-వ స్థలము: సౌజన్యారావు పంతులుగారియిల్లు.

మేడపైని పంతులుగారి పడకగది. ఒక బల్లపైని సన్నని గాజుదీపము కొంచము వెలుతురు కలుగ చేయును. గదిమధ్యను మెట్లవైపునున్న గుమ్మమునకు యెదురుగా దోమతెర మంచముండును, దానిపైని సౌజన్యారావుపంతులు మేలుకుని పరుండి

యుండును. మంచము రెండవ ప్రక్కను చిన్న రౌన్డు బల్ల పైని గిల్టుకవరూ అందులో గల భగవద్గీతా పుస్తకము పక్కని కుర్చీమీద గిరీశం కూర్చుని యుండును.

గిరీ—నామనస్సు డైలమ్మాలో చాలా ఖేదిస్తూందండి. యేరీతినైనా నాఅన్నగారు యీఆపద దాటుదురా అని ఆతృత ఒకపక్కా, అసత్యమునా కార్యసాధనంగా చేసుకోవడంఅనే జిఘాస ఒకపక్కా నన్ను పీడిస్తూన్నవండి. "అబద్ధపుసాక్ష్యం వొద్దు. నిజమైనసాక్ష్యం జాగ్రత చెయ్యండి" అని హెడ్కనిస్టీబుతో నేను అనే సరికి నాపైన కొండంత కోప్పడ్డాడండి. నిజమైన సాక్ష్యం ప్రయత్నిస్తే దొరకదా అండి?

సౌజ—నిజమైన సాక్ష్యం! యేం సత్యకాలం! నిజవాఁడేవాడు సాక్ష్యానికి రాడు. సాక్ష్యాని కొచ్చినవాడు నిజవాఁళ్ళేడు.

గిరీ—యెంచేత ఆళ్ళేడండీ?

సౌజ—వాదికి బాధించే నిజం వాదితరపు వకీలికి అక్కరలేదు. ప్రతివాదిని బాధించే నిజం ప్రతివాది వకీలుకి అక్కరలేదు. క్రాసెగ్జామినేషను ఆరంభం ఆయేసరికి యెంతటిసాక్షి కవిత్వం ఆరంభిస్తాడు. అంచేతనే పెద్దమనుషులు బోనెక్కడానికి భయపడతారు.

గిరీ—వకీళ్ళు అబద్ధాలాడిస్తే న్యాయం కనుక్కోడానికి జీతం పుచ్చుకునే జడ్జీ యేం జేస్తాడండి?

సౌజ—ఉభయపార్టీల వకీళ్ళు ఆడించేఅబద్ధాలూ చెయిపీకేటట్టు రాసుకుంటాడు.

గిరీ—అయితే యెందుకండి యీకోర్టులు?

సౌజ—నేను అదే చాలాకాలవాఁయి ఆలోచిస్తూ వుంటిని. పెద్దపెద్ద వకీళ్ళు కూడా సిగ్గుమాలి బరిపెట్టి దొంగసాక్ష్యాలు పాఠం చెబుతారు, కొందరు మృదువర్లు తీరగేసి కొట్టమంటారు. నావంటి చాదస్తులం యింకొక కొందరం అట్టి సాహసానికి వొడిగట్టుకోంగాని మాపార్టీలతరఫున సాక్ష్యులుకూడా అబద్ధం చెబుతున్నారని యెరిగిన్నీ వూరుకుంటాం. యిలాటి అసత్యానికి అంగీకరించ వలసివస్తుందనే, నేను ప్రాక్టీసు చాలా తగ్గించుకున్నాను. క్రమంగా యీవృత్తి మానుకోవడము సంకల్పం కూడా ఉంది.

గిరీ—అందరూ తమవంటి వకీళ్ళే అయితే అసత్యం అన్నది వుండనే వుండదండి వకాలీలో యింత అక్రమం ఉందన్నమాట నేనెరుగనండి. యేమైనా సహించగలను గాని అసత్యం అన్నది సహించలేనండి.

సౌజ—ఒక్కఅసత్యంతో కుదరలేదు. సాధారణంగా వకాల్తీలో చాలా ఉన్నాయి. ఆంటినాచ్ లాగనే, ఆంటీ వకీల్ అని వక మూవ్మెంటు మనదేశంలో స్టారుటు

చెయ్యడమను ఆవశ్యకత కలిగేటట్టు కనబడుతుంది. హెూడ్ కనిస్టేబుది తప్పుకాదు, దొంగసాక్ష్యం కల్పిస్తేనేగాని కేసులు గెలియవు. మీరు సత్యమార్గంలో తరిఫీదైన మనుష్యులు కాటచేత, మీరు కేసులు నడిపించేమార్గాలు వేహ్యంగా ఉన్నాయి.

గిరీ—మరి మాఅన్నగారి గతి యేమిటండి?

సౌజ—ఒక్కటే సాధన వుంది. ఆ గుంటూరుశాస్తుల్లు యెవరో పోల్చినట్టుగుంటే, యితరసాక్ష్యం అవసరం ఉండదు.

గిరీ—పట్టుపడే మార్గం యేదో తమరు శలవిస్తే మూడు లోకాలూ గాలించి అయినా పట్టుగుంటానండి.

సౌజ—మీయోగ్యతను నాకు చాలా సంతోషంగాఉంది. మీలాంటి యెంగ్ మెన్ రావుగావుంటే, మనదేశం బాగుపడును. మీ ప్రయత్నం సానుకూలంగా తగిన బందోబస్తు యిావత్తూ నేను చేస్తాను. మీస్వంత చిక్కులు కూడా వదిలినవిగనుక మీరు వెంటనే బయలుదేరి వెతకడం ఆరంభించవచ్చును. యీకారణంచేత మీ వివాహం పోస్టుపోన్ కావలసివొస్తుందిగదా అని మాత్రం విచారిస్తున్నాను.

గిరీ—అట్టివిచారం తాము పడనక్కరలేదు. మాగురువుగారిఉపదేశం డ్యూటీమొందూ ప్లెజర్ తరవాతానండి అందులో నేను చిన్ననాటినుంచీ కొంచం కాన్సెన్ట్రేటవనూ ఇంద్రియనిగ్రహమూ అభ్యాసం చెయ్యడంచాతనూ, వొళ్ళు మరిచి యెల్లప్పుడూ యేదో ఒకవ్యాపకంలో కొట్టుకుంటూ వుండడంచాతనూ స్త్రీసుఖముల యెడల నాకు విముఖతలానండి. అందుచేతనే మావాళ్ళంతా నాకు నెపోలియన్ ఆఫ్ ఆంటీనాచ్ అని పేరుపెట్టారు. యీజీవిత కాలమంతా సోషల్ రిఫారమ్‌కింద వినియోగపరుద్దావనే నిర్ణయంతో వివాహం మాని మాగురువుగారిదగ్గిర లైఫ్ మెంటుగా ప్రవేశించానండి. బుచ్చమ్మయొక్క హృదయనైర్మల్యమూ, ఆమెదురవస్థా చూచినీ, నాశిష్యుడియందు నాకు ఉండే ప్రేమాతిశయంచేతనున్నూ, ఆమెయందుకూడా ప్రేమాతిశయం నాకు కలిగి, ఆమెను వివాహం కావడముకు వొప్పుకున్నానుగానండి. ఇంద్రియసుఖముల నపేక్షించి కాదు. ఆమె కూడా నన్ను ప్రేమించి, విధవావివాహము కూడుననే నిశ్చయముతో నన్ను వివాహము కావడముకు అంగీకరించారండి. గనక మామారియేజి అనేది, ట్రూ లవ్ మారియేజిగాని సాధారణపు విడో మారియేజి కాదండి.

సౌజ—మాగురువుగారూ అలాగే వ్రాశారు. గాని మీరు విడో మారియేజి చేసుకుంటే మీఅన్నగారు మిమ్మల్ని వెంచుకోరేమో?

గిరీ—తమమాటను ఆయన అతిక్రమించబోరండి. ఒకవేళ ఆయన తప్పకపోతే, దత్తత వదులుకుంటాముగాని, ప్రాణసమానురాలైన బుచ్చమ్మను విడవనండి.

సౌజ—ఆమె అదృష్టవంతురాలు.

గిరీ—అట్టి స్త్రీరత్నము (చడిలేకుండా ఒక మనిషి మెట్లెక్కివచ్చి ద్వారముదగ్గిర తనకు యెదురుగా నిలిచిఉండడముచూచి గిరీశం నిర్ఘాంతపోయి మాటమాని నోరు తెరచును. ఆవైఖరి సౌజన్యారావుపంతులు కనిపెట్టి)

సౌజ—యేమిటి అలా చూస్తున్నారు? (గిరీశంచూస్తూఉన్న వేపు తాను దృష్టితిప్పి వచ్చినమనిషిని చూచును.)

గిరీ—ఆటిస్త్రీరత్నము దొరికిన కారణంచేత నేనే అదృష్టవంతుణ్ణి అని భావిస్తాను. అయితే 'పరోపకారః పుణ్యాయ। పాపాయ పరపీడనం' అన్న న్యాయప్రకారం, ఒకర్ని కాపాడి ఉపకారంచెయ్యడం ఉత్కృష్టమైన పుణ్యం. నిష్కారణంగా, వాడిమానాన్న వాడు బతుకుతున్నవాడికి అపకారం చెయ్యడం పాపానికి కారణం, గనుక మాఅన్నయ్యని ఎంతకష్టపడి అయినా నేను కాపాడడం విధి అని యెరుగుదునండి.

సౌజ—(కొత్తగా వచ్చిన మనిషితో) యెవరు మీరు?

కొత్తమని—జరూరు ప్రయోజనం కలిగి వచ్చానండి – వర్తమానం చేయకుండా వచ్చినందుకు క్షమించవలెను – కింద నౌఖర్లు కానరాలేదండి.

సౌజ—రండి కూచోండి.

గిరీ—(లేచివెళ్ళి ఒక కుర్చీ తెచ్చి తనకుర్చీ ప్రక్కను వేసి) దయచెయ్యండి.

కొత్తమనిషి—(కూచోక) అక్కర్లేదు.

సౌజ—కూచోండి. (కొత్తమనిషి కూచోనును) తాము యెవరండి?

కొత్తమనిషి—నేనెవరో మనవిచేయక తీరదాఅండి?

సౌజ—యేకారణంచేతనైనా పేరుచెప్పడం యిష్టం లేకపోతే, చెప్పనక్కరలేదండి.

కొత్తమనిషి—నేవచ్చినపనికి నాపేరుతో పనిలేదండి. కొన్నికారణములచేత నాపేరు చెప్పడమునకు వీలులేదండి. క్షమించవలెనని ప్రార్థన.

గిరీ—షేక్స్పియర్ అన్నాడుకాదాఅండి. 'వాట్సినెనేమ్?' అని? దానిని నేను చిన్నగీత ముక్కగా తర్జుమాచేశానండి. 'పేరులోననేమి పెన్నిధి యున్నది' మన శాస్త్రాల్లో కూడా యెవరిపేరు వారు గట్టిగా ఉచ్చరించితే పాపమన్నారు. తమకు విశదమే.

కొత్తమనిషి—మరివొకరితో అయితే కల్పించి మారుపేరు చెప్పుదును. తమచోట అబద్ధం ఆడజాలనండి.

గిరీ—భోజరాజు ముఖంచూస్తే కవిత్వంపుట్టినట్టు, తమముఖంచూస్తే యెట్టివాడికైనా నిజమే నోటంట వొస్తుందండి.

కొత్తమనిషి—ఒకావొకరికి తప్పు.

గిరీ—"సచేమాన్ ఈజ్ టుబిపిటీడ్" అనగా అట్టి మనిషి ఉంటే ఆమనిషియెడల మనం కనికరం కలుగజేసుకోవాలి – అంతే.

సౌజ—అసత్యమనేది యెవరితోనూ ఆడకూడదు.

కొత్తమనిషి—మంచివారియెడల మంచిగానూ, చెడ్డవారియెడల చెడ్డగానూ, ఉండమని మాతల్లిగారు ఉపదేశం చేశారు. అంచేత తమతో అబద్ధమాడకున్నాను.

సౌజ—మీతల్లిగారు పూజ్యురాలేగాని, వారి ఉపదేశంలో మీరు మొదటిసగమే అవలంబించి కడంసగమూ మార్చి, మనం చెడ్డవారని అనుకునేవారియెడల కూడా మంచిగా ఉండుటకు ప్రయత్నము చేస్తే, దయాపరిపూర్ణుడైన భగవంతుడు సృజించిన యీలోకము మీకు మరింత యింపుగా కనపడుతుంది. మీకూ మీ పరిచయం కలిగినవారికి మరింత సౌఖ్యము కలుగుతుంది. కాక మంచిచెడ్డలు ఏర్పర్చగలిగినవాడు యెవడు? మంచిలోనూ చెడ్డ ఉంటుంది. చెడ్డలోనూ మంచి ఉంటుంది.

గిరీ—యేమి విలువైనమాటలు! ఓ చెడ్డమనిషి ఉన్నాడనుకోండి. ఒకణ్ణి అనడమెందుకు? నేనే ఆచెడ్డవాణ్ణి అనుకోండి. అట్టి చెడ్డవాడనైన నాయెడల మంచిగా ఉండడమే నాయోగ్యత. తమవంటి మంచివారియెడల అంతా మంచిగానే ఉంటారు. "అపకారికి నుపకారము నెపమెన్నక చేయువాడు నేర్పరి సుమతీ" అని కవి అన్నమాట పర్‌ఫెక్ట్ జెమ్ కాదాఅండి?

సౌజ—నాభావం మహబాగా ఉపన్యసించారు.

కొత్తమనిషి—(సౌజన్యారావుపంతులుతో) తమవాక్యం గురూపదేశంగా భావించి యిటుమీదట చెడ్డవారియెడల కూడా మంచిగా ఉండడానికి ప్రయత్నిస్తాను. తమశిష్యరికం లభించడం నాకు పెన్నిధి. సత్పురుషులదర్శనం సద్యోఫలం కలది. తాము మంచిలో చెడ్డ ఉంటుందని శలవిస్తిరి. పరిపూర్ణమైన తమ మంచిలో చెడ్డ లేదని వింటున్నాను.

సౌజ—పరిపూర్ణమైన మంచి ఒక్క భగవంతుడియందే కలదు. నాచెడ్డ లోకమే యెరుగును?

గిరీ—మిషనరీ ఒరిజినల్ సిన్ అంటాడండి. మనవాళ్ళు దుష్కర్మ అంటారు. దాంతస్సాగొయ్యా (బెగ్ యువర్ పార్డన్) ఆ ఒరిజినల్ సిన్, లేక కర్మ, అనేది యెంతమంచివాడినైనా, యెంత కట్టుదిట్టమైనవాడినైనా రెక్కపట్టుకుని తప్పుతోవలోకి లాగుతుందండి. తమకు విశదము కానిది యేమున్నది?

సౌజ—"బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" అని గీత చెబుతూంది. యెవడిచెడ్డ వాడు దాచుకుని, మంచినే పైకి కనపర్చుతాడు.

కొత్తమనిషి—ఒకానొకరు లేని మంచిని కూడా ఉన్నట్టు ప్రచురపరిచి లోకాన్ని భ్రమింపచేస్తారు.

సౌజ—సత్యం. అందుచేతనే మంచిచెడ్డలు మనసే యెరుగవలెగాని లోకమే యెరుగును అని అన్నాను.

కొత్తమనిషి—నటనవల్ల కొద్దికాలమే లోకానికి కళ్ళు కప్పవచ్చునుగాని, నిడివిమీద బంగారాన్ని, యిత్తడిని లోకం యేర్పరుస్తుందండి. (గిరీశంతో) యేమంటారు?

గిరీ—పంతులుగారికి నిద్రాభంగమౌతుంది, మీరు వచ్చినపనేదో—

కొత్తమనిషి—సౌజన్యారావు పంతులుతో స్వాభావికంగా మంచికి లోకం గుడ్డి, చెడ్డ వెతకడానికి చారెడుకళ్ళు; గనక, చూచ్చూసి, లోకం ఈయన మంచివారు అని నిర్ధారణచేసినతరవాత, వారు మంచివారు కాకతీరదండి — తమవంటి మంచివారు వలవేస్తే యెక్కడా కనపడడం కష్టంఅండి. గనక తమ దర్శనం నాకు కావడంవల్ల యీరోజు, నాజన్మానికల్లా సుదినంగా భావించి సంతోషిస్తున్నాను.

గిరీ—(సందేహావేఁవిఁటి!)

సౌజ—మంచిగా ఉందావఁని ప్రయత్నిస్తున్నాను. అంతకన్న నాయందు యోగ్యత యేమీలేదు. మీరు వచ్చినపని చెప్పారుకారు.

గిరీ—నేను కనుక్కొని తమతో ఉదయం మనవిచేదునా?

సౌజ—జరూరు పనిమీద వచ్చినవారూ, పేరుచెప్పనివారూ, మీతో వారి కార్యం చెబుతారా? మీది యెంత సత్యకాలం!

గిరీ—వారికి నేనేమైనా సాయంచేయడానికి అవకాశం ఉంటుందేమో అనీ, తమకు నిద్రవేళైందని మనవిచేశాను.

కొత్తమనిషి—గిరీశంగారు లోకోపకారపరులు.

సౌజ—మీకు కృతపరిచితులా?

కొత్తమనిషి—వారిని యెరగనివా రెవరండి?

గిరీ—వారు నాయందు ఉండేదయచేత అలా శలవిస్తున్నారుగాని, నన్ను అంతా యెరగడానికి నేనేపాటివాణ్ణనిడి. అయినా తరుచుగా లెక్చర్లు యిస్తూ ఉండడంచాత, వీరివంటి సత్పురుషులు నన్ను యెరిగిఉండడం కద్దు; సత్కరించడం కద్దు. వీరిని కూడా నేను చూచిఉందును. అందుచేతనే వీరు కనపడగానే, యెవరు చెప్మా చూచినట్టుందీ! అని కలవరపడ్డాను. వారు కూడా ప్రచ్ఛన్నులై ఉందామని నిశ్చయించుకున్నారు గనక, నేను జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నం చెయ్యను; నేను పోయి పరుంటాను. తాము ఉభయులు మాట్లాడుకోవొచ్చును.

సౌజ—అలాగే చెయ్యండి.

గిరీ—(సౌజన్యారావు పంతులుతో) నమస్కారం, (క్రొత్త మనిషితో) మీరు బ్రాహ్మలా?

కొత్తమనిషి—కాను.

గిరీ—(కొత్త మనిషితో) అయితే, దాసోహం!—టుదిఅనోన్! (నిష్క్రమించుతూ గుమ్మముదగ్గరకు వెళ్ళి తిరిగిచూసి కొత్తమనిషిని బతిమాలుకున్నట్లు అభినయించి వెళ్ళును.)

సౌజ—గిరీశంగారు కవి — మహాయోగ్యుడైన చిన్నవాడు.

కొత్తమనిషి—వితంతువులను పెళ్లాడడం, యాంటీనాచి కూడా మంచికిఅవశ్యకరేనా అండి?

సౌజ—వితంతువులను, యిష్టమైతే పెళ్ళాడవొచ్చును లేకుంటే మానవొచ్చును.

మంచితో దానికి పనిలేదు. గాని వేశ్యాసంసర్గ కలవాడు యెన్నడూ మంచివాడు కానేరడు.

కొత్తమనిషి—అంతేనా అండి, లేక వేశ్యను చూడరాదు; వేశ్యతో మాటాడరాదు; వేశ్యపాట వినరాదు; అని నిర్ణయంకూడా వున్నదాండి?

సౌజ—అలాటి నిర్ణయం ఉంటే మరీ మంచిది.

కొత్తమనిషి—తమరు యాంటినాచ్ అనుకుంటాను.

సౌజ—ఔను.

కొత్తమనిషి—(చిరునవ్వు నవ్వుతూ) గిరీశంగారూ యాంటీనాచేకదా అండి?

సౌజ—మీకు తెలియదా? ఆయన యాంటినాచికి గురువు.

కొత్తమనిషి—ఆయన నాకుకూడా గురువులేనండి.

సౌజ—అలాగనా? నాకు చాలా సంతోషం.

తమనిషి—యీవిషయంలో చాలాకాలవాయి నాకు వక్క సందేహం వుండిపో యింది; క్షమిస్తే మనవిజేస్తాను'

సౌజ—చెప్పండి - తప్పేమి?

కొత్తమనిషి—వేశ్యలను పాటకు పిలవకపోతే, వాళ్ళు బతకడం యెలాగండి?

సౌజ—పెళ్ళి చేసుకుంటేసరి.

కొత్తమనిషి—గిరీశంగారిలాంటివారిని అనా తెను అభిప్రాయం?

సౌజ—యేమిమాట అన్నారు! రేపో నేడో ఆయన ఒక పవిత్రమైన వితంతువును పెళ్ళికానైయున్నారుగదా, వేశ్యనా పెళ్ళాడుతారు?

కొత్తమనిషి—జపానుదేశంలో గెయిషాలని వేశ్యలు వున్నారనీ, వాళ్ళనిగొప్ప గొప్ప వారు కూడా పెళ్ళాడతారనీ యీ గిరీశంగారే కాబోలు చెప్పగా విన్నాను. జపాన్ దేశం గొప్పదేశం అని అంటారండి?

సౌజ—ఔనుగాని, గొప్పదేశంలో ఉన్న చెడ్డనే మనం అవలంబించాలా? గిరీశం గారు అట్టి అపవిత్రమైన పనికి ఇయ్యకొనరు.

కొత్తమనిషి—అయితే పెళ్ళిచేసుకోగోరిన వేశ్యలకు కోరతగిన వరులు దొరకడం యెలాగండి? లేక యెట్టివారైనా సరే అని తమ అభిప్రాయమా అండి?

సౌజ—యీసంగతి యింకా నేను బాగా ఆలోచించలేదు—వేశ్యలు విద్యలు నేర్చి యితరవృత్తులవల్ల సత్కాలక్షేపము చెయ్యరాదా?

కొత్తమనిషి—అట్లాచేస్తే, తమవంటివారు వాళ్ళను వివాహమాడుతురా?

సౌజ—యేం ప్రశ్న? నేను యెన్నడూ వేశ్యను పెళ్ళాడను. నాయెత్తు ధనం పోస్తే వేశ్యను ముట్టను.

కొత్తమనిషి—ప్రమాదంవల్ల వేశ్యశరీరం తమకు తగిలితే?

సౌజ—(నవ్వుతూ) తగిలిన శరీరం కోసేసుకుంటాను. చిత్రమైన ప్రశ్న లడుగు తున్నారు?

కొత్తమనిషి——వేశ్యజాతి చెడ్డ కావచ్చును గాని తాము శెలవిచ్చినట్టు చెడ్డలో మంచి ఉండకూడదా? మంచి యెక్కడనున్నా గ్రాహ్యంకాదా అండీ?

సౌజ——మంచి యెక్కడనున్నా గ్రాహ్యమే గాని మీరు వచ్చినపని చెప్పేరు కారు?

కొత్తమనిషి——నా పనిమట్టుకు మిమ్మల్ని చూడడమే.

సౌజ——చూడడానికి నిశీథవేళ రావలెనా?

కొత్తమనిషి——మీ పని మించిపోకూడదని యిట్టివేళ వచ్చాను.

సౌజ——మించిపోయే పనులేవీ నాపనులు లేవే?

కొత్తమనిషి——పరవస్థలో ఉన్నవారి పనులల్లా తమ స్వంతపనులుగానే యోచింతురని లోకులవల్ల విన్నాను. నాకేం లేదు. అవధాన్లుగారి కేసులో గట్టి సహాయం చెయ్యగలిగినవారి నొకరిని నేను యెరుగుదునండి.

సౌజ——అలాగైతే మిమ్మల్ని మాపాలిట దేవుణ్ణిగా భావిస్తాం.

కొత్తమనిషి——అంతమాట నాకు దక్కాలిగదా అండీ?

సౌజ——యేమి అలాగ అంటున్నారు?

కొత్తమనిషి——మరేమీ లేదు. ఆ కార్యసాధనము ఒక వేశ్యవల్ల కావలసి ఉన్నది. అదీ చిక్కు.

సౌజ——డబ్బు యిద్దాం.

కొత్తమనిషి——ఆ వేశ్య ద్రవ్యానికి సాధ్యురాలు కాదండి.

సౌజ——అయితే మరేమి కోరుతుంది?

కొత్తమనిషి——ఆ మె కోరిక అసాధ్యమని తలుస్తానండి.

సౌజ——అయినా యేమిటో చెప్పండి.

కొత్తమనిషి——చెప్పితే మీకు ఆగ్రహం రావడమే కాని, కార్యం ఉండదనుకుంటానండి.

సౌజ——తనను ఉంచుకోమంటుందా యేమిటి! అది యెన్నడూ జరిగేపని కాదు.

కొత్తమనిషి——ఆ ముసలి బ్రాహ్మడి దురదృష్టం! మనమేం చేయగలమండీ?

సౌజ——యెంత బుద్ధిహీనురాలు! అసందర్భమైన యిలాటి కోరిక కోరతగునా? మీ రిలా మోసుకొచ్చారు యింత అసంభావితమైనమాట?

కొత్తమనిషి——వ్యవహార విషయములు మాట్లాడుతూన్నప్పుడు మంచైనా చెడ్డయినా ఉన్నమాటలు నాలుగూ అనుకోవడం విధాయకం కదండి. ఆమనిషి తలకి తగని వెఱ్ఱి కోరిక పెట్టుకుంది అనేమాట అన్నంతినే మనిషల్లా యెరగడా అండీ?

సౌజ——నేను మన్మథుణ్ణనా నన్ను వరించింది?

కొత్తమనిషి——మిక్కిలి మంచివారని కాబోలు.

సౌజ——సానిదానికి మంచితో పనిఉండదు. ఇది యేదో యెత్తయి ఉండాలి.

కొత్తమనిషి——ఋశ్యశృంగుడికి చదివించేమోనండి.

సౌజ——వసంతసేనలాంటి మనిషి వెఱ్ఱికవీశ్వరకల్పనలో ఉండాలి గాని లోకంలో ఉండదు. యేదోమోస్తు. అందుకు సందేహం ఉండదు——సాధనాంతరం లేదో?

కొత్తమనిషి — తమరు ప్రశ్నలు అడుగుతారు. చిన్నమాట మనవిచేస్తే ఆగ్రహిస్తారు యేం సాధనం?

సౌజ — శ్రీకృష్ణుడిఅనుగ్రహంవల్ల ఆగ్రహమనేవస్తువను చంపుకోవడమునకు సదా ప్రయత్నం చేస్తున్నాను. స్ఖాలిత్యం కనపర్చారు. కృతజ్ఞుడను. చెప్పవలసినది చెప్పండి.

కొత్తమనిషి — తమరు ఉంచుకోవడం మానక్కరించకపోతే తనను వివాహము కావచ్చునని కూడా ఆమనిషి అభిప్రాయము.

సౌజ — మంచివారిని హేళన చెయ్యవలసినదని కూడా మీతల్లిగారిఉపదేశం కాబోలు?

కొత్తమనిషి — మీశ్రీకృష్ణునిమీద అనగా మీయెడల నాకు అనూయకమైనభక్తి లేదు. తమరియెడల తృణీకారభావము నాహృదయమందు యెన్నడూ పుట్టదు నమ్మండి. రాయభారి మోసుకువచ్చేమాటలకు రాయభారిని తప్పు పట్టడం ధర్మంకాదు. ఇవి జరిగేమాటలని నేను మనవిచెయ్యలేదు. ఉన్నమాట మనవిచేస్తే, వకీళ్ళు గనక వేశ్యపెట్టిన చిక్కు విప్పజాలకపోతారా అని మనవిచేశాను.

సౌజ — వేశ్యలకు వకీళ్ళు సమదంతా అనా? (నవ్వి) నేనుమట్టుకు వోడిపోయినానని వొప్పుకుంటున్నాను. యెగతాళీలో దించకండి — వేశ్య దబ్బొల్లకపోదు. ద్రవ్యం కోరమనండి. ఆయనైనా యిస్తారు, నేనైనా యిస్తాను.

కొత్తమనిషి — అందాకా యెందుకండి? తమదాకా అక్కరలేదు. ఆబ్రాహ్మడికి ఉపకారార్థం నేనే యిస్తాను. ఆమనిషి ద్రవ్యానికి సాధ్యురాలుకాదని మనవిచేశాను; నమ్మరా?

సౌజ — అన్నట్టూ, మీరు గిరీశంగారి శిష్యుల మంటిరిగా? మీరు యాంటినాచ్ కావాలి అయితే వేశ్యవల్ల యీభోగట్టా చూవత్తూ మీకు యేలా వొచ్చింది? యిదంతా యెగతాళా? కుట్రా?

కొత్తమనిషి — నమ్మనివారితో యేమిచెప్పను? యిది కుట్రాకాదు; యెగతాళీ కాదు. నేను అక్షరాలా యాంటీనాచ్‌నే. వివేకలేశం ఉన్నవారు యెవరు యాంటీనాచ్ కారండి? కాని విధికృతంచేత నాకు వేశ్యాసంసర్గం తప్పిందికాదు.

సౌజ — యేమిటో ఆవిధికృతం?

కొత్తమనిషి — ఇది! (కొత్తమనిషి నెత్తిని ఉన్న పాగాతీసి జుత్తును జారవిడచి; వెనక్కు తిరిగి తొడుగుకున్న కోటు విడచి, కప్పుకున్న శాలువ వలెవాటుగా వేసుకొని సౌజన్యారావుపంతులువేపు తిరిగి) నావూరూ పేరూ అడిగితిరి. ఊరు విజయనగరం; పేరు మధురవాణి!

సౌజ — (మొదట ఆశ్చర్యనిమగ్నుడై, యోచనపైని కోపావేశముకలిగి నిలిచి) యేమి మోసము జరిగినది!

మధు — గురువుల ఉపదేశం గురువులే మరవకూడదు. చెడ్డలోకూడ మంచి ఉండవచ్చును. కాక మంచిచెడ్డలు యెంచేవా రెవరు?

సౌజ — యేమి దగా?

మధు—నిర్మలమైన అంతఃకరణతో వస్తిని నిజం దేముడెరుగవలె. పగా అని తోంచినది; యేమి చెయ్యగలను? వెళ్లతాను.

సౌజ—శీఘ్రుంగా వెళ్ళవచ్చును.

[మధురవాణి పాగా కోటూ విడిచి గుమ్మమువరకు వెళ్ళును.]

సౌజ—నిలు - నిలు - (మధురవాణి తిరిగి వచ్చి, కొంచెము యెడముగా యెదట నిలుచును.)

సౌజ—పాగా కోటూ మరిచిపోయినావు.

మధు—అంతేనా? మనసేమరిచిపోయినాను; కొందవేవింటి? (తిరిగి రెండడుగులు వెళ్ళును)

సౌజ—మాట !

మధు—(తిరిగిచూచి) యీమాటు యేం మరిచానండి?

సౌజ—నువ్వు మరవలేదు, నేనే మరిచాను. లుబ్ధావుధాన్లుగారి మాటేమిటి?

మధు—తమ మంచి లోకప్రసిద్ధమైనప్పటికీ, ఆయనయందు తమకు అట్టే అభిమానం భగవంతుడు పుట్టించలేదు.

సౌజ—ఆయనను కాపాడడముకు న్యాయమైనపని యేమి చెయ్యమన్నా చేస్తాను. అనేకసంవత్సరములాయ, వేశ్య అన్నది నాయింటికి రాలేదే? నేను వేశ్యతో యెన్నడూ మాట్లాడలేదే? యీనాటికి వ్రతభంగమైనదిగదా. అపారమైన విచారములో మునిగిఉన్నాను.

మధు—తమరు ప్రాజ్ఞులు వ్రతభంగమేది?

సౌజ—నిశరాత్రివేళ పడకటింటిలో వేశ్యను పెట్టుకుని మాట్లాడడం కన్న యింకా యేమి కావలెను?

మధు—తమరు నన్ను రప్పించలేదే? వేశ్యలు పార్టీలైతే, వకీళ్ళు కేసులుపట్టరా?

సౌజ—పడతాం, పట్టం; యేమైనా నువ్వు పార్టీవైనా కావే?

మధు—కాను గాని మీపార్టీని కాపాడే మనిషిని నేను యెవతెనైతే నేమి - నన్ను చూడకూడదా? అది అలా ఉండగా వేశ్యలము దేవాలయములలో భగవంతుణ్ణి చూడడముకు పోవచ్చునుగదా సత్పురుషులైన తమవంటివారి దర్శనమునకు మాత్రం నిరోధమా?

సౌజ—"మంచివారు, మంచివారు" అని పలుమారు అంటూ ఉంటే నాకు లజ్జగా ఉంది. ఆమాట మరి అనకు - చూడ రావచ్చునుగాని రాత్రివేళ పడకింట్లోనా !

మధు—వేశ్యనని వర్తమానంచేస్తే పగటివేళ చూతురో?

సౌజ—నాశత్రువులు యెవళ్ళో నిన్ను నాదగ్గిరకు పంపారు. (నఖసిఖపర్యంతం నిదానించి) యెంతటివాళ్ళయినా ఉంటారు!

మధు—అలాగైతే తమ్మంచే తమకు శత్రువై ఉండాలి. మీకార్యం నిర్వహించి డబ్బు ఒల్లనప్పుడు కుట్రా కూహకంలేదని నమ్మరదురా?

సౌజ—అంత మంచిమనిషివి అయితే, పాపము ఆబ్రాహ్మడికి ఉపకారం నీవు చెయ్యరాదా? మధ్య నాగండకత్తెరేమి?
మధు—నేను మంచిదాననని నమ్మగలరా?
సౌజ—ఆబ్రాహ్మణ్ణి కాపాడితే నమ్మనా?
మధు—అయితే, ఒకతుని తగువు మనవిచేస్తాను.
సౌజ—అట్టేసేపు నువ్వు నాయెదుట గానీ నిలిచిఉంటే, నువ్వు యేతగువు తీరిస్తే ఆతగువుకు వొప్పుదల అవుతానేమో అని భయమువేస్తూంది.
మధు—(ముఖము ప్రక్కకు తిప్పి) ఒక్కచిన్నముద్దుకు కరువో?
సౌజ—అంతటితో కార్యం నిర్వహిస్తావా?
మధు—యేంజెయ్యనూ, మరి?
సౌజ—నావ్రతభంగం చెయ్యడవేఁనా నీపట్టుదల?
మధు—అడుగుమెట్టుకు దిగానని మెప్పులేదుగదా? యిష్టం లేనిపని యేల చేయించవలె? శలవు. (రెండు అడుగులు వెళ్ళును)
సౌజ—ఆగు (మంచముమీద కూర్చుని దుప్పటి కప్పుకుని) కూచో.
మధు—కూచోను.
సౌజ—వెయ్యిరూపాయలిస్తాను తీసుకుని బ్రాహ్మణ్ణి కాపాడు.

[మధురవాణి తిరిగి వెళ్ళబోవును]

సౌజ—వెళ్ళకు - నీకు ముద్దా కావాలి? యేం వెఱ్ఱిమనిషివి! యేమి కావాలి?
మధు—నాకు తెలియదు.
సౌజ—తప్పదూ?
మధు—తప్పదనుకుంటాను.
సౌజ—అయితే విధిలేక వొప్పుకుంటున్నాను. చిత్రం! వెయ్యిరూపాయలకంటె ఒక ముద్దు యెక్కువవిలవా?—సరే-నువ్వు చేసే సాయవేఁదో చెప్పు.
మధు—తెల్లబిచ్చ్యం, పాటిమానికా - లుబ్ధావధాన్లుగారు వివాహమైనపిల్ల ఆడపిల్ల కాదు.
సౌజ—(ఆశ్చర్యముతో) యేమిటీ!
మధు—మరచితిని - అందుతో సంబంధించినవారికి యెవరికిన్నీ హానిరాకుండా కాపాడతానని శలవిస్తేనేకాని పేర్లు చెప్పజాలను.
సౌజ—లేకుంటే చెప్పవా?
మధు—చెప్పను.
సౌజ—లుబ్ధావధానులుగారివల్ల యెవరికిన్నీ బాధలేకుండా కాస్తాను. ఆయనకు కాక యితరులు యెవరైనా హానిచేసిఉంటే, నావశం కాదు.
మధు—చాలును. యిహ చెబుతాను. కరటకశాస్త్రుల్లుగారు వారిశిష్యుడికి ఆడవేషం వేసి పెళ్ళిచేశారు
సౌజ—కరటకశాస్త్రుల్లా గుంటూరు శాస్త్రుల్లు!

మధు—అవును. కొంచం చిరిగెడ్డం అంతే భేదం—

సౌజ—ఔరా? ఆతగాడి దారుణం!

మధు—ఆతనివల్ల తప్పు లేదండి, అగ్నిహోత్రావధాన్లు గారి కూతురు ఆయన మేనకోడలు ఆపిల్లని లుబ్ధావధానులు గారికి యివ్వడానికి నిశ్చయమైన సంగతి తమకు విశదమే. ఆసమ్మంధం తప్పించుటకు కరటక శాస్త్రుల్లుగారు యీయెత్తు యెత్తారు. ఆ మాటవరకు మాత్రం పైకి రానీకండి.

సౌజ—ఔరా? యేమి చిత్రము! మేలుకున్నానా నిద్రబోతున్నానా?

మధు—నా ఫీజు యిచ్చి సుఖనిద్రపోండి.

సౌజ—బీదవాణ్ణి యిచ్చుకోలేనే?

మధు—నాకు లోకంలో ధనవంతా అనే అనుకున్నానే?

సౌజ—నీవు సొగసరివి. ముద్దుచేదని కాదు. వ్రతభంగం గదా అని దిగులు.

(ముద్దుపెట్టుకొనబోవును)

మధు—ఆగండి.

సౌజ—ఏమి?

మధు—నావ్రతమో?

సౌజ—యేమిటది?

మధు—చెడనివారిని చెడగొట్టవద్దని మాతల్లి చెప్పింది.

సౌజ—చెప్పితే?

మధు—అందుచేత ముద్దుపెట్టుకోనివ్వను.

సౌజ—కృతజ్ఞుడనైతున్నాను!

మధు—ఆపుస్తకము నేను చూడవచ్చునా అండి?

సౌజ—చూడు.

(మధురవాణి పుస్తకము విప్పి చదువును)

మధు—భగవద్గీతలు. యిది మంచివారు చదివే పుస్తకమా అండి?

సౌజ—యిది చెడ్డవారిని మంచివారినిగా చేశే పుస్తకం.

మధు—దానిలో యేముందండి?

సౌజ—అది చదివినవారికల్లా విలవలేని గొప్పస్నేహితుడొకడు దొరుకుతాడు.

మధు—యెవరండి ఆస్నేహితుడు?

సౌజ—శ్రీకృష్ణుడు.

మధు—శ్రీకృష్ణుడు సానిదానితో కూడా స్నేహం కడతాడా అండి?

సౌజ—శ్రీకృష్ణుడు తన్ను నమ్మినవారితో అల్లా స్నేహం కడతాడు పరమాత్మకు జాతిభేదం లేదు.

మధు—శ్రీకృష్ణుడు అంటేనాచికాడా అండి?

సౌజ—యేమి వెంకెవు!

మధు— అయితే యీ పుస్తకం చదువుతాను. చదివి మంచిదాన్ని అవుతాను.

సౌజ— కావలిస్తే ఆ పుస్తకం తీసుకువెళ్లు.

మధు— కృతార్థురాలను— శెలవా?

సౌజ— (కన్నుకుప్పవైపు ఆలోచించి) నువ్వు మంచిదానివి. ఎవరో కాలం జారిన సత్పురుషుడిపిల్లవైవుంటావు. యీ వృత్తి మానలేవా స్థితిలోపమా?

మధు— దైవానుగ్రహంవల్ల లోపంలేదు. నావృత్తియొక్క హైన్యతే గుర్తెరుగుదును. సత్పురుషులను సంప్రాప్తమైనతరువాత దుర్వృత్తి యేలవుంటుంది?

సౌజ— (భగవద్గీతాపుస్తకముమీదనున్న శ్రీకృష్ణునివిగ్రహమును వేలున జూపి) సత్పురుషుడనేనామము సార్థకముగాగల యీసత్పురుషుణ్ణి నీకు యిచ్చాను. ఆయన స్నేహం బలమైనకొలదీ, మాబోట్లను తలచవు,

మధు— అప్పటప్పుడు తమదర్శనము చేసుకోవచ్చునా?

సౌజ— (తటపటాయించును.)

మధు— వృత్తిమానినా మంచివి.

సౌజ— అయితే రావచ్చును.

మధు— కృతార్థురాలను. (పుస్తకము వక్షస్సున అని చేతులు జోడించి) శెలవు!

సౌజ— మరోమాట! (మధురవాణి ప్రశ్నార్థకముగా కనుబొమలెత్తి చూచును) నీకు గిరీశంగారి పరిచయం యెక్కడ?

మధు— క్షమించండి.

సౌజ— చెప్పవా?

మధు— తాము చెప్పకతీరదని ఆజ్ఞాపిస్తే దాటగలనా? పాపము ఆయనను బతకనియ్యండి.

సౌజ— అతడి బతుకుమాట ఆలోచించుతున్నావు. వాడు అన్యస్థుడైతే, పాపము ఆబుచ్చమ్మ బతుకు చెడుతుంది. అది ఆలోచించావుకావు.

మధు— (ఆలోచించి) అవును. ఆయన నాకు కొంతకాలం యింగిలీషు చదువుచెప్పేవారు. కొంతకాలం ఉంచుకున్నారు కూడాను.

సౌజ— యెన్నాళ్ళకిందట?

మధు— మొన్న మొన్నటిదాకా.

సౌజ— చిత్రం! ఒక్కనిమిషము ఆగు. (పైకివెళ్ళి గిరీశమును వెంటబెట్టుకొని వచ్చి) నెపోలియన్ ఆఫ్ యాంటీనాచ్ గారూ! యీ మెను మీరు యెరుగుదురా?

గిరీ— కొంతకాలం కింద గిరీశం అనే ఫూలిష్ యంగ్ మాన్ వొకడు ఉండేవాడు. మధురవాణి అనే ఆబ్యూటిఫుల్ నాచిడెవిల్ ఒకతె ఉండేది వాడి దురదృష్టంవల

దానివల్లలోభిచిక్కి, మైమరచి అంధకారంలో పడిపోయినమాట సత్యం [illegible] ఉపదేశం కొంతకాలానికి జ్ఞప్తికి తెచ్చుకొని ఆ అంధకారంలోంచి [illegible] వులపాపములు చేరుకొని గతంకలగా భావించి మరచి మంచిత్రోవ [illegible] ఆగిరీశవే యీగిరీశం. ఆమధురవాణే యీమధురవాణి. స్వస్థానికి [illegible] వాయిగా ఉన్న నన్ను నరకానికీ లాగడానికి తిరిగీ యిక్కడ నావు [illegible] ఆవిర్భవించింది! ఐటరన్‌డ్ ఆల్టుగెదర్ ఏన్యూలైఫ్—పాపంలో [illegible] పశ్చాత్తాపపడి, రిఫార్మ్డ్ అయినాను. నావంటి సిన్నర్స్‌ని సహాయం [illegible] వాళ్ళని చెయ్యడం తమ బిరుదుగాని, బ్రతుకు చెరచడం న్యాయం కా[illegible] యువర్ మెర్సీ!

సౌజ—యెన్నాళ్ళయింది చీకట్లోంచి వెలుతురులోకి వుఱికి?

గిరీ—(వూరకుండును.)

సౌజ—(మధురవాణితో) నువు చెప్పగలవు.

గిరీ—యెన్నాళ్ళయితేనేమండీ? ట్రూరిపెంటెన్సు ట్వెంటీఫోర్ అవర్సు చా[illegible]

సౌజ—ఔరా? నీలాంటి ఆషాఢభూతులవల్ల నీగురువుగారు యెంతనుబ[illegible] పడతారూ! ఆరు, నన్ను కూడా భ్రమింపజేస్తివే! నిన్ను పరి చేసనివ్వ[illegible] మ్మను పూనాలో విడోసు హోముకు పంపమనీ మీగురువుగారికి [illegible] యిస్తాను. ఆమె చదువుకుని ప్రాజ్ఞురాలై తనయిష్టం వచ్చిన వారిని పె[illegible] టుంది. లేకుంటే మానుతుంది రిఫారమ్ అయితివనిగదా నీవు చెప్పితివి. [illegible] కాలేజీలో ప్రవేశించి, పైపరీక్షలకు చదువుకో. నీప్రవర్తన బాగున[illegible] ద్రవ్యసహాయం చేస్తాను. బుద్ధితెచ్చుకుని బ్రతుకు. మధురవాణిని [illegible] డెవిల్. ఆమె నీఆయోగ్యత అయినా నొక్కి అడిగితేనేగాని చెప్పి[illegible] వకసత్యకాలపుబ్రాహ్మడిని కాపాడడమే కాకుండా, దుర్మార్గుడి [illegible] పడకుండా బుచ్చమ్మను కాపాడింది. నాకు ఒక మహోపకారం కూడా [illegible] గనుక, నాసంతోషమును తెలియచేయుటకు యిదిగో ఆమెతో ష[illegible] చేయును.) నెపోలియన్! తత్క్షణం యింట్లోనుంచి పైకి పో!

[గడిగుమ్మము దాటి]

గిరీ—డామిట్! [illegible] అడ్డంగా తిరిగింది!

([illegible])